# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



మార్చి 1974

సంపుటము : 51 : సంచిక : 3 :

విడిపత్రిక వెల రూపాయిన్నర

# భారతి

## పాఠకులకు మనవి

అనివార్యకారణాలవలన భారతి (మాసపత్రిక) ఫిబ్రవరి నెల సంచిక నుండి వెల ఈ క్రిందివిధంగా ఉంటుందని పాఠకులకు మనవి చేసుకుంటున్నాము.

## విడిప్రతి రు. 1–50 పై.

## చందా వివరాలు

| | పోస్టు ద్వారా |
|---|---|
| సంవత్సరానికి | రు. 19_౨0 |
| అర్థ సంవత్సరం | రు. 9_60 |

గమనిక:— ఇదివరకే చెల్లించిన చందాలు పైరేట్ల కనుగుణంగా సవరించబడును.

మేనేజరు

భారతి.

# విషయానుక్రమణిక

## మార్చి 1974


| | | |
|---|---|---|
| నేనూ—అతడు | డా. సి. నారాయణరెడ్డి | 1 |
| మణి ప్రవాళమూ—ఆరుద్రా | శ్రీ టి. జి. కృష్ణారావు | 2 |
| కొండెక్కని దీపాలు | శ్రీ సీరపాణి | 11 |
| అపటిక్షేపాది వివరణము | కీ. శే. నేలటూరు రామదాసయ్యంగార్ | 12 |
| "మరుపురాని మా ఊరు" | శ్రీ పులికంటి కృష్ణారెడ్డి | 19 |
| అరవైయేళ్ల ఆంధ్రసాహిత్యంలో నిలిచేది | శ్రీ నోరి నరసింహశాస్త్రి | 32 |
| సమరం | శ్రీ కె. ఎస్. వి. నరసింహమ్ | 36 |
| సంశోధిత మహాభారతము — అనుశాసనిక పర్వము | కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు | 37 |
| ఒక ఉత్తరం—జవాబు | శ్రీ వి. ఆర్. శశిధరుడు | 47 |
| శ్రీ బులుసు వేంకటేశ్వరుల కవితాప్రశస్తి | 'తెలుగు విద్యార్థి' | 53 |
| కలగూరగంప | | 59 |
| గ్రంథ విమర్శలు | | 64 |

# నేనూ - అతడు

## డా॥ సి. నారాయణ రెడ్డి

రాస్తున్నాను
కొట్టివేస్తున్నాను
ఐనా — ఇన్నిన్ని గీతాలు.
అతడూ అంతే.
రాస్తున్నాడు
కొట్టివేస్తున్నాడు
ఐనా — అన్నన్ని జీవితాలు.
నా సృష్టికి అర్థంలేదు
పరమార్థం ఉంది.
ఆ సృష్టికి హేతువు లేదు
అగుపించని సేతువుంది.
ఇద్దరిలో ఎవరు గొప్ప?
ఏది తాబేలు? ఏది డిప్ప?
ఈ ప్రశ్నలు బీజాన్ని అడుగు
చెబుతుంది.
దానికి చేతకాకుంటే
దాని కుదుట్లో మొలిచిన
భుజాన్ని అడుగు.
పాపం ఆ చెట్టు
పలురకాలుగా కత్తిరించిన జుట్టు.
ఏం చెబుతుంది అది
వృక్షంలోనే విత్తనముందని
సమాధానంలోనే ప్రశ్న ఉందని.
నేను రాస్తున్నది తుడిచి వేస్తున్నది
గీతం కాదు స్వరలిపి.
అతడు గీస్తున్నది సీలువేస్తున్నది
అదృష్ట ఫలకంమీద భాస్వర లిపి.
స్వరం గొప్ప భాస్వరం కంటె
గీతిక గొప్ప జాతకం కంటె
అతని కంటె నేనే గొప్ప
ఆత్మచేతన అంటూ వుంటే.

# మణి ప్రవాళమూ-ఆరుద్రా

శ్రీ టి. వి. కృష్ణారావు

మధుర మధుర భాషా సంస్కృతాన్యోన్య సమ్మేళన సురభిళా' అని లీలా తిలకంలో మణిప్రవాళం పొగడబడింది. మణిప్రవాళం అంటే మణులూ, ప్రవాళాలూ కలిపి కూర్చిన హారం. మలయాళ, సంస్కృత భాషల్ని ఆ విధంగా మిశ్రితం చేసి చెప్పిన కవిత్వాన్ని మణిప్రవాళం అంటున్నారని సాహితీ పరులకు తెలుసు.

ఒక కాలంలో పండితులు సంస్కృతాంధ్రాలు కలిపి మాట్లాడేవారనీ, ఆ లక్షణం వారి కవిత్వానికి కూడా అప్పుడప్పుడు పట్టేదనీ, అది మణిప్రవాళ శైలికి దారి తీసిందని తిమ్మావజ్ఝల కోదండరామయ్య[1] గారంటున్నారు. ఈ అభిప్రాయం సమంజసంగానే వుంది. ఒక భాషలోనికి ఇతర భాషలనుండి అవసరం కోసమూ, ఔన్నత్యంకోసమూ కూడా పదాలు ఎరువు తెచ్చుకోవడం జరుగుతుంది. దక్షిణాపథంపై ఆర్యుల ప్రాభవంతోబాటు ఆర్యభాషైన సంస్కృత ప్రభావం దక్షిణాది భాషలపై పడింది. ద్రావిడభాషా పండితులు తమ సంభాషణల్లో సంస్కృతాంధ్రాలను కలిపి మాట్లాడినట్లే రచనల్లో కూడా కలిపి వ్రాశారు. దాన్నే మణిప్రవాళం అన్నారు.

మణిప్రవాళం మలయాళంలో ఎక్కువ ప్రాచుర్యం వహించింది. దీని ప్రధాన లక్షణం సంస్కృత విభక్త్యంతాలతో తెలుగు పదాల్ని మిశ్రమం చేసి వ్రాయడం. తెలుగులో నృపాధిప శతకంలో మణిప్రవాళానికి ఉదాహరణలు కానవస్తున్నాయి. కాని తెలుగులో మణిప్రవాళం అంతగా ఆదరణ పొందలేదు. 'నపదాన్వ్యయ సుప్తిజ్‌క్త్వా తుమునాం' అని ఆంధ్ర శబ్ద చింతామణి సంస్కృత విభక్త్యంతాలు కలపడం నిషేధించింది. కేతన కూడా ఇటువంటి రచనను నిరసించాడు. కవిరాజమార్గకారుడూ, తిరుజ్ఞాన సంబంధరూ కన్నడ, తమిళ భాషల్లో మణిప్రవాళ శైలిని వాడటం నిరసించారు.

ఆ కారణంచేత తెలుగులోకి సంస్కృత పదాల్ని గ్రహించినా వాటిని దేశీయాకరించి తెలుగు విభక్తులతోనే ప్రచురంగా ప్రయోగించారుగాని సంస్కృత విభక్త్యంతాలతో మలయాళంలో లాగా రచించలేదని తెలుస్తోంది.

ఆదికాలంలో సంస్కృతం ఎంత గణనీయమైన ప్రభావం నెరపిందో, అంతే ప్రభావం మధ్యకాలంలో ఉర్దూభాష నెరపింది. పాలకులైన మహమ్మదీయులతోబాటు, ఉర్దూభాష తెలుగుభాషా సాహిత్యాల మీద రాజ్యం చేసింది. ఉర్దూభాష తెలుగువారి జీవితంలో భాగమైంది. ఉర్దూ, తెలుగు భాషలు కలిపి వ్యవహరించే పరిపాటి ఏర్పడింది. ఇది సాహిత్యంలో కూడా చోటు చేసుకోవడం సహజం. అయితే సంస్కృత విభక్త్యంతాలు ప్రవేశించడాన్నే అంగీకరించని లాక్షణికులు, ఉర్దూ విభక్త్యంతాలు మాత్రం అంగీకరిస్తారా? వీటిని కూడా దేశీయాకరించి మాత్రమే ప్రయోగించారు.

'ఉర్దూ పారశీకములందలి విశేష్య విశేషణములకును, ధాతువులకును తెలుగు సహాయక క్రియలు చేర్చి క్రొత్త ధాతువులను తెలుగువారు కల్పించుకొనిరి. 'ఇంచుక్, ఆయించు' మున్నగు ఆగమములతో నేర్పడిన ధాతువులు క్రియారూపములు పెక్కు కలవు. ఇట్టివి దాదాపు అయిదు వందలు కలవు. నిఘంటువుల కెక్కనివియు, వ్యవహారమున మాత్రమే ప్రచు

---

1. మణిప్రవాళభాష—తిమ్మావజ్ఝల కోదండ రామయ్య భారతి — డిసెంబరు 1972, జనవరి 1973.

రితములగు నవియు, నగుధాతువులు పెక్కు కలవు'— అని డా॥ కే. గోపాలకృష్ణారావు[2]గారు వ్రాశారు.

సంస్కృత ధాతువులు తెలుగులోకి తీసుకున్నప్పుడు 'ఇంచుక్' ఆగమంతో తీసుకోడం సర్వసామాన్యం. కాని ఉర్దూ, పార్శీ పదాలు 'ఇంచుక్, ఆయించు' ఆగమాలతో వ్యవహారంలో గ్రహించినా కావ్యాలలో మాత్రం చాలా కాలం వరకూ ప్రయోగించడానికి సాహసించలేదు. యథాతథంగా పదాలు గ్రహించి వాటిని తెలుగు సహాయక క్రియలతో కలిపి ప్రయోగించారు.

'ఎవ్వాడు నలువ లేరేక్కి యష్టాదశ
ద్వీపాళి యసివారు దిరిగె లీల.'

(కాశీఖండము—4 ఆ - 194)

అని శ్రీనాథుడు 'స్వారిచేయు' అను క్రియార్థంలో 'అసి వారు దిరిగె' అని ప్రయోగించాడు. 'తిరుగు' అనే సహాయ క్రియతో 'అస్వార్' అనే పదం కలిపి ప్రయోగించబడింది.

'రామ మమ్ము లూటి సేయరాకు'

'కరి మయూర, మరాళికలకు నొయ్యార మీ
నా మిచ్చి నడుపు సన్నంపు నడపు'

(వరాహ పురాణము—నందిమల్లయ,
ఘంట సింగయ)

అనే ప్రయోగాల్లో నందిమల్లయ, ఘంట సింగయలు 'సేయు, ఇచ్చు' అనే సహాయ క్రియలతో 'లూట్నా, ఇనాము' అనే పదాల్ని కలిపి ప్రయోగించారు.

ఈ పరిశీలనని బట్టి ఉర్దూ, పార్శీ పదాల్ని గ్రహించినప్పుడు నామవాచకాలకి గాని, క్రియలకిగాని సహాయ క్రియలు చేర్చి మాత్రమే కావ్యాల్లో ప్రయోగించేరని తెలుస్తోంది. కాని సంస్కృత పదాల్లాగా 'ఇంచు'గాగమం చెయ్యలేదు.

అయితే విశేషమేమిటంటే సంస్కృత ధాతువులతో 'ఇంచుక్' చేర్చబడ్డకాలం నాటికి 'ఇంచు' అనేది సహాయ క్రియగా ప్రత్యేకార్థం గల పదమే.

'ఏము గాకున్న మా యయ్య కించు నెట్లు' అని తిక్కన భారతంలో 'ఇంచు' అనేది ప్రత్యేక క్రియగా ఇష్టపడు అనే అర్థంలో ప్రయోగించాడు. 'ఇంపు' అనేది యీ ధాతువులోంచి వచ్చిందే. కాని ఉర్దూ పదాలు గ్రహించేనాటికి 'ఇంచు' సహాయ క్రియా లక్షణం కోల్పోయింది. ఇతర సహాయ క్రియలు ఆ స్థానాన్ని ఆక్రమించాయి. ఇంచుగాగమంతో ప్రయోగించడం సంస్కృతంతో సామ్యంవల్ల జనసామాన్యంలో బాగానే వ్యాప్తిలో వుంది. కాని పండితులు దీన్నంత ఎక్కువగా ప్రయోగించలేదు.

'పైక మీజాలక బాకీ కటాయించి'

(రంగరాయ చరిత్ర—II ఆ 171)

'గడి ఫిరాయించి సైన్యముల్ గండడంచు'

అని యించుగాగమంతో ప్రయోగాలు దిట్టకవి నారాయణ కవి కాలంనాటికి (18 వ శతాబ్ది) మాత్రమే కనిపిస్తున్నాయి.

ఇలా తెలుగు విభక్తులతో ఉర్దూ, పార్శీ పదాల్ని ప్రయోగించడం కన్పిస్తూండగా 'ఉర్దూ పారశీక పదబంధములనే కాక వాక్యములను కూడ తెలుగు పద్యములలో చొప్పించుట ఈ యుగమునాటి తెలుగు కావ్యములలో గన్పట్టు విశిష్ట లక్షణము. ఈ ప్రయోగములందు దక్కనీ ఉర్దూభాషా ప్రభావము ప్రస్ఫుటముగ గన్పట్టుచున్నది. ఉరుదూ వాక్యములలో తెలుగు పద్యముల నల్లుట చిత్రకవితారీతి. శైలి మణిప్రవాళ శైలి—అని డా॥ కే. గోపాలకృష్ణారావు[3]గారు వ్రాస్తున్నారు.

కాని తెలుగు, ఉర్దూలు కలిపినంతమాత్రాన మణిప్రవాళం కానేరదు. ఉర్దూ విభక్త్యంతాలతో తెలుగు విభక్త్యంతాలు కలపాలి. వీరు ఇలాంటి శైలికి ఉదాహరణగా అనేక పద్యాలు చూపారు.

'దిల్సే జానో తెరా
అల్లాయన నెచట నుండు కల్లరి భువిలో
కల్లడిగిన తా నిర్చిన
బాలుడు బ్రహ్మమభవుడు బన్కరాపెంటా'

—పెంట శతకము

ఈ పద్యంలో ఉర్దూ విభక్త్యంతాలు, తెలుగు విభక్త్యంతాలు కలపడంచేత దీన్ని మణిప్రవాళ శైలి

2. తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము—డా॥ కే. గోపాలకృష్ణారావు.

3. Ibidem.

అనవచ్చు. కాని ఈ క్రింది పద్యాన్ని కూడా వీరు మణిప్రవాళం అంటున్నారు.

'బేగీ ఆరే అరబ్బీ పడోరే యని
బోడి సన్యాసుల బొడుచువారు
మత్రఖో మూపరు మాటీ యనుచు వైష్ణ
వుల బొట్లు దుడువగ బోవువారు
పత్తరు కాయకు బందియారే చోడు
దేవని శైవుల దిట్టువారు
కాల టీకా తూ నికాల్దేవటంచు మా
ధ్వులం బ్రల్లదము లాడి త్రోయువారు'
(గోగులపాటి కూర్మనాథ కవి)

దీనితో మహమ్మదీయ సైనికుల మాటలకి అనుకరణం వుంది. ఇది మణిప్రవాళం కాదు. అలా అన్ననాడు 'నాస్తి శాక బహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూపో, నాస్త్యోదన సౌష్టవంచ కృపయా భోక్తవ్య మన్నల్కులున్' అనేది కూడా మణిప్రవాళం అనవలసి వుంటుంది. ఈ విధంగా నిశితంగా పరిశీలించి చూస్తే ఉర్దూ, తెలుగులతో మణిప్రవాళ శైలిగల పద్యాలు క్వాచిత్కంగా మాత్రమే కన్పిస్తాయి.

కాలానుగుణంగా అనేక దేశాలతో మనకు గల వర్తక సంబంధాలను బట్టి ఆయా దేశ భాషా పదాలు గ్రహించబడుతూ దేశీయాకరించ బడుతూ వచ్చాయి. ఫ్రెంచి, ఇటాలియన్, ఇంగ్లీషు, పోర్చుగీసు, ఇత్యాది భాషల పదా లనేకం తెలుగుభాషలో ప్రవేశించి ఈనాడు అవి మన భాషలోని పదాలే నేమో ననే భ్రమ కలిగిం చేంతగా కలిసిపోయాయి. కావ్యాలలోనూ ప్రయుక్త మయ్యాయి.

ఆధునిక యుగంలో ప్రపంచ వ్యాప్తంగా అనేక భాషలపై ఆంగ్లభాషా ప్రభావం పడింది. ఇందుకు తెలుగు అపవాదం కాదు. స్వామీ అరవిందులు చెప్పి నట్లుగా ఒకప్పుడు దేవతల భాష సంస్కృతం కాబట్టి దాన్నుండి ఎరువు తెచ్చుకున్నట్టే ఈనాడు దేవతలు మాట్లాడే భాష ఇంగ్లీషు కాబట్టి అందులోంచి ఎరువు తెచ్చుకుంటున్నాం.

అనేక ఇంగ్లీషు పదాలు తెలుగులోకి దేశీయా కరించి తెచ్చుకున్నాం. అది అనివార్యం. విద్యావంతుల సంభాషణలో తెలుగు, ఇంగ్లీషు యథేచ్ఛగా కలుస్తుంటాయి. ఫలితంగా వారి సహజమైన రచనలో ఈ రెండిటి కలయికా జరగొచ్చు. పాండిత్య ప్రకర్ష కోసం ఆదిభట్ల నారాయణదాసుగారు నాలుగు భాషల్లో సీసపద్యం చెప్పారు. భోగరాజు నారాయణ మూర్తిగారు సహజహాస్యధోరణిలో 'పోస్టాఫీసున పోస్టు చేయుడొక జాబున్' అని సంభాషణలో ఇంగ్లీషు వాక్యాలు కలిపి ఖండకావ్యాలు వ్రాశారు. తరువాత తరువాత ఈ శైలిలో వ్రాయడం కొందరిలో బాగా ఎక్కువై ముదురు పాకాన పడ్డాది. ఈ విధంగా ఇంగ్లీషు విభక్త్యంతాలతో వాక్యాలు ప్రవేశిస్తే దాన్ని మణిప్రవాళంగా భావించొచ్చు. ఇలాంటి శైలికి ఉదాహరణగా శ్రీ శ్రీ 'ఖడ్గ సృష్టి'లోని యీ కవిత్వం భావించొచ్చు:

'ఛందో బందో బస్తులన్నీ
ఛట్! ఫట్ ఫట్‌మని త్రెంచి
Damn it! ఏమిట్రా ఇదంటే
Pray! It's Poetry అందాం'
—కొంటె కోణాలు.

అయితే ఇలాంటి మణిప్రవాళం ఇతరులు కూడా వ్రాశారు. ఆరుద్ర 'త్వమేవాహం'లో

'బ్రెయిన్ లో పెయిన్
ప్రతీ వెయిన్ లో
మెషిన్ గన్ రెయిన్' అని వ్రాశాడు.

'పూషా' వ్రాసిన 'కల్చర్ అండ్ అనార్కీ' అనే గేయంలో ఆంగ్ల పదాలూ, వాక్యాలూ చాలా సహజంగా తెలుగుతో కలిపి ప్రయోగించబడ్డాయి.

'మనిషికి లవ్ ఆఫ్ మదర్ కంట్రీ
జీవితానికి ఆర్ట్ అండ్ పోయిట్రీ
అక్కర్లేదు! అన్ నె సినరి.........
వర్షానంతర ప్రశాంత శారద నభానికి
దేర్ య్యూజ్ వోన్‌లీ వన్ ఫిట్ టెన్స్
సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెన్స్ట్'

బి. వి. సింగరాచార్య 'Vibgyor' శీర్షికతో రచించిన గేయాల్లో ఇంగ్లీషు, హిందీ, తెలుగు పదాలను కలిపి మణిప్రవాళ ధోరణిలో వ్రాసి వైచిత్రి చూపారు.

'గదిలో light ను తగ్గిస్తే
ఎల్లాగుంటుందో బోలో
ఈ Beauty Worshipper కి'

శిల్పంకోసమో, ప్రత్యేక ప్రయోజనంకోసమో ఈ శైలి ప్రయోగించబడలేదు. ఇది కేవలం చమత్కారమే ప్రయోజనంగా గలది.

బాలగంగాధర తిలక్‌కూడా చాలా సహజంగా ఇంగ్లీషు, తెలుగు కలిపిన సందర్భాలున్నాయి. 'సైనికుడి ఉత్తరం' అనే క్రింది గేయం చూడండి.

'దూరంగా ప్రక్కడేరాలో కార్పొరల్
బూట్స్ చప్పుడు...... ...
వన్ టూ త్రీ షూట్ డెడ్ ఎవడ్?
నువ్వా నేనా?
కేబుల్‌గ్రాం యిప్పించండి కేరాఫ్ సో అండ్ సో
(మా వాడు బెడ్)'

—అమృతం కురిసిన రాత్రి.

ఇలా ఆంగ్లాంధ్ర పదాలను మణిప్రవాళ శైలిలో కలిపినవారు చాలా తక్కువ.

అసలు మణిప్రవాళ శైలి తెలుగులో ఆదరణ పొందక పోడానికి కారణం సంస్కృత విభక్త్యంతాలు తెలుగులో కలిపితే అసహజంగా వుంటుంది. అందుచేత సహజమైన దేశీయాకరణం మాత్రమే ప్రోత్సహించబడింది. కాని మణిప్రవాళంకంటే కూడా అసహజంగా కనిపించే రీతిలో ఇంగ్లీషు పదాల్ని గ్రహించి కృతక రూపాలు సృష్టించి కొందరు కవులు కవిత్వం వ్రాయడం జరిగింది. ఇలాంటి కృతకశైలి ప్రచురంగా ఆరుద్రలో కన్పిస్తుంది. దీన్ని ఆధునిక మణిప్రవాళం అనొచ్చు. ఉదాహరణకి

| | |
|---|---|
| వినండి | మీరంతా |
| రనండి | నా పంథా |
| అనండి | అనండి |
| నాకే | జయమని |
| మాకేం | భయమని |
| అనండి | చనండి |
| రనండి | మీరంతా |

(త్వమేవాఽహం)

ఇందులో 'రన్' అనే పదం ఈనాడు విరివిగా వాడబడుతోంది. క్రికెట్ వ్యాఖ్యానంలో 'ఇన్ని' 'రన్స్' చేశారని చెప్పడం జరుగుతోంది. 'రన్నింగ్' పోటీ', 'రన్నింగ్'లో అరుగుదల వచ్చింది—ఇలాగ అనేక రకాల ఈ పదాన్ని వాడుతున్నారు. కాని ఎవరూ 'రనండి', 'రనుతూ వున్నారా?', 'రనుదామా?'—ఇత్యాది కృతక రూపాలు వాడరు. అందుచేత సంస్కృత విభక్త్యంతాలు తెలుగుతో కలపడం ఎంత కృతకమో ఇదీ అంత కృతకమే అని చెప్పక తప్పదు. తెలుగువాళ్ళు ఈ శైలిని మన్నిస్తే మణి ప్రవాళాన్నికూడా మన్నించి వుండాల్సింది.

విషయం ఇలా వుండగా శ్రీ శ్రీ అభిప్రాయం చూడండి,

'సామాన్య పాఠకుడికి చిరాకు పుట్టించే అలవాటొకటి ఆరుద్రలో కనబడుతుంది. అది అన్యదేశ్యాలను ధారాళంగా అవలంబించడం. సామాన్యులలోనే కాదు. పెద్ద పెద్ద పండితులలోకూడా అన్యభాషా సంపర్కంవల్ల ఆంధ్రభాష భ్రష్టమైపోతున్నాదనే ఆందోళన లేకపోలేదు. కాని భాషాతత్త్వం బాగా తెలుసుకున్నవారు ఈ ఆందోళన నిరాధారమైనదని చెప్పగలరు. ఇదివరకు మాట ఎలావున్నా ఈ యిరవయ్యో శతాబ్దంలో ఎవరూ ఒక భాషలోని మాటలు ఇంకో భాషలోకి ప్రవేశించకుండా అరికట్టలేరు. అయితే ఈ మాటలను ఎంత సమర్థంగా ప్రయోగించ గలిగారని మాత్రమే కవుల విషయంలో మనం కని పెట్టవలసి ఉంటుంది.[4]'

కాని ఇక్కడ శ్రీ శ్రీ అభిప్రాయపడ్డట్టుగా సామాన్య పాఠకుడు ఆరుద్ర అన్యదేశ్యాలకు చిరాకు పడడు. అన్యభాషా సంపర్కంవల్ల ఆంధ్ర భాష భ్రష్టమైపోతున్నదని విజ్ఞు లెవ్వరూ భావించరు. అలా భావిస్తే ఇంతకుముందు చూపినట్లు అనేక ఉర్దూ, పార్శీ పదాలు ప్రసిద్ధులైన పూర్వ కవులనేకులు ప్రయోగించడం జరిగి వుండేదికాదు. వాటిని ఆంధ్రులు ఆమోదించి వుండేవారూ కారు. కాని వారెవ్వరూ ఆరుద్రలా కృతక రూపాలు ప్రవేశపెట్ట లేదు. భాషాతత్త్వం తెలిసినవారు కూడా భాషలో

4. త్వమేవాఽహమ్—ఒక లఘుటిప్పణి.

సహజంగా వాడుకలో వున్నవే ఆమోదిస్తారు. ప్రాచీన కవులు కూడా వాడుకలో సహజంగా వాడుతున్న రీతిలోనే కావ్యాల్లో ప్రయోగించారు. మనం ఆరుద్ర ప్రయోగాల్లో 'సమర్థత' కంటె 'సహజత'నే ప్రశ్నిస్తున్నాం.

ఆరుద్రని ఈ విషయంలో సమర్థించడమే కాక శ్రీశ్రీ తాను కూడా ఇలాంటి ప్రయోగాలు చేశారు.

'ఘూన్ పోల్ సార్ట్ పొండించిన
ఎగ్జిస్టెన్షియాలిజం'
'శొష్ణ కృస్తి ప్లిష్పరించు
చారు వేదనా రోగవ్
జల రుక్మిణి సూత్ర నాథ
శాస్త్రి పాడు శ్రీరాగవ్'
(ప్రాస క్రీడలు—శ్రీశ్రీ).

ఆరుద్ర వ్రాసిన ఈ కృతకశైలీ మార్గాన్ని మెచ్చుకోడమేగాక తాను కూడా ఆ సూక్ష్మైన బాటనే గో, లంటున్నారం అనిపిస్తుంది. కాని శ్రీ శ్రీ తాను వ్రాసిన 'కాజువల్ పోయిట్రీ'లో (సరదా కవిత్వం) యిటువంటి ప్రయోగాలు చేస్తే చాపల్యంగా భావించొచ్చు. ఆరుద్ర సీరియస్ పోయిట్రీలోనే ఇలాంటి ప్రయోగాలు చెయ్యడం ఎంతవరకూ సమంజసం?

అయితే యిలాంటి కృతక ప్రయోగాలు ఆరుద్ర ఒక్కరే చేశారా? ఇంకెవర్నైనా చేసారా? అని పరిశీలించాలి. అధునికులలో వేగుంట మోహన ప్రసాద్ వ్రాసిన 'లేచి నిలబడి పడు' అనే గేయంలో ఇటువంటి ప్రయోగం కన్పిస్తుంది.

'వస్తువులు క్రింద పడ్తాయన్నాడో ఆపిల్ తిన్నవాడు
కాదు, ప్రాకుతయ్ క్రీపుతయ్
లోపల్నించి తల్చుకుంటూ తన్నుకుంటూ
(చితి—చింత)

ఇందులో 'Creep' అనే ఆంగ్ల పదాన్ని 'క్రీపుతయ్' అని ప్రయోగించడం జరిగింది. ఇది తప్ప వేగుంట మోహనప్రసాద్ కూడా ఇటువంటి ప్రయోగాలు చెయ్యలేదు. నారాయణబాబు, శ్రీ శ్రీ, పూషా, సింగరాచార్య, దుర్గానంద్ ఇత్యాది నవ్యతా ప్రీతిగల కవు లెవరూ కూడా ఇటువంటి కృతక ప్రయోగాలు చెయ్యలేదు. తిలక్ ఇటువంటి ప్రయోగం ఒక్కటి కూడా చెయ్యలేదు. కుందుర్తి కూడా నా పరిశీలన మేరకు ఎక్కడా ఇలా వ్రాయలేదు.

ఇదేగాక ఆరుద్ర కొన్ని పదబంధాలనుకూడా ఈ ధోరణిలోనే ప్రయోగించాడన్న విషయం గమనించదగ్గది. 1942 లో ఆరుద్రవ్రాసిన 'లోహ విహంగాలు' అనే గేయంలో.

'పేనికా'నలం మానవాళిలో రగుల్తున్నాది.
డెత్‌కన్య కరాళ విషాధర కార్చిచ్చుకు......'
(స్పైలా పచ్చీసు)

అనే పంక్తులు కనిపిస్తాయి. ఇందులో 'Panic' అనే ఇంగ్లీషుపదం 'అనలం'తో కలిపి సంధించబడ్డాది. సంస్కృత సంప్రదాయానుగుణంగానైనా 'పేని కనలం' అనే అవుతుంది కాని దీర్ఘం రాదు. ఇలా సంధించిన సంగతి అనువాద చిహ్నాలు గనక పెట్టకపోతే అర్థం చేసుకోడం కష్టమే. మనందాన్ని ఎంతకి'పేనికా నలం'అనే చదువుతాము. కాని 'పానికా నలం' (Panikanalam) అని 'అర్థ వివృతం'గా ఉచ్చరించం. ఇలాగే

'నిలబడి ఉన్నది ఆమె
బ్లాకౌట్ డూాం పరివేష్టిత
లైటుహౌసు మాదిరి'
(స్పైలా పచ్చీసు)

అని 'హోబుదార్ గల్లీపిల్లను' వర్ణించారు ఆరుద్ర.

ఆరుద్ర సరదాగా వ్రాసిన 'ఇంటింటి పజ్యాలు'లో 'నేరమూ-శిక్షా' అనే 'పజ్యం'లో

'తినుకోకూడదు రైటు చేసిన వాళ్ళ వాంగ్మూలం
తీరా రెండో స్సైడు వింటే అది రాంగ్మూలం'
(ఇంటింటి పజ్యాలు)

అని వ్రాశారు. ఇలాంటిచోట ఇది 'చమత్కార మత్కవిత' అనిపించుకుంటుంది. కాని, 'లోహ విహంగాలు' లాంటి కవిత్వంలో అటువంటి అవకాశం లేదు. శ్రీశ్రీ కూడా

౯. 'నో పార్కింగ్'—విమర్శిక్కులు.

'ఈ ఫస్టోబరు రోజు ఎవరా వస్త
చెప్పండి కాస్త ఎవరా వస్తున్న రాజు'
(ఒకటీ పదీ—ఖడ్గ సృష్టి)

అని వ్రాశారు. ఇదీ సీరియస్ కవితే.

నవ్యతకోసం తపిస్తున్న రోజుల్లో తిరుగుబాటు ధోరణిలో 'నే నహంభావ కవి'నని చెప్పకున్న పఠాభి వైచిత్రీ ప్రీతితో ఇటువంటి పదబంధా లనేకం ప్రయోగించారు. అయితే ఆయన ఇంగ్లీషు 'భాషా భాండారము'లో నుండి ఇష్టం వచ్చినట్టూ మాటలు దోచుకొంటూ నని చెప్పారు. ఇంగ్లీషు పదాలు గ్రహించడంతో విడిచి పెట్టక సమాసాల్లో ఇంగ్లీషు పదాలు ఇరికించారు.

'ప్రభాత రేజరు నిసి నల్లని చీకట్ల
గడ్డంబును షేవ్ జేయన్
పడిన కత్తిగాటు'—వలె సూర్యబింబం కనిపించిందని వర్ణించారు. 'దుస్సాధ్య కాంపిటీషను', 'హంగ్రీ కనులు', 'హై హీలుయాన'—ఇత్యాది సమాసాలు కూడా ప్రయోగించారు. 'Catch చేయ' అనేది 'క్యాజ్జేయ' అనీ 'మద్రాస్ సిటీ' అనే దాన్ని 'మద్రాస్సిటీ' అనీ ప్రయోగించారు. 'క్యాజ్జేయ' అనే దాన్లో 'Catch + చేయ' అని 'చేయు' సహాయ క్రియతో ఆంగ్ల క్రియని కలపడం ఆంగ్లభాషా పదాల ఆదానం (borrowing)లో సహజ ప్రక్రియే. కాని ఇక్కడ చేసిన సంధి వ్యాకరణ సాధ్యం కాకపోవడం దీని విశిష్టత. ఈయన ఆంగ్ల పదాల్ని యథేచ్ఛగా గ్రహించడానికి కారణం తిరుగుబాటు ధోరణీ, వైచిత్రీ ప్రీతీ. ఆయన కవిత్వానికి గాని, ఇటువంటి స్వేచ్ఛా పద బంధాల ప్రయోగానికి గాని వైచిత్రీప్రీతి తప్ప ప్రత్యేక లక్ష్య మేమీ లేదు.

వేగుంట మోహనప్రసాద్ 'ఆఖరి ఆశ్రమం' అనే గేయంలో కూడా ఇటువంటి సమాసాలు మనకు కనిపిస్తాయి.

'పర్సనలీశ్వరుడి మీద ధ్యాస
రివర్ పద్మ ఒంపుల మీద ప్రాణం
కారణం కేవలం
దుఃఖానుభూతినైన పొందలేని
డెస్పరేట శక్తత'
(చితి—చింత)

వీరి కవిత్వంలో ఇంగ్లీషు పదాల చివరి హల్లును ప్రక్కనున్న అచ్చుతో కలిపి చేసిన పదబంధాలు పైన చూపిన రీతిగా క్వాచిత్కంగానైనా కన్పిస్తున్నాయి. ఇది గమనార్హమైన విషయం. ఇలాంటి కృతకమైన పదబంధాలు, కృతక రూపాలతో వ్రాసిన కవిత్వాన్ని 'ఆధునిక మణిప్రవాళం' అనడంలో అనౌచిత్యం వుండదు. కాని ప్రాచీన మణిప్రవాళంతో దీనికి 'కృతకంగా వుండడం', 'రెండు భాషలు కలియడం' అనేవి సమాన లక్షణాలు. ప్రాచీన మణిప్రవాళానికి గల ఇతర లక్షణాలు కూడా పరిశీలించి వీటిలో దేనికి అన్ని లక్షణాలూ పట్టాయో దేన్ని 'ఆధునిక మణిప్రవాళం' అంటే బాగుంటుందో నిర్ణయించాల్సి ఉంటుంది.

లీలాతిలకంలో మణిప్రవాళం ఉత్తమ, మధ్యమ, అధమాదిగా నవ విధాలుగా విభజింపబడింది. ఆ విభజన సంస్కృత, మళయాళ పదాల నిష్పత్తినిబట్టి చేయబడింది. వీటిలో 'న్యూనత్వే అధమం' అని చివర భేదం చెప్పబడింది. దీనికి ఉదాహరణగా

'ఆశీజనై రర అనం నిశి నీయ మానా
మావిర్భవ త్పులక భూషణ భూషితాంగిం
అంకే నివేశ్య సుదృఢం తరసా నవోఢా
మార్పోస్ అధీర నయనాం తఊగిస్త ధన్యః'
(లీలా తిలకము—1—21)

అనే శ్లోకం ఈయబడింది. ఈ ఉదాహరణని బట్టి ఇందులో సంస్కృతం ఎక్కువనీ మలయాళం తక్కువనీ తెలుస్తుంది. ఇదే సామ్యం ప్రకారం మనం ఆంగ్ల భాషా పదాలు చాలా ఎక్కువగాను, తెలుగు భాషా పదాలు తక్కువగాను ఉన్న కవిత్వంకోసం అన్వేషిస్తే ఆరుద్ర, శ్రీ శ్రీ లిద్దరి కవిత్వం కన్పిస్తుంది.

ఆరుద్ర 'త్వమేవాఽహమ్'లో,

'బ్రెయిన్‌లో బ్రెన్ గన్
రెయిన్‌లా ఆలోచనల ట్రెయిన్
స్పయినల్ కార్డులో స్ప్రెయిన్
గ్లూమీ తిమిరాలు చెరిషించి
సైతాన్ మనల్ని పరిషించు నపుడు
నిర్వేద పవనాలు వర్షించు
సింతటిక్ చింతను ధరించుకవి'
(త్వమేవాఽహమ్)

అని వ్రాసిన దాన్లో 'మనర్ని' అన్న దొక్కటే తెలుగు మాట. మిగిలినవన్నీ సంస్కృతాంగ్ల పదాలే. దీన్ని ఇందాక చెప్పిన 'న్యూనత్వే అథమం' అనే లీలా తిలక కారుని నిర్వచనానికి ఉదాహరణ ప్రాయమైనదిగా భావించవచ్చు. శ్రీ శ్రీ వ్రాసిన 'రుబాయత్'లో ఒకటి రెండు తెలుగు మాటలకంటే హెచ్చులేవు. శ్రీ శ్రీ 'Self Portrait' అనేదికూడా ఇలాంటిదే.

విదూషకుడి Temperment
ఏదో ఒక discontent
బ్రదుకుతో experiment
పదాలు patent రసాలు torrent
సదసత్సమస్యకి Solvent శ్రీ శ్రీ giant'

ఇంకెవరూ ఇంత అధికంగా ఇంగ్లీషు పదాలు ప్రయోగించలేదు.

మణి ప్రవాళానికి మరో లక్షణంకూడా వుంది. 'మలయాళ సంస్కృత శబ్దములు భిన్నభాషలకు చెందిన వయినను వానిని కూర్చుటలోని నేర్పునుబట్టి ఒక విధమయిన సారూప్యము, సమానత్వము స్ఫురించు నట్లుగా రచితమయిన యిట్టి భాషకు మణి ప్రవాళ మనుసంజ్ఞ సార్థకమగుచున్నది[6] –అని శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు వ్రాసారు. ఈ లక్షణం అన్ని మణిప్రవాళాలకు పట్టిందో లేదో? మరో విషయం ఏమిటంటే ఈ 'సారూప్యము', 'సమానత్వము' శబ్దసంబంధమైనవే అంటే ఆరుద్ర కవిత్వం లోని ఆంగ్లాంధ్ర పదాలకు అటువంటి సారూప్యం, సమానత్వం ఉందని చూపించ వచ్చు.

ఆ
మెన్
ఆమెన్
చెరపట్టన్
వారి
పడగొట్టన్
మ్రోగెన్
నీగన్
నా
పెన్

ఆ పెన్
కాపాడును
నీ విన్
నీ విన్
భావిన్
కాపాడును.

(త్వమేవాఽహమ్)

ఇక్కడ 'మెన్, ఆమెన్' అనిగానీ 'పెన్ ఆపెన్' అనిగానీ 'నీవిన్, నీవిన్' అనిగాని ఆరుద్ర వ్రాయడం శబ్ద సారూప్యం కోసమేగాని అర్థ పుష్టి కోసంకాదు. ఇందులో ఏ విధమైన అర్థగాంభీర్యమూ లేదు. ఈ విధంగా సారూప్యం, సమానత్వం స్ఫురించే విధంగా ఆంగ్లాంధ్రపదాలు కలగలుపుగా ఆరుద్ర ప్రయోగించారు. ఇటువంటి సారూప్య సమానత్వాలతో కూర్చిన ఆంధ్రాంగ్ల పదాలు ప్రయోగించి శ్రీ శ్రీ వేగుంట మోహనప్రసాద్, వరాభి, పూషా, సింగరాచార్య మొదలైన వారెవరూకూడా వ్రాయలేదు. కృతకమైన పదబంధాలూ, ఆంగ్ల పదాలతో కృతకంగా ఇంచుగా గమ రూపాల ప్రయోగం, సారూప్య సమానత్వాలుగల ఆంధ్ర, ఆంగ్ల పదాలను కలగలుపుగా ఉపయోగించిన శైలీ–అనే మూడు లక్షణాలూ ప్రచురంగానూ, అందులోనూ సీరియస్ కవిత్వంలోనూ ప్రయోగించి నది ఆరుద్ర మాత్రమే. కాబట్టి ఆరుద్ర కవిత్వానికి మాత్రమే 'ఆధునిక మణిప్రవాళం' అని నామకరణం చేస్తే అందుకు అభ్యంతరం ఉండకూడదు.

ఇటువంటి 'ఆధునిక మణిప్రవాళ' సృష్టికి కారణాలేమిటని అన్వేషించవచ్చు. ప్రాచీన కాలంలో మణిప్రవాళ కవిత్వ సృష్టి జరగడానికి కారణాలు అన్వేషించిన వారు దాని పుట్టుకకి నంబూద్రి బ్రాహ్మణులే కారకులని పేర్కొంటున్నారు. వీరు సంస్కృత మళయాళాలు కలిపి మణిప్రవాళం వ్రాస్తే వీటిని చదివిన పామరులకి సంస్కృత జ్ఞానం కల్గడమే గాక, సంస్కృత వ్యాకరణ జ్ఞానం కూడ కలుగుతుందని భావించారట. కాని ఆరుద్రకి అటువంటి భ్రమ లేదు. ఆయన ఇటువంటి కవిత్వం వ్రాయడంలో పామరులకి ఆంగ్లభాషా పరిచయం,

6. మణిప్రవాళ భాష–తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య భారతి–డిసెంబరు 1972, జనవరి 1973.

జ్ఞానం కలుగజెయ్యాలనే వుద్దేశం లేదు. ఎందు చేతంటే ఆరుద్ర తన కవిత్వం రుద్రాక్షపాకంలో ఉన్నాదంటే బాధపడడమే కాక తన పంథా మార్చు కోవాలనుకున్నారు కూడా. 'నాకు ఆనందాన్నిచ్చే 'తానం' వాయించుకోక పురజనుల కోరిక మీద అల్లాటప్పా పాటలు వాయించే స్థితికి వచ్చా[7] అంటారు. అంతే కాక 'అనుకున్నది అనుకున్నట్లు కాక అధునాతన అన్ ఎడ్యుకేటెడ్ ఆంధ్రాకి కావలసిన విధంగా తర్జుమా చేయడంలోకి దిగా[8]' అని వ్రాస్తున్నారు. దీన్ని బట్టి ఆరుద్రకి తాను ఆంగ్లాంధ్రాలు కలిపినందువల్ల తన కంటే తక్కువ స్థాయిలో వున్న పామరులైన ఆంధ్రులు ఆంగ్లంలో పాండిత్య సంపాదించే స్థాయికి ఎదుగుతారని గాని, ఎదిగేటట్టు చెయ్యాలనిగాని నమ్మకం, ఉద్దేశం లేవనేది స్పష్టం. పైగా తానే వారి స్థాయికి దిగాలా అని ఆలోచిస్తున్నారు. అసలు నంబూద్రి బ్రాహ్మణుల నమ్మకం కూడా సరైంది కాదు. అయితే ఆరుద్ర ఇలాంటి శైలిలోనే ఎందుకు వ్రాసినట్టు? సరియైన సమాధానం గోచరించదు.

ఆరుద్ర తన 'పైలా పచ్చీసు'కు ముందు మాటలు వ్రాస్తూ '1942 లో అంతకుముందు నేను ఏది వ్రాసినా మెచ్చుకొనని శ్రీశ్రీ 'లోహ విహంగాలు' అనే నా తాజాగీతం విని 'అబ్బీ! పెడ దారి వదిలేసి, ఎడదారి ఎక్కావు. గుడ్, ఇదీ నీ రస్తా ఊ సాగి పో' అన్నాడు. చాగంటి సోమయాజులు, రోణంకి అప్పలస్వామిగార్లుకూడా 'డిటో డిటో, రైతో' అన్నారు' అని వ్రాసుకున్నారు. అయితే ఈ 'లోహ విహంగాలు' గేయం పరిశీలిద్దాం.

'వెలిసిందటు! అప్పుడే విశాఖపట్నంపై
వర్షించిన బాంబువృష్టి
అసూర్యం పశ్యలు హాయిహాలుయానలు గూడస్స
గమనలు
నయితం.........
'పేనికా'నలం మానవాళిలో రగుల్తున్నాది
డెత్‌కన్య కరాళ విషాధర కార్చిచ్చుకు.........
విరామంలేని తపాలా రన్నరులా.........
ఎర్ర కిరసనాయిలుతో వెలిగించ బడ్డ
జాబిల్లి
వెన్నెల వల పన్నేవేళ
వస్తాడట జపానువాడు
బే ఆఫ్ బెంగాల్‌లో ఉన్నాయట
మృత్యువుకు టిఫిన్ కారియర్లు
ఎన్నో చాలా ఎయిర్‌క్రాఫ్ట్ కారియర్లు
నిశ్చయంగా ఖచ్చితంగా
తింటాడట !
షిప్ యార్డును లోకోషెడును
విశాఖపట్నాన్ని............

(లోహవిహంగాలు 1942)

ఈ గేయాలలో అధోరేఖాంకితమైన చోట్ల ఆంగ్ల పదాల ప్రాబల్యమే కాక కొన్ని కృతక పద బంధాలూ, మిశ్ర సమాసాలు కన్పిస్తాయి. మధ్యలో 'ఎర్ర కిరసనాయితో వెలిగించబడ్డ జాబిల్లి వెన్నెల వల' పన్నుతూ తెలుగు పలుకుబడులతో మిగిలిపోయాడు. ఈ కవిత్వానికి శ్రీ శ్రీ ఆమోదముద్ర లభించింది. అంతకుముందు వ్రాసిన కవిత్వంకంటే దీన్లో శ్రీ శ్రీ కి కనిపించిన ప్రత్యేకతేమిటో మనకి తెలీదు. కాని యీ ఇంగ్లీషు పదబాహుళ్యతే ప్రత్యేకతగా మనకి కనిపిస్తుంది. బహుశా ఇదే ఆరుద్రని ఆంగ్లపదబాహుళ్యం గల కవిత్వం వ్రాయడానికి దోహదం చేసుండొచ్చు. ఇది ఊహ మాత్రమే. ఆరుద్ర ఏమంటారో మరి? అయితే ఇటీవలి, అంటే మహాప్రస్థానానంతర కవిత్వంలో శ్రీ శ్రీ యథేచ్ఛగా హిందీ, ఇంగ్లీషు భాషా పదజాలంతో వ్రాసారు. అంతకు పూర్వం శ్రీ శ్రీ కవిత్వంలో సంస్కృతభాషా ప్రాబల్యం సంగతి లోక విదితం. పరోక్షంగా ఆరుద్ర ప్రభావానికి శ్రీ శ్రీ లోనైనారా అని అనుమానం కల్గుతుంది. పతాభి సంగతి ముందే మనవి చేశాను వైచిత్రీపీతి అని. ఇక

7. త్వమేవాఽహమ్—కవి హృదయం,
8. Ibidem.

వేగుంట మోహనప్రసాద్ కవిత్వంలో ఆంగ్లపద బాహు ళ్యానికి కారణం వేరే వుంది. అతనికి ఆంగ్లభాషతో గల ప్రగాఢ సాన్నిహిత్యం కారణంగా ఆంగ్లంలో ఆలోచించడం, ఆంగ్లంలోని అనేక భావాలను తెలు గులో దిగుమతి చెయ్యడం, ఆంగ్ల కవిత్వాల ప్రేరేప ణతో తెలుగు గేయాలు వ్రాయడం కారణాలుగా కన్పిస్తున్నాయి. ఈ విషయం ఆయన గేయాలకి అథస్సూచికలలో ఇచ్చిన వ్యాఖ్యానాలనుబట్టి తెలుస్తుంది.

ఆదియుగంలో సంస్కృత భాషా ప్రభావం, మధ్యయుగంలో ఉర్దూ భాషా ప్రభావం, ఆధునిక యుగంలో ఆంగ్ల భాషా ప్రభావం తెలుగు భాషపై పడ్డాయి. ఒకానొక ప్రత్యేక సమయంలో ఆ భాషలు తెలుగు భాషపై తమ అధికారం (Domination) నెరిపాయి. ఫలితంగా 'మణిప్రవాళశైలి' రూపొందింది. అయితే ఇది కృతకమైంది కాబట్టి ఈ ప్రక్రియ నిలదొక్కుకో లేకపోయింది. సహజ పద్ధతిలో భాష లోకి స్వీకరించబడ్డ పదాలూ, పదబంధాలూ, నుడి కారాలూ ఆమోద యోగ్యాలై పలువురిచేత అను సరించబడ్డాయి. ఇటువంటి పద్ధతిలో ఆంగ్లపదాలు బాలగంగాధరతిలక్, కుందుర్తి, అద్దేపల్లి రామ మోహనరావు, ఇత్యాదులందరూ స్వీకరించారు. ప్రస్తుత వ్యాసంలో 'సహజత్వం'లేని ప్రయోగాలను ఎవరు ఏ మేరకు ప్రవేశపెట్టిందీ అవి ఎంతవరకూ అనుస రించబడిందీ పరిశీలించాను. ఫలితంగా ఈ ఆధునిక మణిప్రవాళానికి ఆచార్య పీఠం ఆరుద్రదేనని తెలుస్తోంది.

---



# కొండెక్కని దీపాలు

## శ్రీ సీరపాణి

కొండెక్కిన దీపాలకు కోటి నమస్కృతులు
అవి చేసిన త్యాగాలకు అసంఖ్యాక నుతులు
మట్టి బ్రతుకులైన నేమి మాణిక్యాలై వెలిగెను
చిక్కం కట్టిన ఇరులకు చిరు కటారులై నిలిచెను.

మడ్డి గారిపోవు వెయ్యి గడ్డి దీపాలకన్న
క్షణం వెలిగి నిజం తెలుపు చిన్న దీపమే మిన్న

ప్రగతిగామి ప్రతి యువకుడు ప్రజ్వలించు దీపం
చీకటి రాకాసుల తుద ముట్టించే శాపం
ఒక దీపం చాలు కోటి దీపాలను వెలిగించును
ఒక దీధితి చాలు దాస్య భావాలను తొలగించును.

కొండెక్కని దీపాలివి కొడిగట్టని దీపాలివి
అగ్నిధార వర్షించే అంగారక చాపాలివి
నీచ జగతి శాసించే నిటలాక్షుని కోపాలివి
కుటిల తమోపటలానికి గుండెలపై కుంపట్లివి
అడ్డమైన సుడిగాలికి ఆరని మణి దీపాలివి
రేపటి నిర్మాణానికి లేచిన రణ ధూపాలివి.



# అపటీక్షేపాది వివరణము

కీ. శే. నేలటూరు రామదాసయ్యంగార్

(గత సంచిక తరువాయి)

భరత నాట్య శాస్త్రమునకు అభినవ భారతి, అభినవగుప్తాచార్యుని వ్యాఖ్య అమోఘమైనదే యుండుగాక. మఱి నాటకములును మహాకవులు వ్రాసినవి దానికి ఒక తెఱఁగు గొప్పవ్యాఖ్యగా గొనఁదగును. నాట్యశాస్త్ర నాటకముల సంబంధము 'విత్తుముందా చెట్టుముందా' అను న్యాయమును అనఁగా 'బీజాంకుర న్యాయమును' స్మారితము చేయును. అతిప్రాచీన నాటకకవి భాసుఁడు కాళిదాసుచే 'ప్రథిత యశాః' (మాళవి.) ప్రథితయశుఁడని పేర్కొనం బడినాఁడు. కాళిదాసు క్రీస్తుకుం బూర్వుఁడు ఐనను కాకున్నను, భాసుఁడు క్రీస్తుకు బహుపూర్వతీరుఁడనుటకు సందియము లేదు. అతని శ్లోకాలు చాణక్యార్థ శాస్త్రమున ఉదాహృతములు. ప్రాచీనతకు భరతమునితో పోటీ పడువాఁడనఁదగును. మఱి నాటక రచన మార్గము అతని స్వప్న వాసవదత్తాదిదియు, కాళిదాసు శాకుంతలాదిదియు శ్రీ హర్ష నాగానందాదిదియు, అట్లే ఆ నాటక రచన యుగాంతమువఱకు రచితమైయున్న వేణీ సంహారాదియెల్ల నాటకములదియు రచన యమరిక తెఱంగు ఒక్కటియే. అందు మాళవికలో కాళిదాసు నాట్యప్రశంస, శర్మిష్ఠకృతియైన ఛలికము యొక్క ప్రయోగము, మృదంగ మాయూరీమార్జన, మాళవిక మేజువాణి, 'అఙ్గైరన్తర్నిహితవచనైః... భావో భావం నుదతి విషయాద్రాగబన్ధః స ఏవ' అని దానిగుట్టు ఎఱింగిన మెచ్చుకోలును; మఱి యంతకన్నను అలోకాతిగ విక్రమోర్వశీయ చతుర్థాంకమున ప్రావేశికి ఆక్షిప్తిక, చర్చరిక, ఖండధార, జంభలిక, ఖండకము, ఖురకము, వలంతిక, కకుభోప భంగములు, కుటిలక, మల్లఘటి, గలితక మొదలైనదెల్లను ఆ కవికులగురువు, సముద్రము అగస్త్యవోలె, నాట్యశాస్త్ర సముద్రమును ఒక్కజుఱ్ఱునం జఱ్ఱినాఁడని స్పష్టము సేయునుగదా. అట్లే, ఆంగ్ల బెఱ్ఱిడేలు కెయితు ఎంతగొప్ప పండితుఁడు! ఎన్ని భాషలలో! అందును విశేషముగా గీర్వాణమున. ఆ పాండితికి రసికతకు కొలతలు లేవు. ఆయన యన్నాఁడు. 'ప్రపంచ సాహిత్యములో సంస్కృతము అగ్రగణ్యము. అందునాటకమునకు 'ప్రథమస్థానము.' అని. "The Literature of India attains its highest perfection in the Sanskrit Drama" అని. కాళిదాస శ్రీహర్ష భవభూతులు తమ లోకోత్తర నాటకముల ప్రయోగమును తాము సొంతముగా చూచి నటులను బళియని మెచ్చి యానందించిన వారని, తలంపఁదగును. వారు తమ నాటకముల పూర్తి ప్రయోగాభినయమునుంగూడ సకల సూక్ష్మములతో నాణెములతో నాజూకులతో ఎంతయు చక్కగా వ్రాసియున్నారు. అంతకుమించిన నాణెమైన నాజూకైన వస్తువు మఱి లోకాన ఉండదు. రంగాన తమకు తమకు కావలసిన యన్ని యక్కఱలం దీర్చుకొనుటకు తెరలు మొదలివి అని వారు గ్రహించుట వారి నాటకముల ప్రయోగములలోని యా సూక్ష్మ సూక్ష్మ సూచనలచే తెలియుచునే యుండును. నాటకము లన్నింటను అంకాంత సర్వపాత్ర నిష్క్రమణము ఒక్కతీఱుగనే కలదు. మఱి నాంది ప్రస్తావన అంశములు, అటనట నక్కఱంబట్టి అర్థోపక్షేపకములును, అన్నిటను అంతరాంతరమున సూచితముగానే పాత్రల యెన్నియో ప్రవేశములును నిష్క్రమణములును గలవు. అన్నిటను కవి కంఠరవముచేతనే ప్రవేశ పరిక్రమణోపవేశోత్థాన నిష్క్రమణాదుల కన్నింటికిని ఇంకను సూక్ష్మతర కార్యములకును ఎందును సందేహము చొరనీని ఎచ్చరికలు కూర్చుట యగపడుచున్నది. అవి ఒక్కతెరమగాదు, అక్కఱకొలఁది యెన్నియేని తెరలను వారు రంగాన భావించుటం దెలుపును. 'ప్రవిశతి' అనఁగాఁ తెరపటుప్ర, దాని విఘటనము పాత్ర మగపడుట. 'ఆసనస్థః' అనియు, 'రథేన' అనియు, 'విమానేన' అనియు కలుగు వివరములన్నియు తెరపట్టుటయు, దాని మఱుఁగున కావలసినట్లు పాత్రము తయారగుటయు, అంతట తెర తివియుటయు, ఆ పాత్రల ప్రవేశసిద్ధియు, అనుటయే. నాటకరంగాన 'ప్రవిశతి' గమనార్థకము

గాదు. మఱి ప్రేక్షకదృష్టి విషయభావనార్థకము. ఎన్ని 'ప్రవిశతి' ప్రవిశ్యలు' కలవో 'అన్ని 'పటక్షేపములు' అనఁగా తెరపఱుపులును,' అన్ని తెరయపసరణములును కలవని యర్థము. పాత్రల ప్రవేశమునకు ఎట్టిదో సూచన యుండనే యుండును. అట్లే నిష్క్రమణమునకును 'నా సూచితస్య పాత్రస్య ప్రవేశో నిష్క్రమో௨పివా' అని భరతాను శాసన మందురు కదా పెద్దలు. ఒక్కొక్క దానికిని పటక్షేపము (పఱచుట) పటాపసరణము (తివియుట) కలదు. కాఁగా సంభ్రాంత—అసూచిత—యెకాయెకి — ప్రవేశమునకు పరిభాషితమగు మాటయైన 'పటాక్షేపేణ ప్రవిశ్య' అనియేని, 'అపటీక్షేపేణ ప్రవిశ్య' అనియేని 'నజుతో' కూడియున్న దానికి తెరపఱచని ప్రవేశము నేపథ్య గృహమునుండి ఒక్కట రంగాన ప్రవేశ మర్థమనుట సిద్ధము గదా. అది తెర పఱపంబనిలేదని సూత్ర పరిజనముకైన యెచ్చరిక, పాత్రము చేయవలసిన దానికి కాదు.

చెప్పితినిగదా, 'నాటకము ముందా భరత శాస్త్రముముందా' అను విచారము విత్తుచెట్టు నాయముం దలంపించునని. భాసునివియు—అంతకుం బూర్వపువి దొరకలేదు—కాళిదాసునివియు నాటకములం దొడంగి తన్నాటకరచన మహాయుగాంత కృతులగు వేణీ సంహారాదులవఱకు ఒక్కొక్క దానియందును ఒక్కొక్క భాగమందును — ఆముఖము—అంకములు అర్థోపక్షేపకములు—అన్నింటను 'తతః ప్రవిశతి' మొదలుకొని 'నిష్క్రాన్తాః సర్వే' వఱకు ఎన్ని యంతర ప్రవేశములు అంతర నిష్క్రమణములు! శాకుంతలమున 50 ప్రవిశ్యలు 35 నిష్క్రాంతులు, ఇట్లే తక్కిన యన్నింటను లెక్కపెట్టవచ్చును. 'ఏష రాజేవ దుష్యన్తః' అని సూచన, అంతట పటక్షేపము—తెరపఱచుట, తతః ప్రవిశతి రాజా రథేన సూతశ్చ' అని యా తెర వెనుక రాజసూతుల సన్నాహము, తెరతివియుట—అదే వారి ప్రవేశము. మరల పటక్షేపము, దాని మఱుఁగునుండి (నేపథ్య) భాషితము- ఆశ్రమ మృగో௨యం నహన్తవ్యః అని అదే సూచనయు. అంత తెరయపసారణము వైఖానసాది ప్రవేశము. మరలక్షేపము, వైఖానస నిష్క్రమణము. అంతట సారథి నిష్క్రమణమును, మరల పటక్షేపము, 'ఇత ఇతః సఖ్యౌ' అని యామఱుఁగున మాటలు, శకుంతలాదులు కలశాదులతో సిద్ధమగుట, తెర యపసారణము, అదే తత్ప్రవేశము. ఇట్లు వరుసగా జరుగుచుండఁదగును—అనుట. అంకాన ఇట్లు అన్నింటికిని తెర ప్రాణ సమానమైన పరికరము, సూత్రి పరిజనము చేతిలో. కాఁగా ఇట్లు ప్రతి ప్రవేశ నిష్క్రమణమునకును ఎట్టిదో సూచనయు కలదు. అట్లు ఏఁబదిసార్లును మూఁడుసార్లు అడుగడుగున చేయవలసిన దానికి కవి మాటచే నిర్దేశించుట మామూలుం జెప్పుటయే యని నాటకాలలో ఆ చెప్పుట మానఁబడినది. అది 'ప్రవిశతి నిష్క్రామః' అనువానిలో అంతర్హితముగా ఉండనే యున్నది.'. తెరను సిద్ధవత్తుగా' 'స్థితవత్తుగా' గ్రహించినారు కవులును ఆచార్యులును. ముని రంగ నిర్మాణమునం జెప్పకయే పూర్వరంగాధ్యాయమున 'అంతర్జవనిక'యనియు 'విఘట్య జవనికాం' అనియు 'ప్రవిశతి' యనియు నిష్క్రామతి యనియు పలుమాఱు చెప్పుటయ కాక, ఎక్కడెక్కడ తెర కావలయునో అక్కడ నెల్లను ఆ 'డే' పండితుఁడు చెప్పిన యాచోటనుంగూడను, 'అంతర్జవనికా సంస్థైః సూచనార్థస్య చూళికా' అని చూళిక లక్షణమందును, అందందు భాషితముల నడుమ 'నేపథ్యే—అన్నప్పుడును— (నేపథ్యము ఇది పరదాకాని నటులకొట్టుకాదు.) అట్లు ఎట్లెడలం జెప్పియున్నాఁడు. అట్లే నాటక కవులును ప్రస్తావన మొదలు నిర్వహణాంతమువఱకు చెప్పియున్నారు. ప్రతి'ప్రవిశతికిని' 'ప్రవిశ్యకును' 'పటక్షేపేణేతి శేషః' అను వ్యాఖ్యాత తెలివిడి -అధ్యాహర్తవ్యము—అని ఉన్నట్లే గ్రహింపఁదగును. అది సూత్రధారునికిని రంగసన్నాహముం జూచుకొను తజ్జనమునకును సూచన. కాఁగా 'సంభ్రాంత—యెకాయెకి ప్రవేశమునకు 'అసూచిత' మయినదానికి, కావుననే 'అపటీక్షేపమును' కాదా 'పటాక్షేపమును తెరక్షేపింపమియే అనఁగా తెరవేయమియే అగును, పాత్రము తెరను మీటుట—'Toss'—చేయుట కాదు, అనఁగా అతని 'నాట్యము' 'అభినయము' కాదు, ఈ పటాక్షేపము. నాట్యేన పశ్యతి నాట్యేన ఉపవిశతి అను వానిం బోనియు కవి యుపదేశము లుండును కదా నటునికి. అట్టిది సంభ్రాంత నటుఁడు చేయవలసినదేని ఇటను 'నాట్యేన' అని చేర్పఁబడియుండును.

మఱి యిది సూత్రి జనము, ఇతర సామాన్య పాత్రములకుం జేయునది, ఇతనికి సంభ్రాంతునికి చేయక మానవలసినది అను నెచ్చరికం దెలుపును.

ఇది యొక యుదాహరణముగా గొనందగును. నిర్మాణాధ్యాయమున తెరం జెప్పక, పూర్వ రంగాధ్యాయమున అది యున్నట్లే భావించి—అదియే పెద్దలు చెప్పు నొక తెఱంగు—ముని తదంతర్బహిః కార్యముల తన యక్కఱబడి చెప్పినందున అక్కఱయే తెరకు అను మంత్రకము అని దానిని ఇచ్చమెయి ఉపయోగింపవచ్చునని తలంపంబగును. 'అభినవగుప్తుండు 'అత్ర యవనికా 'రఙ్గపీఠ రఙ్గశీర్షయో ర్మధ్యే' అనుట అక్కడి యక్కఱకు తగిన యేర్పాటుం జెప్పుటే కాని సర్వత్ర కలుగు నక్కఱలకు చెప్పినది కాదు. శాకుంతలారంభమున సూత్రి వచ్చి, తరువాత నేపథ్యాభ్యంతరమునుండి నటియు వచ్చి, ఆ యాట పాట ముగిసి వారు నిష్క్రమించునపుడు 'ఏష రా జేవ దుష్యన్తః' అని సూచన చేసి నిష్క్రమింతురు. నిష్క్రమణమనంగా పటక్షేప విఘటనములు జరుగవలయును గదా. 'ఏష రా జేవ' అన్న 'ఏష' రాజాది ప్రవేశా వ్యవహితతను తెలుపును. సూత్రి యొకతట్టు నిష్క్రమించి రాజు మఱియొకతట్టు ఆ నిముసముననే ప్రవేశించిన నాణెముగా నుండును. చూపఱకు రసవంతముగా నుండును. ఇది మఱి యొక్కటే తెరతో సాధ్యమా? మఱియు విల్సన్ పండితుండు మృచ్ఛకటిక ప్రథమాంక రంగ సన్నివేశముం బోని దానిని చూచి—అట్టివి ముద్రారాక్షసమునను కలవు—రంగాన 'Transverse' నిలువుగా తూర్పు పడమరలుగా, ప్రేక్షకులకు అడ్డము కాకుండునట్లు, ఉంచిన తెర లుండెనని తలంచినాండనియు, అట్లు తలంచుట, రుజువు చాలమిచే, కూడదనియు కెయితును తోడు పెట్టుకొని డే పండితుండు చెప్పెను. ఆ యంకాన 6 'షిఫ్టు' చోటు మాఱుదల లున్నవనియు, అవి సంస్కృతనాటకములలో ప్రాయిక మనియు అన్నాండు. 'Such unmarked scenes shifting is common in Sanskrit plays' అన్నాండు. అది యెందులకు ఏమి సమాధానము? ఆ చోటు మాఱుదలలకు రంగాన, అంకము మాఱకయ యుండునట్లు ఇప్పుడు ఏమేమి చేయందగియున్నదో, మతివిభవమును పరికర సమృద్ధినిం బట్టి నాడును అవి యెల్ల చేయందగి యుండెనని తలంపందగును. అట్టయో మట్టయో చెక్కయో తెక్కచాపో యథానుకూలముగా వాడుకొనవలదా? డాక్టరు జి. కె. భట్టు పండితుండు ఎంతయు వివేకమంజులముగా అన్నాండు. తన మృచ్ఛకటి యుపోద్ఘాతమున విల్సన్ చెప్పిన తెరవలె ఇక్కడ ప్రకృతమునకు ఒక కొయ్య చట్టము చేయించుకొనందగును ఇత్యాది. మఱి వారికందఱికి ఇక్కడ జ్ఞాపకము చేయవలసినది ఇది మాత్రము కలదు—సూత్రి నిష్క్రమించినాండు. అతనితో నేపథ్యమునుండి పలుకుచున్న మైత్రేయుండు ఆ పలుకులు అట్లే పలుకుచునే అత్యవ్యవహితముగా ప్రవేశించినాండు. కావున సూత్రి నిష్క్రమణము వేఱు పటక్షేప విఘటనములచే ఒక తట్టు జరుగందగును. అప్పుడే ఆ నిముసాననే అట్లు క్షేపముం బొందియున్న ఆ నేపథ్యమును విఘటింపంగానే మైత్రేయుండు ప్రవేశింపందగును. తరువాత మరల పటక్షేప విఘటనములచే చారుదత్త ప్రవేశము. మరల మైత్రేయుండు 'గణికారాజవల్లభాదులు వీధిలో తిరుగుచుందురు. నాకు భయము అనుటయు, అంత 'తిష్ఠ వసన్తసేనే' అను సూచనకు పటక్షేపము, వసంతసేనా విట శకారాది ప్రవేశమునకు తదపసరణము, అట్లే మరల చాలసేపటికి విటనిష్క్రమణము, మఱి రవంతసేపటికి చేట శకారుల నిష్క్రమణము, అంతట అంకాంతమున వసంతసేన అటు తన యింటిలోనికి, చారుదత్త విదూషకులు ఇటు చారుదత్తునింటికి అని అంకాంత సర్వపాత్ర నిష్క్రమణముగా నిష్క్రమణము. దీనికెల్ల తగినట్లు పటక్షేపాపసారణములు అంకము ముగియుట దీనిని డేయు భట్టును ఎట్లు కాదనంగలరు? మఱేమి సమాధానము కల్పింపంగలరు? సూత్రధారాది నాటక ప్రయోగ పర్యవేక్షకులు ఆయా నాటకమునకు తగినట్లు రంగముమీందికి కుర్చీలను బల్లలను పూలచెట్లకుండికలను కొమ్మలను తీగలను-దీపాలను అట్లే తెరలను ముందే సమకూర్చుకొనందగును. ఒక్కొక్క నాటకమునకును అక్కఱలు మాఱుచునుండును. ఇది నేడెట్లో, కాళిదాసాది కాలమునకు అట్లే. ఒకవేళ ఇపుడు సులువు సుకరము అగునేమో. ఐనను ఎప్పటి సౌలభ్యము అప్పటికి. అక్కఱ సమానమే. వీనికి భరతశాస్త్ర నిషేధము లేదు. మఱి ఉపదేశమును లేదు, నాటకగత సూచనలే.

నాటకమందును (నాట్యమందును) పాత్ర

ప్రవేశమునకు 'పటక్షేపము' తెరవేయుట తెరపట్టుట అట్లంత వాడుకగా కలదు గావుననే అది కూచిపూడి భాగవతముం బోని యక్షగాన ప్రయోగములందును, వీథి భాగవతపు టాటలందును అట్లే కావ్యములలో ఉపమోత్ప్రేక్షాదులందును ప్రవేశించినది. కూచిపూడి వారు 'భామ' ప్రవేశమునకు తెరపట్టి ప్రావేశికలం బాడి కాగడాలు ఎదురెదుర చేరంబట్టి పిడికేఁడును చేరేఁడును గుగ్గిలము చల్లి మతాబులు పగలు వత్తుల కన్నను పెద్దయెలెక్ట్రిక్ 'ఫ్లాష్' వలె 'ధగ్‌ధగ్' అని పించి తెర తటాలున తివిచి పళపళన భామను ప్రవేశ పెట్టుట వాడుక. ఈ కావ్యాది ప్రయోగములును పరికింపఁదగును.

## 1. రసతరంగిణి

సన్ధ్యా శోణామ్బర జవనికా,
కామినోః ప్రేమనాట్యం
నాన్దీ భ్రామ్యద్భ్రమర విరుతం
మారిషః కోఽపి కాలః,
తారాః పుష్పాఞ్జలి మివ కిరన్
సూచయన్ పుష్పకేతోః
నృత్యారమ్భం, ప్రవిశతి సుధా
దీధితిః సూత్రధారః

చంద్రుఁడను సూత్రధారుఁడు ప్రవేశించి, మదనుని నృత్యారంభమును సర్వ పరికర సంపన్నముగా సూచించుచున్నాఁడు. నృత్యము తొడంగుటకు ఆ సంధ్యా జవనికను తెలియవలెను. అనఁగా చంద్రో దయము పూర్తిగా కావలయును. కాఁగానే తెర ఎఱ్ఱ కాంతి వ్యాప్తి - తొలఁగును. అంతట పూలెక్కేపు వాని నృత్య మారంభమగును.

## 2. సుభాషిత రత్నభాండాగారము

## రజని

శశాఙ్కే సన్నద్ధే భరత ఇవ,
సన్ధ్యా యవనికా
తిరో భూత్వా, పుష్పాఞ్జలి మివ
వి కీర్యోడు నికరమ్
కలంకాగాయన్తీభిః కుముదవన
భృఙ్గీభి రధునా
నభోరఙ్గం ప్రాప్తా విహరతి
నిశాలాసిక వధూః

సంధ్యయను తెర తొలఁగిపోయి, నట్టువువలె చంద్రుఁడు (కొనుగోలు ఇయ్యను) సిద్ధపడఁగా, ఇపుడు అవ్యక్తమధురముగా పాడుచుండు కలువ తంపర తుమ్మె దలతో—అనఁగా కలువతంపర తుమ్మెదలు ఎంతయు మధురముగా పాడుచుండఁగా, రాత్రియను సుకుమార నటి మింటిరంగము జొచ్చి, పూలదోసిలివలె నక్షత్రాల మొత్తము వెదజల్లి (నృత్య) విహారము సలుపు చున్నది.

## 3. ఆర్యా సప్తశతి — 38

వ్రీడా ప్రసరః ప్రథమం, తదను చ
రసభావ పుష్టచేష్టాయమ్
జవనీ వినిర్గమా దను నటీవ
దయితా మనోహరతి

ప్రేయసి, తెరవెలువడిన నటివలె, తొలి క్రమ్మిన సిగ్గువ్యాప్తి తొలఁగఁగా, రసమునకుం దగిన భావాలతో నిండుకొన్న యభినయాల తోడి యా యాట కత్తెవలె, ఆనందముం గూర్చు భావములతో నాడెంద మును దొంగిలు చున్నది.

## 4. మధురా విజయము VII — 19

దినవేష మపాస్య యామినీ—
వపుషా కాల నటస్య నృత్యతః
ద దృశే జగతా పితృప్రసూ
ర్ద్ధివి నేపథ్య పటీవ పాటలా.

తెలుఁగు అనువాదము

తె. అలరె మలిసంజ జగతిఁ గాలాఖ్య నటుఁడు
వాసరంబను వేషంబు బాసి, రాత్రి
యనెడు వేషమ్మున నటింప నాకసమునఁ
బట్టు పాటల నేపథ్య పటి యనంగ.

## 5. నన్నెచోడుని కుమార సంభవము

## IX— 245

రతియెదుర మరుని యావిర్భావము.

మలయుచుఁ బొలుపారు మకర కేతనముతో
నెలరారు గెందలి రెల్లి గ్రాలఁ
దలుకొత్తు నెత్తావి యలరంప పొదులతో
మేలిల్లు నించు ఏ ల్లేల నమర,

జెలరేగు వళిపిక కుల వినాదములతో
రాజ కీరాలాప రవము లువియ,
వేచి సమ్మదలీల వీచు తెమ్మెరలతో
నలి వసంతుండు గూడి నడవ నొండ
కామ సుఖములతోఁ బూర్వ కామకేళి
కామచిహ్నాలు మెయి సురంగంబు గాఁగ
నెఱయఁ గై సేసి జవనిక తెఱచి వచ్చు చెలువతో
వచ్చి రతిమ్రోల నిలిచె మరుఁడు.

## 6 శృంగార నైషధము IV — 2

ఇవ్విధంబున నిబుధ మాయాంధకారంబు దూరం బగుటయు, కట్టెదుర నా జగజెట్టి జవనిక వాయం దట్టినం బొడసూపు బహురూపు తెఱంగున, జలధర తిరోధానంబు వాసినం బ్రకాశించు నా హిమధాముని పగిది. (బహురూపుఁడు నటుఁడు.)

## 7. వసు చరిత్ర III — 52

మ. ఇది సంధింపఁగ వేళ యంచు
వసు రాజేంద్రుండు నీ రంధ్ర నీ
రద వార ప్రతి వీర వెల్వడిన
తారా భర్త లీలన్ అతా
చ్ఛద సంఛాదిక బాసి నిల్చె
నెదుటన్ సారంగ రాగభ్రమన్
మదభృంగీరుతి వందిమాగధ
కథా మాధ్యుర్యముం దెల్పఁగన్.

IV—22

హరి దంభోరుహలోచనల్ గగన
రంగాభోగ రంగ త్తమో
భర నేపథ్యము నొయ్య నొయ్య
సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్
వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి
సగంబై బింబమై తూర్పునన్.

## 8. చిత్రనళీయ నాటకము — పూర్వ సంధ్యం గూర్చి

కమలాప్త ధాతృవేషము రాఁగఁ బట్టిన
మరనాటకుల తోపు తెర యనంగ.

కీ. శే. మహామహోపాధ్యాయులు కవి సహృదయ చక్రవర్తులు, కళాప్రపూర్ణులు, వేదము వేంకటరాయ శాస్త్రులవారు తమ శిష్యులకు నేర్పిన తెఱంగు-ఎల్ల నాటకములందును 'నా సూచితస్య పాత్రస్య ప్రవేశో నిర్గమోఽ పి చ' అను శాస్త్రముయొక్క నిర్వాహము కలదు. సంభ్రాంత ప్రవేశమున ఆ ప్రవేశ సూచన యొందును లేదు. అదే సంభ్రాంత ప్రవేశ మనఁగా. తెర వేయుట—తెర పట్టుట—పటక్షేపము పాత్ర ప్రవేశమునకు సూచన. తెర తివియుటయే ప్రవేశము. నాటకమున ప్రవేశము గమనార్థకము గాదు; మఱి తెర తివియఁగానే ప్రేక్షకులకు 'అగపడుట' అను నర్థము గలది. ఇది నాటకారంభము మొదలు అంతము వఱకు ఎన్నిమార్లైనను జరుగుచునే యుండు 'మామూలు', కావున దీనికి నాటకాలలో కవుల నిర్దేశము లేదు. రంగమును చిమ్మి తుడిచి సిద్ధము చేయుటకును దీపాలు వెలిగించి పెట్టవలసిన చోట్ల పెట్టుటకును ఇట్టి మామూలు అక్కఱలకు కవియొక్క సూచన నిర్దేశము లేనట్లే ఈ పాత్ర ప్రవేశమునకు తెర పట్టు మామూలునకును కవి సూచన లేదు. ప్రవిశతి నిష్క్రామతి' అను సూచనయే ఏతద్గర్భితము. అది రంగాన నాటక కార్యమును నిర్వహించు సూత్రధారునిది, అతని పరిజనముది. ఇట్లు 'పటాక్షేపేణ' అను సంభ్రాంత ప్రవేశముం గూర్చిన బోధన కరబదర సదృశముగా భరత నాట్యాభి నవభారతులు నంతగా చూడకయే నేర్పినారు. 1909 లో ప్రకటించిన వారి ప్రియదర్శిక టిప్పణిటీకలలో ఇట్లున్నది. పుట 73—తృతీయాంకము.

'రాజా — ప్రవిశ్య పటాక్షేపేణ, సహర్షం వస్త్రాన్తే గ్రన్థిం బధ్వా.

రాజు—పటాక్షేపంబునం బ్రవేశించి, సంతసముతో వలువ యంచున ముడివైచి—

పటాక్షేపము—తెర వేయమి—పాత్ర ప్రవేశమునకు తెర వేయుటయు సంభ్రాంత ప్రవేశమునకు తెర వేయమియు నియతములు.........'

ఈ యవనికా విచారానుషంగమున ఇది యొకటి. 'డే పండితుఁడు తన ప్రాచీన భరతనాటకరంగపు యవనికం గూర్చిన వ్రాతలో ముని జవనికం జెప్పెనాఁ డనుటకు ఈ కారికలు (V-11-12.)

ఏతాని బహిర్గీతా న్యథ
ర్యవనికా గతైః
ప్రయోక్తృభిః ప్రయోజ్యాని
తన్త్రీభాణ్డకృతాని తు
తత శ్చ సర్వకుతపై ర్యుక్తా
న్యన్యాని కారయేత్
విఘాట్య తై యవనికాం
నృత్యపాఠ్య కృతాని చ

అనునవి ఉదాహరించి దానిమీఁది యభినవ భారతి యని

'తత్ర యవనికా రఙ్గపీఠ త
చ్ఛీర్షయో ర్మధ్యే'

అని రంగాన యవనికకు స్థాన నిర్దేశము చేయఁబడిన దన్నాఁడు. ఆ నిర్దేశము ఆ యాచార్యుఁడు తాను అనుగ్రహించిన వివరణమే. మఱి మండప నిర్మాణాధ్యాయమున నేపథ్యగృహము కడ తద్ద్వారములం జెప్పుచో వానికి ఆనుకొని యుండునదైన రంగశీర్షము ఇట్లు ప్రయోగపడునని అభినవగుప్తుఁడు చెప్పినదానిని ఉదాహరించినాడు.

తత్పాత్రాణాం విశ్రాన్త్యై
ఆగచ్ఛతాంచ గుప్త్యై
రఙ్గస్య శోభాయై రఙ్గ శిరః కార్యం' అని.

కాశిలో అచ్చుపడిన పుస్తకమున ఈ ఘట్టము ననే 'ద్వారద్వయ మేవరఙ్గ శిరసి నేపథ్య గతపాత్ర ప్రవేశాయ' అని యున్నదన్నాఁడు. 'విశ్రాన్త్యై 'గుప్త్యై' అనునవి ఈ తెర లేకున్న ఎట్లు చక్కఁగా ఘటిల్లును? దానింబట్టియు ఈ తెరకు ఆ స్థానము కుదిరినది. ఒకవేళ అభినవ గుప్తునికి ఆ ఘట్టాననే యీ తెర చిత్తమున తటపట లాడు చుండెనేమో! మఱి దాని ప్రయోజనములలో 'రఙ్గస్య శోభాయై' అనియు ఒకటి పఠితమైనది. ఆ ద్వారములచేత కాని, రంగశిరము చేతకాని రంగమునకేమి శోభ? శోభయు యవనికచేతనే అని గ్రహింపఁ దగును. అది లేకున్న ఆ వాకిళ్లు ప్రేక్షకులకు అగపడుచు దాని యేకాంతతకు భంగము కలిగించుచు నుండవా? జవనిక అది యెట్టిదో, అదే 'శోభాయై' శోభనుం గూర్చు నన్నాఁడు. అట్టి శోభను స్మరించిన యాచార్యుఁడు భరతముని తెరను పీఠశీర్షముల మధ్య అని కాని శీర్ష నేపథ్య గృహములమధ్య అని కాని నియమము నిర్దేశింపక పూర్వరంగ ప్రయోగ సౌకర్యమునకును ఆవశ్యకతకును తెర యున్నట్లే భావించి

ఏతాని చ బహిర్గీతాని......
తత శ్చ సర్వకుతపైః......
విఘాట్య వై యవనికాం......

ఇత్యాది తక్కిన శాస్త్రవిధులం జెప్పఁగా, తాను తన వ్యాఖ్యలో ఆ యవనికకు స్థానమును తత్ప్రయోజనములం జెప్పుచో, వానియందు రఙ్గస్య శోభాయై అనియు ఒకటి చెప్పినవాఁడు రంగము మొత్తమునకు సామాజికుల తట్టున్నకొసన ఒక తెరను, ఇపుడు 'డ్రాప్' అందురే దానినింగూడ ఏల భావించి అనుమతించి యుపదేశింపఁడాయెనో. అది మఱియు నెంత శోభనుగూర్చునన దగును! మఱి అంకాంత సర్వపాత్ర నిష్క్రమణము, 'డ్రాప్' లేనట్లే అన్ని యంకములందును నిర్వాహము చెందుచున్నది. అట్లు లేమియే అభినవుని మతము. అట్లే అంకాన రంగాన చూపఁగూడని వానిలో మరణమును లెక్కించుచో అందులకొక కారణముగా ఆ పీనుఁగును రంగాననుండి తొలఁగించుట యెట్లు అని యన్నాఁడు అభినవగుప్తుఁడు. అది అతఁడు పాత్ర నిష్క్రమణార్థమైన తెర అందు ఇంకను లోపలికి ఉండుటను, దాని మఱుఁగునకు అంకాంతపాత్ర లెల్ల నడిచి పోవుటను యథాశాస్త్రముగా భావించుటచేతఁ గదా. హత్యా మరణములు అంకాన రంగాన కూడమికి తదశ్లీలతయు చూపఱకు దాన వెగటు వెక్కసములు కలుగుటయు మాత్రమే చెప్పఁదగినవి. మఱి 'డ్రాపు' లేమిచే రంగాననుండి పీనుఁగు తొలఁగుటెట్లును బాధ ప్రధానముగా తోఁచినది, ఆచార్యునికి. కావుననే మృచ్ఛకటికలో వసంతసేన హత్య, తనంతటి శాస్త్రోల్లంఘనము మఱియే నాటకమునను లేదని తోఁచునంత ఘోరమైనను, మర్షణీయము కాఁబోలు, ఈ యభినవోక్తిబడి, ఏలన, అంకము ముగియు లోపల తానే మరల ప్రాణముపొంది ఆపె భిక్షుని సాయమున యథావిధిగా నిష్క్రమించినది.

భరతనాట్యమునకు గాని గీర్వాణ నాటకమునకు గాని ప్రేక్షాగృహమునకు గాని పరదా కలిమిలేములకు గాని మనకు సంప్రదాయము బొత్తిగా విచ్ఛిన్నమైనది. మౌర్యుల కాలమువి ఇవి అని కాని, గుప్తుల

కాలమువి ఇవి అని కాని హర్షుని కాలమువి ఇవి అని కాని భోజుని కాలమువి ఇవి యని కాని ఏవియు గుఱుతే లేక అడగారిపోయినవి. తురకల రాక, వారి దాడులు, జయములు ఆక్రమణములు రాజ్యప్రతిష్ఠలు—అన్నియు ఆ పూర్వతరముల సర్వనాశనమును సమకూర్చినవి. మనకు హతశేషముగానేని ఏదియు సంక్రమింప లేదు. అయినను దానింబట్టి పూర్వకాలమున ప్రేక్షాగృహములే లేవని కాని, నాటక ప్రయోగములే లేవని కాని పరదా ప్రస్తావమే లేదని కాని తలంచుటకు మనసునకు తెంపు కలుగుట లేదు. కాళిదాసాదుల నాటకములను, వాని యందమును సున్నితతనమును చూచినపుడును, చంద్రగుప్త విక్రమాదిత్య హర్షదేవభోజదేవుల కుండిన కవులయు నాటకాలయు ఆదరమును అరసినపుడును మంచి ప్రేక్షాగృహములు ఉండెననియు, దకులగు నటబృందము లుండెననియు ఎంతయు పరికరసంపన్నములైన నాటక ప్రయోగము లుండెననియు ఊహింపక ఉండనేరము. అట్టి ప్రయోగములం గూర్చిన ప్రస్తావములు ఎందేని గ్రంథములలో దొరకకయే పోవునా? 'ఇట్సింగు' అను చీనా దేశపు యాత్రికుఁడు ఈ దేశమునకు బౌద్ధక్షేత్రాదులం జూడవచ్చినపుడు, తన యాత్ర చరితమును వ్రాయుచో శ్రీ హర్షదేవుఁడు బోధిసత్త్వ జీమూతవాహన చరితమును నాగానందమని నాటకము రచించి, దానిని నేర్పరులయిన నటులచే ఆడించి ఎంతయు ప్రఖ్యాతము గావించెనని వ్రాసియుంచినాఁడు. యువాన్ చాంగనువాఁడును వ్రాయకుండఁడు.

ఒకానొకప్పుడు 'కుట్టినీమతకారుఁడు' మహామాత్యుఁడు, కవియు, దామోదరమిశ్రుఁడనువాఁడు తనరాజు వసంతోత్సవమున మంచి నాటక మాడింపుమని కోరఁగా, ఆ వసంతోత్సవమునే తన యితివృత్తమున కొనియాడిన రత్నావళీ నాటికను రాజు భవనము నెదుటనే ఆడించుచో, అందు ప్రస్తావముగన్న వసంతోత్సవమందలి పౌరుల యాటపాటల యూరేగింపును తక్కిన నాటకముంబోలె వేఱు వేసగాండ్రచేత నాడింపక, ఆ నగర పౌరులనే ఆలుమగలను వేశ్యలను అట్లు ఉత్సవమునకై తమంతట సన్నద్ధులైయున్న వారిని, ఆటలో అంగముగా రాజు భవనము వెంబడి క్రోవులతో నెట్టి నీ రొండొరులపైని వేశ్యలపైనిం జల్లుచు ఎఱ్ఱబుక్కాము పొదుముచే సంధ్యారాగముం గావించుచు బోగము మేళములతోఁ గూడ నృత్తగీత వాద్యములతో ఊరేగునట్లు సన్నివేశముం గుదిర్చెనట. ఈ వృత్తాంతమును నటసంఘమునకు రాజొసంగిన బహుమతుల వివరమును ఈ నాటకకథను ఆ మహామంత్రియే ఆర్యావృత్తమున నొక గ్రంథముగా రచించినాఁడు. దీనివలన ఈ గీర్వాణ నాటకములపై ఆ కాలమువారు ఎంత గుఱి పెట్టుకొని ఎట్లు ప్రయత్నవిశేష పూర్వక ప్రయోగముల జేయించి చూచుచుండిరో తెలియనగును. వీనిచే మంచి ప్రేక్షా గృహములును, పరదాలును, మంచి ప్రయోగములును ఉండెనని యూహింపఁదగును. దీన 'పటమును పటక్షేపమును పటాక్షేపమును అపటీక్షేపమును, ఇంకను నాటకములం గల యన్ని సూచనలు ప్రయోగమునకైన సలహాలు చక్కగా నిర్వాహము పొందుచుండెనని ఊహింపదగును. మఱి యా సంప్రదాయము ఆ రాజ్యములు గుఱుతే లేక తురకల నాశన కార్యపరతచే మనకు రాకపోయినది. నాటకముల యొట్టి స్మరణయు లేకపోయినది. ఇట్లుండ బ్రిటిషు దొరతనము నెలకొని యూనివర్సిటీలును, అందు షేక్స్పియరు చదువుకు ఆరంభమైనంతట, వాని ప్రయోగముం జూచుటయు కలిగినంతటను పార్సి నాటక సమాజములు వారి బాసలో నాటకము లాడుచు యూనివర్సిటీ లుండిన రాజధానులలోను వాని చుట్టుపట్లను నాటకమును తత్ప్రయోగమును రుచిచూపఁగా అన్నివిధాల నాటకములును వాని ప్రయోగములు క్రమముగా వాడుకకు వచ్చినవి. ఆ నాటక నూతనోత్సాహమును ముప్పది నలుబది యేండ్లు ఎంతయు విరాజిల్లి క్రముగా గుణము తగ్గఁగా, ఆ సమయమునకు బయాస్కోపు సినీమాలు వచ్చి సర్వమును మార్చివేసినవి. ఇపుడు దాన మరల నొకవిధముగా మన కాళిదాసాదుల సంప్రదాయము చాల మార్పు చెందిపోయినది. కాని మునుపటివలె ఉత్సన్నము కాఁబోదు. అచ్చును పుస్తకములును 'లైబ్రరీలును' పుస్తకములకును పాత సంప్రదాయ జ్ఞాపకములకును సార్వకాలికత కూర్చినవి.

[సశేషము]

'శక్య మంజరిభి: పాతుం హాతా: కేతకి గంధిన:' అని ఎంతో మధురంగా చెప్పినది మరచి పోయి అట్టివి నేటి కవులలో చూసి, దానికి 'పులుముడు' అనే పేరు పెట్టి దోషంగా పరిగణించారు. ఆయన గ్రంథ రచన చేసిన రోజులలో ఆంధ్ర దేశమంతా పర్యటనచేసి గ్రంథ భాగాలు వినిపించారు. ఆయన అభిమానులు దాన్ని బ్రదికించడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా బ్రదుకదు. ఆంధ్రులు కవిత్వ తత్త్వ విహారంలో ఆంధ్రకవులను తిట్టిన తిక్కన్నైనా సహిస్తారు కాని దీనిలోని సర్వ నాశకత్వము సహించరు.

శ్రీ కురుగంటి సీతారామయ్యగారి 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' ప్రథమ ముద్రణము, మధ్యమధ్య కొద్ది అనౌచిత్యాలు చోటుచేసుకున్నా, ప్రాణమున్న గ్రంథము. దానిని ద్వితీయ ముద్రణములో సమగ్రం చేయవలెనని వారి అల్లుడు శ్రీ పిల్లలమర్రి చేసిన పరిశ్రమ వల్ల దానిలోఉన్న ప్రాణం పోయి వూరుకున్నది. మొదటి గ్రంథం మళ్లీ ముద్రిస్తే నాలుగు కాలాల పాటు నిలుస్తుంది.

శ్రీ ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో శ్రీ కురుగంటి వారి సాహిత్యవీధుల్లోని జీవము మధ్యమధ్య కనిపిస్తుంది. కాని దాని సమగ్రత్వ ప్రయత్నంలో ఆ కాస్త ప్రాణం వూపిరాడక ఉక్కిరి బిక్కిరై పోతున్నది.

శ్రీ విశ్వనాథ 'కావ్య పరిమళము' నిలుస్తుంది. అది పాఠకులను మరీ బడిపిల్లలనుగా చేయడము చిరాకు తెప్పిస్తుంది. అయితే ఆయనే అర్థము చెప్పడంలో చేసిన తప్పులు చూచి నప్పుడు 'ఓహో ఇదాకారణ' మనిపిస్తుంది. ఉదా: ధూర్జటి పద్యంలో (పే. 180) 'ఖండపరశువు' అంటే 'శివుడు' అని సాఫీగా అర్థం చెప్పేబదులు గొడ్డలిముక్క అని అర్థం చెప్పుకొని అవస్థపడ్డారు. స్వానుభవంవల్ల ఎవరైనా చిన్నమాటల అర్థంలో కూడా తనవలెనే పొరపడవచ్చుననే భావంతో అర్థవివరణ చేస్తారని సమర్థించుకుంటాము. గ్రంథమంతటా మన పూర్వకవుల కావ్యాలలోని అపూర్వ పరిమళాలు అత్తరుగా చేసి అందించారు గనుక తప్పక నిలుస్తుంది.

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారికి పాండిత్యముతోపాటు రసజ్ఞతా శక్తిగల శైలీ ఉన్నవి. మధ్యమధ్య హాస్యము తళుక్కుమంటుంది. ప్రతిపక్షుల వాదము వెర్రివాదముగా ప్రదర్శించడములో విగ్రహముతో కూడిన వేరు) ఉన్నది. వారి 'రాయలవాటి రసికత' శైలికీ హాస్యానికీ, 'రంగనాథరామాయణము' 'ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథుని స్థానము' అనే రెండువ్యాసాలు వాదపటిమకూ ఉదాహరణాలు. ఆ మూడు వ్యాసాలే కాక, వారి 'నాచన సోమనాథుని నవీనగుణములు' 'నిగమశర్మఅక్క' సూక్ష్మ పరిశీలనకు ప్రత్యక్ష నిదర్శనాలుగా కలకాలం నిలవ గలవు.

శ్రీ తిరుమల రామచంద్ర సంస్కృతాంధ్రాలలోనే కాక అనేక భాషలలో గాఢ పరిచయమున్నవారు.అటువంటివారు ఆంధ్ర దేశంలో అరుదు. ఈ సువిస్తార విజ్ఞానానికి తోడుగా సావధానత ఉంటే ఎంతో రాణించేది. ఆయన పత్రికావిలేఖరి కావడము అందుకు అడ్డువస్తూ ఉంటుంది.ఐనా 'సాహితీ సుగతుని స్వగతం'లో ఎన్నోమంచి వ్యాసాలున్నవి.'నేటి సాహిత్యవిమర్శ' 'దేసి నామ మాల లోని మరికొన్ని పదాలు 'నాయని వారి ప్రణయసూక్తం' 'పదకవితా పితామహుడు' 'ఆఫ్రికా సాహిత్యంలో కల్పనలు' 'అమరావతి ఆదర్శంగా దిద్దుకున్న ఆగ్నేయాసియా' వంటి మంచి వ్యాసాలున్నవి కనుక నిలుస్తుంది. దానికి ఆం.ప్ర.సా. అకాడమీ బహుమతి కూడా లభించినది. వారి 'నుడీ—నానుడీ' కూడా వారు చూపిన విశేషాలకూ, తొందరలో పడే పొరపాట్లకూ నిదర్శనమై నిలవవచ్చు.

స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డి గారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' కలకాలం నిలిచే పుస్తకం.

శృంగార గ్రంథమాల వారు ప్రచురించిన 'క్రీడాభిరామము'నకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపుల పీఠిక కలకాలం నిలుస్తుంది. మనము బూతు పద్యాలనుకునే పద్యాలు ఎన్నో, అందులో పెద్దలవి క్రోడీకరించి సమర్థించారు. దానికి జవాబుగా వచ్చిన శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారి ''శ్రీనాథుడు శృంగారియా' కూడా నిలుస్తుంది. అవి రెండూ తూర్పు పడమరలవలె ఎడముఖంపెడముఖంగా ఉంటవి.

ప్రతి సంవత్సరమూ ఆం.ప్ర. సాహిత్య అకాడమీ రెండు విషయాలు ముందు ప్రకటించి వాటిమీద వచ్చే ఉత్తమగ్రంథాలకు రు. 2,000 —లు బహుమతి ఇస్తున్నది. ఈ సం.నుంచీ రు. 3,500 — లకు పెంచినది. అట్లా బహుమతులు పొందిన గ్రంథాలలో ముఖ్యంగా నాలుగు గ్రంథాలు నిలుస్తవి. వాటివస్తుగౌరవమువల్లనూ, రచనా విశిష్టత వల్లనూ, వాటిలో ప్రదర్శించిన ఆత్మీయతవల్లనూ! శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి (మనుమడు)రచించిన 'నన్నెచోడుని కవిత్వము' అపూర్వమైన గ్రంథము. 1957—58లో బహుమతి పొందినది. సాహిత్య విమర్శకులు [illegible] దానిని పట్టించుకొనక పోవుట విచారకరము. ఈ వ్యాసకర్త ఈమధ్యనే దానిని పఠించి ఇన్నాళ్లూ చదువనందుకు విచారపడినాడు. 2. శ్రీ జి.నాగయ్యగారి 'తెలుగు కావ్యాలలో అవతారికలు' (1966-67) 3. కుమారి పండా శమంతకమణి 'తెలుగు సాహిత్యములో రామకథ' (1969—70) 4. కుమారి ఎం. యస్. ఆర్.ప్రమీలాదేవి 'తెలుగులో పద్యగేయనాటికలు (1971—72).

ఈ వ్యాసం వ్రాస్తున్నట్లు తెలిసి ఒక యువమిత్రుడు 'అతివినయానికి పోయి మీ రచనలువదలబోకండి' అని వ్రాసినాడు. ఆయన సలహా పాటించి ఈ వ్యాసం కూడా నిలిచేవాటిలో చేర్చదలచినాను.

## 8 ఆత్మకథలు

ఆత్మకథలలో శ్రీ టంగుటూరిప్రకాశంగారి 'నా జీవిత యాత్ర' నిలుస్తుంది.

దరిశి చెంచయ్యగారి ఆత్మకథ (పేరు జ్ఞాపకంలేదు) నిలుస్తుంది. అది ప్రథమ మహాసంగ్రామకాలంలో ఆయన విప్లవకారులలోచేరి జర్మనీపక్షాన గూఢచారిగా ఉన్ననాటి అనుభవాలను వర్ణిస్తుంది. అది అపూర్వాద్భుత మైనది. మాసపత్రికలో ధారావాహికంగా వచ్చినది.

శ్రీ తాపీ ధర్మారావుగారి 'కొత్తపాళీ' ఆత్మకథవంటిదే. అందులోని తీవ్రభాషవల్ల నిలవ వచ్చు.

శ్రీ శివశంకరుల 'నాలోమార్పు' నిలిచే వాటిలో చేర్చడం లేదు, అందులో తీవ్రత లేదు గనుక!

## 9 శాస్త్ర గ్రంథాలు

శాస్త్ర గ్రంథము — అందులో వ్యాకరణానికి సంబంధించినది సాహిత్యకోటిలో పరిగణించి నిలుస్తుందంటే నమ్మడము సాధ్యంకాదు. కాని శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారి 'రమణీయము' అటువంటి కమనీయగ్రంథము. నిలిచితీరుతుంది.

శ్రీ వేమరాజు భానుమూర్తి 'సైన్సుకథ' కూడా సాహిత్య గ్రంథంగా నిలుస్తుంది. ఆద్యంతము చదువుతుంటే ఇంకా చదవ బుద్ధిపుటుతుంది.

శ్రీ వసంతరావు వెంకటరావుగారి 'విశ్వ రహస్యం' కూడా నిలుస్తుంది, విజ్ఞానశాస్త్ర విషయాలను భావనాప్రపంచంలోకి తీసుకొని వచ్చింది కనుక!

## 10 సిద్ధాంత గ్రంథాలు

మన మూడు విశ్వవిద్యాలయాలలో అధ్యాపకులువ్రాస్తున్న థీసెస్సులు ఎన్నో ఉన్నవి. అవి విమర్శకు దోహదం చేస్తవి. భావి కాలంలో విషయావగాహనకు ఎంతో ఉపయోగపడతవి. అవి పెద్ద చిన్న గ్రంథాలయాలలో పండితుల పరిశీలనకు అవసరం కాబట్టి తప్పక నిలవ ఉంటవి. వాటి ధ్యేయము ఆత్మీయత కాక అనాత్మీయత. అవి సిద్ధము చేసేప్పుడు, కాబోయే పరీక్షాధికారుల భావాలకు అనుగుణంగా మలచబడుతున్నవనేది బహిరంగ రహస్యము, అవి చాలా అవసరమైన గ్రంథములు. ప్రయోజనకరమైనవి కూడాను. అవి తప్పక గ్రంథాలయాలలో నిలవ ఉంటవి. కాని అటువంటి నిలవ ఉండడము నిలవడమైతే, వస్తు ప్రదర్శన శాలలలో లక్షల సంవత్సరాలనాటి జీవకోటుల అవశేషాలు కూడా నిలిచి ఉన్నవనే అనుకోవలసి వస్తుంది. వాటిలో ఆత్మీయత లేనందున వాటికి సాహిత్యస్థాయిలేదు. వాటికి ఒక నమస్కారం చేసి వదలివేస్తున్నాను.

## 11

ఈ అరవై యేళ్లలో ఆంధ్రభాషలో ఇంతమంచిసాహిత్యం పుట్టినదని వినియైనా గర్విస్తే ఈ వ్యాసకర్త ధన్యుడవుతాడు. ఉత్తమ సారస్వతస్మరణవల్ల ఈ వ్యాసకర్తకు కలిగిన ఆనందము ఇంతంత కాదు. ఆ ఆనందమే ఆంధ్రులంతా అనుభవించవలెనని ఈ వ్యాసకర్త ఆకాంక్ష! ఈ వ్యాసం వ్రాస్తున్న రెండు నెలలలో ఈ గ్రంథాలను మళ్లీమళ్లీ చదవవలసి వచ్చినది. అన్నిటిలో ఎక్కువ ఆనందం కలిగించినది శ్రీ విశ్వనాథ 'అనార్కళి'! నిజానికి దానిమ్మ పువ్వుకు రంగూ రూపమేకాని సువాసన లేదు. కాయగాయని పువ్వు దానిమ్మ పువ్వుకు ఇతర పుష్పాలవాసనలన్నీ ఆరోపించి అద్భుతరచన చేశారు!

[సమాప్తము]



# సమరం

శ్రీ కె. ఎస్. వి. నరసింహమ్

చీకట్లో గడియారం
టిక్కు టిక్కు — భయం భయం
చిత్తంలో కొలమానం,
చిత్రంగా అనుమానం.

చీకట్లో కలగానం
ఝుణ ఝుణ ఝుణ — అదేం? అదేం??
చినుకుల్లో చిరువేడిమి,
చింతనలో ఒక పంచమి.

చీకట్లో దరహాసం
తళ తళ తళ — మరేం! మరేం!
అంతరంగ మథనంలో
ఆనంద మహానుభవం.

చీకట్లో నిర్ద్వంద్వం
కల కల కల — నిజం — నిజం —
బ్రతుకే సమరం — సొంతం
నీ శత్రువు నీ స్వాంతం!!

---

# సంశోధిత మహాభారతము -

# ఆనుశాసనిక పర్వము - I

## కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు నిర్వహించుచున్న సంశోధిత మహాభారతమున శాంతిపర్వము నింతకు ముందే సమీక్షించినాను.[1] ఈ ఆనుశాసనిక పర్వమును గూడ సమీక్షించుటకు నా కవకాశము గల్పించిన భారతి పత్రికాధిపతులకు నా కృతజ్ఞతలను తొలుత దెలుపుకొనుచున్నాను.

సంశోధిత మహాభారతమున నిది ఏడవ సంపుటము. ఇందు పూర్వ సంపుటములందువలె తాళపత్ర ప్రతులనుండి పాఠము లుదాహృతములైనవి. సంస్కృత మూలమున—గల ఆధ్యాయములు, శ్లోకములు నాయా శీర్షికలలో నీయబడినవి.

ఈ సంపుటమునకు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము కీ. శే. చెలమచెర్ల రంగాచార్యులు—సంపాదకులు—ఈ పర్వమున ముందు శ్రీ లక్ష్మీరంజనముగారు వ్రాసిన ప్రవేశిక—డాక్టరు యమ్. కులశేఖరరావుగారి — మహాభారతము, ఉపాఖ్యానములు — అను వ్యాసము—శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులుగారి కవిత్రయ భారతము ఛందః ప్రయోజనము అను వ్యాసము గలవు.

ఈ పర్వ సమీక్షలో పెక్కు విషయములు వెల్లడింపవలసియుండుటచేత, పాఠక లోకమున కనుకూలముగా నుండునట్లు—దీనిని

1) ముద్రణ పాఠభేద విమర్శనము.

2) గ్రంథస్థ విషయ విచారణ

అని రెండు భాగములుగా విభజించినాను. అందు మొదటి భాగ మీ వ్యాసము.

### గ్రంథ ముద్రణము - అవ్యవస్థ

ఈ యను శాసనిక పర్వ సంశోధిత ముద్రణము సావధానముగా పరిశీలించిన సంపాదకు లీ గ్రంథ ముద్రణమున నేమియు శ్రద్ధ తీసికొనలేదని స్పష్టమగుచున్నది. గణయతిప్రాస భంగములతోపాటు పద్యములు, పద్యపాద, పదములు లోపించినవి. ఇవి కేవలము ముద్రణ ప్రతిని జాగరూకతతో పరిశీలింపక పోవుట వలన నేర్పడినవి.

### పద్యలోపము

(1) 1–274.

సీ. ఒక్క స్వగాలంబు నొక వానరంబును
    బ్రీతిమై గూడి వర్తించుచుండు
దొలు పుట్టువున మానవులును నెచ్చెలులునై
    యుండుట గూర్చు నొండొంటికొక్క
యెడనొక నా డవ్వఅడు తోడనాక్రోతి
    కటకటా నీ కిట్లు గడును పేయ
మైన పీనుగు సంజుడాహారమైనట్టి
    భవము వాటిల్లు టే పాపముననొ.

1–275. వ. అని తెలిపె నట్లగుటంజేసి యాసగొల్పి విప్రున కియ్యకున్కి యొప్పదని చెప్పిన నప్పాండవా గ్రజుండు .....

సీస పద్యమున—నెత్తుగీతిగాని ఆటవెలదిగాని ముద్రితము కాలేదు.

---

1. భారతి సెప్టెంబరు అక్టోబరు నెలలు—(1973). ఈ తరువాత భారతి పత్రికాధిపతులు, కర్ణ, శల్య సౌప్తిక, స్త్రీ పర్వములు గల పంచమ సంపుటమును సమీక్షకై పంపిరి. వారికి కృతజ్ఞుడను.

"గీ. అనిన జాతిస్మరణ వంతమగుటఁజేసి
యది విషాదము బొంది ధరామరునకు
నీ నొడంబడ్డ ధనమీన కాననిట్టు
నీచతరజాతియందు జనింప వలసె"

వ. అని తెలిపె నట్లగుటంజేసి అని పూర్వ ముద్రణ పదలోపములు.

(2) 2—85.

సీ. అనఘ యష్టావక్రమునుగల వింకము
దేవహ్రదము బ్రహ్మభావ మొసగు
నా చరిత స్నానుఁడగు మర్త్యునకు నుర్వ
......... .....యోగ సిద్ధకీర్తి.

ఇందు రెండవ పాదమున రెండవ దళమున పదములు లోపించినవి.

'నా చరిత స్నానుఁడగు మర్త్యునకు నుర్వ
శీ కృత్తికాయోగ సిద్ధకీర్తి" అని పూ. ము.

(3) 2–97.

క. మునులకు జప్యంబిది స
ద్వినుతమ్ముఁ బఠించు విమలాత్ములకు నే

రెండవ పాదమున 'నిత్యము' అనుపదము లోపించినది.

(4) 3–248

గీ. 1 పా. అనిన నయ్యందఱును పుణ్యకర్మ

ఇందు'మైన' అను పదము లోపించినది[2]

### పద్య ముద్రణము

పద్యములు ముద్రించునపుడు నాల్గుపాదములు సక్రమముగా, ముద్రింపబడక పోయిన యెడల—గణ యతి ప్రాస భంగములు కల్గించును, అను ప్రాథమిక సూత్రముగూడ విస్మరింపబడి, యీ క్రింది పద్యము లెట్లు ముద్రితములైనవో చూడుడు.

(i) 3—171

క. దైవిక కృత్యంబులకును భూవర
భూసురుల సూక్ష్మముగ శోధింపం
గా వలదు గాని పితృపూ
జావిధికిఁ బరీక్షవలయు సమ్యగ్భంగిన్.

(ii) 3—182

క. మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధ
బెనకుం గైకొనుట మేలు భూసురునిం గై

(iii) 4—16

క. మలయజము నగలు మఱియుం
గలుగు సురభి వస్తువులు నికామప్రియదం
బులు వైహారిక ధూపంబుల యెడ
మానవుల చిత్తములకు నరేంద్రా

(iv) 4—181

క. ఈనెఱి నిలుచుట గలుగదు
మానేర్ష్యావంతులైన మానవులకు ని
ష్ఠా మాన తపోవర్తకులైనను
గార్హస్థ్య బహుముఖాత్ములకు లగుటన్.

(V) 4—260

క. మాత పితృగురులు దక్కఁగ
నే తెరువునఁ బాపమొలసె నేనియు దానిం
బాతురు ప్రాయశ్చిత్త స్థితులు
దద్విషయమైనఁ జెడ దల్పముననే—

(VI) సీసపద్య పాదములుకూడ నెట్లవస్థితముగా ముద్రింపబడినవో చూడుడు.

1—13. 4. పా.

వృత్రుఁజంపఁ డె దేవి విభుడుయజ్ఞ
ధ్వంసనము సేయఁడే ఫాలన యనుఁడట్ల

2—87. 3 పా.

గోకాముఖము నీరఁ గ్రుంకి తండు వికా
శ్రమమునకుఁ జని వల్కలము ధరించి

133. 4 పా.

నులు దేవతా పూజనులు భూమి ధనధ్యా
గోదాన శీలురు నాదరంబు

308. 3 పా.

దోచివికారంబు దొడరక యున్న
రాజును దేవులను గని సుముఖుఁడగుచు

---

2. సంపాదకులీ గ్రంథమునందు పీఠికలోగాని, మఱెచ్చటనుగాని పద్యపదలోపములున్నవని చెప్పక పోవుటచే ముద్రణము సాగుచున్నప్పుడు—వారు దీని నసలు చూడనేలేదని స్పష్టమగుచున్నది.

**4** పా.

నా చరిత స్స్నానుఁడగుటయు
మహోర్ణ్వంబు లగు వివిధాన్నపాన

352. 4 పా.

బడయంగ వలయుఁ బాపఁగ నోపు
బ్రహ్మహత్యాది పాతకముల వలనైన భూమి

3–87. 4 పా.

దీని బఠించిన వీనులనించిన దురిత
వర్గంబులఁ బొరయవలఁదు

114. 4 పా.

ఏనుబాసిన సర్వదానవ కులము
గీడ్పడియోఁ బొందిన సురల్ ప్రభుత నొంది

4. 126. 2 పా.

తుర్థదినంబున దోషి సమయమునఁ
జెందంగఁదగు నంద్రు గొనరార్యులు

5–15. 3 పా.

చారి ధర్మంబు లాశ్రమముల కెల్ల
నాశ్రయణీయమై గృహస్థత్వమొప్ప

**గణయతిప్రాస భంగములు**

పద్యములు పై రీతిగా ముద్రితమగుట సంపాదకు ఉపలక్షింప లేదు సరికదా, ముద్రణప్రతిని పరిశీలింపక పోవుటచే గణయతిప్రాస భంగములు పడినవని కూడ గుర్తింపలేదు. వీనిలో గణ భంగములు హెచ్చుగా నుండుటచే వాని పద్య సంఖ్యలనుమాత్రము తెలుపుచున్నాను.

**గణభంగములు**

ప్రథమాశ్వాసము –(1)–96–98–104–109–147—163—170–177—200—209–222–235–326–331–340–346 347-365–367-368–378–382.

ద్వితీయాశ్వాసము—(2)—60—66—79 92–97–135–140–160–172–174–370—474.

తృతీయాశ్వాసము—(3)—13—54—87—116—155—193—256—264.

చతుర్థాశ్వాసము—(4)—42—63—189 206—229—254—298—313—325—394—398—439.

పంచమాశ్వాసము—(5)—5—18—35—43—45—55—66—68—82—91—99 144—216—223—226—272—350—379—426.

### యతిభంగములు

2—70 తే. ......ధర్మదేవ
తా తనూ భవ బ్రహ్మహత్యాసమంబు

2—168 క. అనుటయు ననేక మాయలు
బొనరుపగా నేర్చు రూపములునై.

3—256. తే. ఇవ్విధమున వినోదింప వినుము గగన—

### ప్రాసభంగము

2—64. గీ. బ్రతికి నతఁడు గంద్రుడు త్రిదశపదము—

ఇంకను, అర్ధానుస్వార రహితములు—పదవ్యత్యయములు—ముద్రణ స్ఖాలిత్యములు నున్నవి. విస్తరభీతిని వానిని వివరింపలేదు. ఇంకను నీ విషయ మింతటితో నాగలేదు. పద్య ముద్రణ విధానమును గూడ సమీక్షించిన—యీ ముద్రణా వ్యవస్థ స్వరూపము వ్యక్తమగును.

### పద్యముద్రణ విధానము

సంశోధిత మహాభారత ముద్రణ సందర్భమున అచ్చు ప్రతులలో వావిళ్లవారు ముద్రించిన భారత ప్రతియే ప్రధానముగా గ్రహింపబడినది. పాఠభేద నిర్ణయమున ఆనంద ముద్రణము కూడ గ్రహింపబడినది. అయినను పద్యముద్రణ విధానమంతయు వావిళ్ల ప్రతి ననుసరించి సాగలేదు. అందు ముఖ్యమైనది సీసగీతాటవెలది కంద పద్య ముద్రణము.

### సీసపద్యములు

పై రెండు ముద్రణములలో సీస పద్యములు గీతముతో గాని—ఆటవెలదితోగాని—ఆఱు పాదములుగానే ముద్రితములైనవి. కాని యీ సంశోధిత ముద్రణమున నీ పద్ధతి సక్రమముగా పాటింపబడలేదు. మొదటి రెండు సంపుటముల (ఆదిసభా ఆరణ్య పర్వములు) యందును సీసపద్య మాఱు పాదములుగానే ముద్రిత మైనది. ఏ కారణముచేతనో, విరాటపర్వమునుండి, యీ పద్ధతి మాఱినది—సీసము—6 పాదములతో గాక 12 పాదములతో ముద్రించుట యారంభమైనది. అప్పుడు సీస పాదములు, 8—గీ.తాట వెలది పాదములు నాలుగు పండ్రెడగుచున్నవి. మూడవ సంపుటమగు విరాటోద్యోగ పర్వములందేగాక—చతుర్థ (భీష్మ ద్రోణ) పంచమ (కర్ణశల్య సౌప్తిక స్త్రీ) షష్ఠ (శాంతి) సంపుటములందును నీ సప్తమ సంపుటము నందును, పండ్రెడు పాదములు ముద్రితములైనవి.

ఇట్లే సంశోధిత ముద్రణమున సీస పద్యములు కొన్ని సంపుటములలో, 6 పాదములతోను, కొన్ని సంపుటములలో 12 పాదములుగాను ముద్రిత మగుటవలన—పద్య ముద్రణ విధాన మేకరీతిగా లేదనియు—దానిని సంపాదకులు గమనింపలేదనియు విశదమగుచున్నది.

ఇక పండ్రెండు పాదములలో సీసపద్య మెందుకు ముద్రింపగూడదు?—దీని కేమైన నిర్ణయమున్నదా? యని ప్రశ్నింపవచ్చును. దానికి—ఉన్నది యని ప్రత్యుత్తరము—ఇదిగో లాక్షణికులు—సీసమునకు ఆఱు పాదము లని నిర్దేశించినారు.

క. తన పాదంబులు నాలుగు
మొనసిన పై గీతి పాదములు రెండునుగా
నిను మూడై సీసములకు
జను నడుగులు వ్రాలు వళ్లు సరి యున్నిటికిన్.

క. సీసములకు నాఱడుగుల
ప్రాసములిడి... .....

(కావ్యాలంకార చూడామణి— 8 ఉల్లాసము 36, 39 పద్యములు.)

అప్పకవీయమున చతుర్థాశ్వాసమున 335 పద్యమున — సీసపద్యమునుగూర్చి పై లక్షణ మనువదింపబడినది. ఇందువలన సీసమున నాఱుపాదములే యుండవలెను. గ్రంథ పరిణామమునుబట్టి 12 పాదములుగా ముద్రించుచుండుట మనకు తెలిసినదే. అయినను లక్షణము ననుసరించి యాఱు పాదములు ముద్రించు ననుకూలత యున్నప్పుడు దానిని మార్చుట లాక్షణిక విరుద్ధము.

## తేటగీతులు, ఆటవెలదులు

సీసములతో చేర్చబడినవిగాక ప్రత్యేకముగానున్న పై పద్యములు, వావిళ్ల ముద్రణమున రెండు పాదములే గలవు. ఇందు సర్వత్ర ఆ పద్ధతి పాటింపబడలేదు. మొదటి రెండు సంపుటములలో సరిగానున్నను తక్కిన వానిలో నాలుగు పాదములే ముద్రితములైనవి.

## కందములు

ఇవియు వావిళ్ల ముద్రణమున నాలుగు పాదములకు బదులు—రెండు పాదములుగానే ముద్రింపబడినవి. ఆశ్వాస ప్రారంభమున మాత్రము నాలుగు పాదములున్నవి. ఈ సంపుటములలో న్వాశాస ప్రారంభమున నాలుగు పాదములున్నను తక్కిన పట్టుల—నాలుగు పాదములుగా ముద్రితమైనవి.

సంశోధిత ముద్రణమైనపుడు గ్రంథ ముద్రణమంతయు నేకాకారముగా నొక పద్ధతిని వెలయవలయునుగాని వ్యత్యాసములుండరాదు. ఇంతకు నీ ముద్రణమున కాదర్శమున్నను నిట్లుండుటచే విమర్శింపవలసి వచ్చినది.

పై పద్యము లారు, రెండు పాదములలో ముద్రింపక పోవుటచే—పుటల నవసరముగా పెరిగి గ్రంథ బాహుళ్యమునకు కారణమైనది. ఇందువలన నేడు సంపుటములలో వెలువడవలసిన మహాభారత మెనిమిది సంపుటములైనది.

తాళపత్ర ప్రతులతో పరిశీలించి, పాఠభేదములను నిర్ణయించి, పూర్వ ముద్రణముల లోని దోషములను సంస్కరించి, సాధికార ముద్రణము నవతరింపజేయుట సంశోధిత ముద్రణ లక్ష్యము. అట్టి లక్ష్యమును విస్మరించి సంపాదకులు బాధ్యతా రహితముగా నింత యవ్యవస్థితముగా నీ ముద్రణము వెలువరించుట శోచనీయము.

ఇంక పాఠభేద విమర్శనము.

## పాఠభేద విమర్శనము[3]

ఈ యనుశాసనిక పర్వ ముద్రణమున—తక్కిన పర్వములందువలె, పాఠభేదములు చూపబడినవి. కాని, కొన్ని పట్టుల కావింపబడిన విమర్శన మసంబద్ధముగానున్నది. ఇందును కొన్నిచోట్ల గణయతిప్రాస భంగములు గలవు.

ప్రథమాశ్వాసము—

1) 1—68.

క. అతిథి నినుఁ 1 గోరెనేనియు
2 మతిఁగెంకిరి పడక యోలమాస గొనక నీ
వతనికిఁ బ్రియంబు సలుపుము
సతికిం బతి పనుపుసేయఁ జను—నెల్లదియున్.

12 వ పుట యడుగున నిట్లు గలదు—

'68 1. వచ్చివేడిన మతిగింకిరి — అనం. 2. ఇచ్చట అఖండయతి కాన్పించుచున్నది. ఈ ప్రయోగము అఖండయతిని అంగీకరించువారికిని నిరాకరించువారికిని వివాదాస్పదమైనది. అప్పకవి యీ పద్యమును దేశ్యనిత్యసమాస విశ్రాంతికి ఉదాహరణముగా పేర్కొనెను.'

ఈ వాక్యములు రెండును నసంగతములు.

ఇక 'అప్పకవి యీ పద్యమును — దేశ్య నిత్యసమాస విశ్రాంతికి ఉదాహరణముగా పేర్కొనెను' అనుటవలన గ్రంథ సంపాదకు లప్పకవీయమును సరిగా చూడలేదని స్పష్టమగుచున్నది.

అప్పకవి దేశ్య నిత్యసమాస విశ్రాంతులు అను వానిని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

### దేశ్య నిత్య సమాస విశ్రాంతులు

తే. శబ్ద శాసనముఖ కవీశ్వర కృతి ప్ర
బంధముల లక్ష్యములఁ గనుపట్టు వేతన
దేశ్య నిత్యసమాస సంధికిఁ బొసంగు
వడి స్వరంబైన వ్యంజన వర్ణమైన. 3—190.

క. రూపఱఁ బెంపఱఁ బెల్లఱ
నే పఱచుటఁ గ్రిక్కిఱియుట నిలగ్రచ్చఱయున్
జూపఱి యుక్కఱి మొదలుగ
క్ష్మాపతి యివి దేశ్య నిత్యసమాసన పదముల్ 3—191.

వ. కొందఱు వీని పేరే దేశ్యాఖండములందురు. 3–192.

3. గ్రంథ విస్తరభీతిచే కొన్నిటిని మాత్రమే చూపుచున్నాను.

అప్పకవి యిచ్చిన పై దేశ్య నిత్య సమాస పదములలో ఓలమాస అనుపదమే లేదు. అతడిచ్చిన లక్ష్యములలో—ఉక్కళు, ఏపఱు, పెంపఱు, క్రిక్కిఱిసి క్రచ్చఱు అనుపదములకు మాత్రమే ఉదాహరణలు గలవు. (చూ. పద్యములు 3—193 మొదలు 201 వఱకు) ఇందువలన 'ఓలమాస' ఉదాహరణము కాలేదు.

ఇదిగాక, దేశ్య నిత్య సమాస విశ్రాంతి కుదాహరణముగా పేర్కొనిన పద్యము 3–266 అని కలదు. కాని అప్పకవీయమున 3—266 పద్యము దేశ్య నిత్యసమాస విశ్రాంతి కుదాహరణము కాదు. అది.

## అగావ్రిహ్యావర్ణ చతుష్టయ వళులు

అన్నదాని కుదాహరణ

క. యరలవలను నీ నాల్గను
వరుసం దమలోన వళ్ల రయమునఁ జెల్లున్
ధర శష సహ వర్ణంబులు
సరవి నొకటి కొకటి చెల్లుహరి నిభరేచా
3–266.

ఈ రెండింటికి సంబంధమేమి

ఇంతకు అప్పకవి పై పద్యమున చూసిన పాఠభేద మీా సందర్భమున సూచింపబడనే లేదు[4] ఆ పద్య మీా క్రింద చూపుచున్నాను.

అప్పకవి సులక్షణ సారమున లింగము గుంట తిమ్మన యిచ్చిన పాఠముల ప్రశస్తములని చెప్పి యీా క్రింది పాఠము నిచ్చినాడు.

క. అతిథి నినుఁ గోరె నేనియు
నతి కింకిరి పడక యోలమాస పడక నీ
వతనికిఁ బ్రియంబు సలుపుము
సతికిం బతి పనుపుసేయఁ జనునెల్ల వియున్
3–205.

మతి కింకిరి పడక—అనుచో అతికింకిరి పడక–ఓలమాస గొను అనుచో—ఓలమాసపడక—ఎల్లవియున్—అను పాఠములు చూపబడలేదు. అప్పకవి యిచ్చిన ఓ వతికింకిరి అనుపాఠ మెచ్చటను గానరాదు. ఈ పద్యమున 'మతికింకిరి' అనియే పాఠమున్నట్లుగా మార్కండేయ పురాణమున–2-158 వ పద్యము రూఢి చేయుచున్నది. (మతికింకిరి పడక–యతిస్థానము)

అప్పకవి దీనిని యప్రశస్త ప్రాసక్రింద పరిగణించుట సరికాదు. అప్పకవికి రెండు శతాబ్దులకు ముందు విన్నకోట పెద్దన యీా ఓలమాస శబ్దమును దేశీయవళి క్రింద యిట్లు చూపినాడు. దేశీయ వళుల కుభయ యతులు చెల్లును.

చ. కలుకటి కల్లడంబు కడు కట్టిడి
తెమ్మెర లోల మాస గ్ర
చ్చఱు యెసలారు లుల్లుఱుకు లాడెడి
వీఱిడి రజ్జు లాఁడు గ్రి
క్కిఱి యుట నా దెనుంగు నను
నీ యుభయంబు వళిప్రకారమై
మెఱయుఁ గవిప్రయోగమున
మేలమెఱింగి రచింప నేర్చినన్
సప్తమోల్లాసము 69 ప.[5]

అప్పకవి లింగమగుంట తిమ్మకవి పాఠము తప్పని నిరూపించుటకు క్రొత్త పాఠమును సృష్టించినాడు. ఓలమాసపడక—అను పాఠము అతడు సృష్టించినదే. 'యవనికాంతరమున నోలమాస గొనియె' అని నైషధము (4—97) ఇందు గొనియె అని కలదు. ఇచ్చట తిక్కన పాఠము 'ఓలమాసగొనక'గాని 'పడక' గాదు.

సంపాదకు లీ సందర్భమున పై విన్నకోట పెద్దన పద్యము నుదాహరించి యుండవలసినది. కాని యట్లు చేయలేదు.

## ద్వితీయాశ్వాసము

2. 2–105. గీ. 4 పా.

దుక్కు—ఁడై యుండు నిర్మల చిత్తవృత్తి
ఇచట యతిప్రాసలు రెండు తప్పినవి.

---

4. అప్పకవీయమునకు అప్ప. అని సాంకేతికము.

5. అప్పకవీయ పంచమ ముద్రణ పీఠిక—(పుట 16 (1951) ప్రథమముగా దీనిని నేను చూపితిని.

6. భారత పాఠములకు ముఖ్యముగా నన్నయ పాఠములకు నూతన పాఠములు సృష్టించు విద్య అప్పకవికి వెన్నతో బెట్టినది. చూ. నా అప్పకవీయ తృతీయాశ్వాస వ్యాఖ్య.

పుట యడుగున పాఠభేదములలో నిట్లుగలదు.

105. 1. డుక్తుడై యుండు : ఆ. ఉ. ఎ. ఏ. ఐ. ఓ. క. ఖ. ల. స; డత్తియుండును. చ. వ. వీ. ష. స; డుత్తుడై యుండును.

సంపాదకులు పది ప్రతులలో—'ఉక్తుడు' అను పాఠమున్నది గదాయని దానిని గ్రహించిరే కాని—అది గ్రహించుటవలన యతిభంగమైనదని గమనింపలేదు. వ్రాత ప్రతిలోనుండు 'ఉత్తుడై యుండు' అనునదియే సరియైన పాఠము. అప్పుడు ప్రాస యతియగును.

శ. ర. పాఠము:

ఉత్తుఁడు వై.విశే. తగినవాఁడు.

గీ. ఎన్ని యేడులు మనుజుని యెమ్మెగంగ
వారిలోనుండు నన్నివేల్ వత్సరములు
నాకలోక మహాసుఖ శ్రీకి నాతఁ
డుత్తుఁడై యుండు నిర్మల చిత్తవృత్తి

భార. అను ౨ ఆ.

సూ. ని. లోను 'ఉత్తుఁడు' అను పదమే గలదు.

ఉత్తుఁడు. విశే. (సం. యుక్తః. ప్రా. యుత్తో. ప్రా జుత్తో.)

అర్హుఁడు, తగినవాడు పాత్రుఁడు.

ఉ. చిత్తజు రాజ్య సంపద......
నుత్తులు దార దాఁబుర వనోప వనంబుల బూ
గుత్తుల............
నొత్తిరి     విక్ర. ౧. ౯౪.

క. ఎత్తినలేచి.........
మత్తి............
త్యుత్తమ
నుత్తునిఁ గావించి     భోజరా. ౪.౩౩౪.

పై విక్రమార్క చరిత్ర భోజరాజీయ ప్రయోగములనుబట్టి భారత పాఠము 'ఉత్తుడు' అనియే యుండవలెను. కాని యీ సందర్భమున, నిఘంటువైన—శబ్దరత్నాకర పాఠముకూడ చూపబడలేదు.

(3) 2—186. తే.............వలసి
యున్నయది పరదార సముత్సుకుండు

**Statement about ownership and other particulars about newspaper**
**BHARATI**
**MONTHLY**

*FORM IV* (SEE RULE 8)

1. Place of publication: Madras.
2. Periodicity of its publication: Monthly
3. Printer's Name: Sri S. Nageswara Rao
   Whether citizen of India Yes
   If foreigner, state the country of origin —
   Address 16, Luz Avenue, Mylapore, Madras-4.
4. Publisher's Name Sri S. Nageswara Rao
   Whether citizen of India Yes
   If foreigner, state the country of origin —
   Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.
5. Editor's Name. Sri S. Radhakrishna
   Whether citizen of India Yes
   If foreigner state the country of origin —
   Address: 16, Luz Avenue, Mylapore, Madras-4.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESS |
|---|---|
| 1. Mr. S. Radhakrishna | 16, Luz Avenue, Mylapore, Madras-4, |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4 Mrs S. Rajeswari | Do |

I, S. Nageswara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. NAGESWARA RAO

1-3-74     Signature of Publisher

పుట యడుగున—"186.1. దారా సముత్సు కుండు—ఇ. ఐ. క. ప. శ. వ.

(దారాసంగ్రహంబు ధరణీశరతి పుత్ర—నన్నయ సభాపర్వము.)

దారాసముత్సుకుండు— అని 6 ప్రతులలో 'నుండగా --'దార' సముత్సుకుండు అను పాఠము నిచ్చుట సరికాదు. ఇది దార శబ్దము. అకారాంత పుల్లింగ నిత్యబహువచనమును నభిప్రాయముచే నిచ్చి నట్లున్నది. కాని 'దారా' అని దార శబ్దమునకు స్త్రీ లింగము గలదు—అమరకోశము నందిట్లు గలదు. (పుట 355).

'దారయంతి ఉద్వేజయంతి పతీనితి దారాః. అకారాంత పుల్లింగ నిత్య బహువచనము—అయం స్త్రీలింగేపి 'క్రోడాహోరా తథాదారా త్రయ యేతే యథా క్రమమ్. క్రోడేహోరే చ దారేషు త్రయం ప్రోక్తా మనీషిభి రితి చంద్రః. ఈ." పై దానిబట్టి 'దారా' అను స్త్రీ లింగమున్నట్లు స్పష్టము—అందువలన దారా సముత్సుకుడు సరియగు పాఠము. ఇక

(దారా సంగ్రహంబు ధరణీశరతి పుత్ర) నన్నయ సభా పర్వము—ఇచట 'దారా సంగ్రహంబు 'అని నగణ భంగము. దార సంగ్రహంబు అనియే యుండవలెను. నన్నయ సభా పర్వమున ఆకరముగూడ తెలుపలేదు. అది సభా పర్వము 1—52 లో నున్నది.

ఇట్లే 4—93 లో దార శబ్దము మార్పు గావింపబడినది.

క. పరదారలయందును సఖి
గురువృద్ధ నృపాల..... ...

పుటయడుగున 93.1. దారములందున. శ. ష. కొన్ని ప్రతులు. వ్రాతప్రతులలో దారములు' అని యుండగా 'దారలయందు' అను పాఠము నిచ్చుట సరి కాదు. పరదారపులు అనియే పాఠము. సూ. ని. లో

దారములు—సం. వి. అ. పుం. బ. భార్య.

క. పరదారములందును సఖి
గురువృద్ధ నృపాల......

భార. అను. ४. ౯3.

అహోబల పండితీయమున నిది సమర్థింపబడి నది. ఇచట సూ. ని. పాఠము చూపబడలేదు.

## తృతీయాశ్వాసము

(4) 3—161 సీ. 4 పా.

గజధర్మ విష్ణు చిత్తజ తిథులం
దేక శత జంతువులను గోచయము గువ్య

ఇచట గణభంగమగుటయేగాక పాఠము 'శత' అనునది తప్పు. 'ఏక శఫ జంతువులును గోచయము గువ్య' అనునది సరియగు పాఠము. శఫ మనగా గొరిజ. ఏకశఫమనగా ఒకే గొరిజగల గుఱ్ఱములు మొదలైన జంతువులు.

ఈ సీసపద్యమున నాయా తిథులందు పితృ యజ్ఞము చేసిన మనుజునకు గలుగు లాభములు వివ రింపబడినవి. పాడ్యమిని—అందమైన స్త్రీకి మగడ గును. విదియను ఆడుబిడ్డలకు కన్న తండ్రియగును. తదియ, చవితి వీనియందు గుఱ్ఱములు, పశువులుగల వాడగును. పంచమిని కొడుకుల తండ్రి. షష్ఠిని కాంతిమంతుడు, సప్తమిని వ్యవసాయవంతుడు, అష్ట మిని వర్తకుడును నగును.

'గజధర్మ విష్ణుచిత్తజ తిథులందు అనగా— నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి తిథు లందు పితృకార్యము చేయువారు ఏకశఫ జంతువులు— ఒక్కగొరిజగల గుఱ్ఱములు, ఆవుల కదుపులు, వెండి బంగారు మొదలగు వస్తువులు బడయుదురు.'

(5) 3—202

క శ్రాద్ధంబు ప్రకారంబును
వృద్ధాచార్యోక్త భంగి...

పుట యడుగున నిట్లు గలదు—

1. శ్రాద్ధక్రియా విధమెల్లను అ. ఈ. ఇచట రేఫ సంయుక్తాక్షర పూర్వము (క్రి) లఘువుగా చదువవలెను. రేఫ సంయుక్తాకర పూర్వము లఘు వుగా చదువవలెను. అన్న అభిప్రాయముతో నీ పాఠము విసర్జించి 'శ్రాద్ధంబు ప్రకారంబుమ' అను పాఠము పైన చూపినారు. కాని తాళపత్ర ప్రతుల పాఠము సరియైనది.

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్ర హమున—దీనికి లక్షణముచెప్పి లక్ష్యముల నిచ్చినాడు.

ఉ. కావున కామక్రోధములఁ గ్రాఁచుచు. భార. శాంతి. 4–252[7] తిక్కన

శ్రీనాథుడు. సీ. పా. గీతవాద్య వినోద క్రియలఁదగులు (కాశీ. 5–31)

## చతుర్థాశ్వాసము

(6) 4—380. క. 3 పాదము శం,

తన సుతునకుఁ బ్రణమిల్లె

పుట యడుగున శంతనుసుతు —అను రూపమును గూర్చి చర్చ గలదు—'శంతనువు అను రూపము లేదు. మను, వటు శబ్దములకు 'డుక్' రాదు' అని యచట వ్రాయబడినది. కాని వటు శబ్దమునకు 'డుక్' వచ్చును—చూడుడు.

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె
బహుధా జల్ప న్నిశాటంబు
భాగ. 8—531.

(7) 4—399.

క. ఆ కృష్ణుఁడు నిజ సౌమ్యా
లోకనమున నా శిఖిని మలుగఁ జేసెం బూ
ర్వాకారత నవ్వనము ని
రాకులతం బొలిచె నది మహాద్భుత మయ్యెన్.

పుట యడుగున—'399. 1 నులుగ—శ. ర; ములుగు. సూ ఈ పాఠమున వాక్యార్థము సరిగా అన్వయించుట లేదు'—అని కలదు.

శ—ర. అనగా శబ్ద రత్నాకర పాఠము—అందు 'నులుగ' అను మాటయే లేదు. చూడుడు—అందున్నది మలుగు.

'మలుగు. దే. అ. క్రి. 1. ఆఱు. క. ఆ కృష్ణుఁడు నిజసౌమ్యా, లోకనమున నా శిఖిని మలుగఁ జేసెన్ బూర్వాకారత నవ్వనము నిరాకులతం బొలిచె నది మహాద్భుత మయ్యెన్.' భార. అను. ४. పుట (608). ఇక ములుగు—సూ. అనునది తప్పే— అందున్నదియు మలుగు.

మలుగు—అ. క్రి. (త. మళుంగు) 2. (దీపాదులు) ఆఱిపోవు—'ఆ కృష్ణుఁడు నిజసౌమ్యా, లోకమున నా శిఖిని మలుగఁ జేసెం...'భార. అను ४. ३౯౯. (పుట 184. సూర్యరాయాంధ్ర నిఘంటు. 6 సం.)

ఈ 'మలుగు' పాఠమున వాక్యార్థము అన్వయించుచునే యున్నది.

అది—

క. ఆ కృష్ణుఁడు నిజ సౌమ్యా
లోకనమున నా శిఖినిమలుగఁ జేసెం బూ
ర్వాకారత; నవ్వనము ని
రాకులతం బొందె, నది మహాద్భుత మయ్యెన్.'

అని ముద్రితము కావలెను. శ్రీకృష్ణుడు తపోదీక్షలో నున్నప్పు డగ్ని అతని వదనమునుండి వెడలి, కైలాసమున వృక్షములు మొదలగువానిని దహించెను. అచటి మునులు భయపడగా తపోరూపమును వీడి, పూర్వము తనకు స్వభావసిద్ధమగు సౌమ్యమైన మూర్తిని దాల్చి— ఆ అగ్నిని నార్పివేసెను. అప్పుడు వనమంతయు నాకులత్వము వీడెను. ఇట్లు చేయుట మహాద్భుతముగా నుండెను—అని అర్థము.

(8) 5—106—

సీ. పా. ధనిక గృహద్వారమునఁ బ్రతిహారి ద
మ్మాఁగంగనుండి దైన్యమున దుఃఖ

గీ. పడు జనంబులు...

పుట యడుగున—6—ఫణిహారి—పెక్కుప్రతులు— అని పాఠభేదము పెక్కు ప్రతులలో నున్నట్లు తెలుపబడినది.

ఇచ్చట—తాళప్రతులలో 'ఫణిహారి' అను పాఠముండగా అది సరికాదని మూలమున—'బ్రతిహారి' శబ్దము నిలుపుట పొరపాటు—'ఫణిహారి' అను పాఠమే సరియైనది—అది 'ఫణిహారి' అని వ్రాయసకాండ్రు వ్రాసినను అది 'ఫ'కారాది కాదు. పకారాది—పణిహారి—ఈ పద చరిత్ర చిత్రమైనది—సంస్కృతమున ప్రతీహార శబ్దమునకు—తెలుగున—'పడిహారి' అని, 'పణిహారి' అను రెండు రూపాంతరము లేర్పడినవి— కాని రెండును తెలుగు పదములు కావు.

1. పడిహారి—ఇది కన్నడ పదము— ప్రతీహార శబ్దమున కపభ్రంశ రూపము.

---

7. దీనినిగూర్చి నేను భారతి అక్టోబరు (1973) నెల సంచికలో నా శాంతి పర్వ సమీక్షలో తెలిపినాను. పుట 20.

2. పణిహారి—ఇది తమిళ పదము — తమిళ మున — ప్రతీహార శబ్దమునకు 'పణిక్కారన్' అని యగును. తమిళమున 'హ' మొదలగు మహాప్రాణము లుండవు—'క'గా నుచ్చరింపబడును.

పై కన్నడ తమిళ పద సాజాత్యమునుబట్టి—తెలుగున శబ్దము—'పణిహారి' కాని 'ఫణిహారి'కాదు.

ఇక ప్రయోగములు—

పడిహారి :

ద్వి. మడవులేఖయునంది పడగయుఁ గొనుచు
బడిహారిక్రియ పట్టపగల యేతెంచె—

బసవపురాణము—6 ఆ. 66 పుట.

పణిహారి :

ద్వి. పణిహారులను బిల్వఁగా బంచి యపుడు
కణకతోకల్యాణ కటకంబునందు—

పండితారాధ్య చరిత్ర—దీక్షాప్రకరణము.

పై ప్రయోగముచే పణిహారి పాఠము—అచట నిర్దిష్టము—

(9) 5–202—సీ. 3 వ పాదము...బ
హుళపక్ష మపరాహ్ణ ముగ్మడి యమవస
ద్వాదశినవములు వరఁగు దుషి

ఇచట రెండవ దళమున గణభంగము –

'ద్వాదశి నవముల వరఁగు దుష్టి' అని యుండ వలెను.

పుట యడుగున నిట్లు గలదు—

202–1. బారసినవములు బరఁగు దుష్టి—ఉ. ఔ. ద్వాదశినవములు — వరఁగుదుష్టి పి. శ. ష. తేరసి—అనగా త్రయోదశి. అని 'న' తేరసి నవమాద్య తిథులుఁ దుష్టి—వా. కొన్ని ప్రతులు—

ఇచట — తేరసి నవమాద్యతిథులుఁ దుష్టి —అను నది సరియైన పాఠము. మూలానుగుణము—తేరసి—అనునది—త్రయోదశి శబ్ద తద్భవము—

తేరసి నవమాద్యతిథులుఁ దుష్టి—అని సూ. ని. పాఠము. ఇది ఉదాహృతము కాలేదు— మూలమున నిట్లున్నది:

శ్లో. అమావాస్యాం త్రయోదశ్యాం
నవమ్యాం ప్రతిపత్సుచ
తిథిష్వేషా సుతుష్యంతి
దత్తేనేహ పితామహాః.

భార. అను 238. వ. (సూ. ని. పుట 68. 4 వ సంపుటము)

(10) 5–420. క. 1 వ పాదము.
ఇవి మూఁడు దెఱంగులు ధ
ర్మువు

పుట యడుగున నిట్లుగలదు:

419–1. గమనిక : 'మూఁడు' అను పదము సానుస్వారమైనట్లు భారత కవుల ప్రయోగములు లభింపలేదు. కవిత్రయేతరులైన కొందఱు మహాకవులు దీనిని సానుస్వారముగా ప్రయోగించి యున్నారు. కవిత్రయ ప్రయోగములు లేకున్నను- అనేక శబ్దముల నర్ధానుస్వారము లితరకవుల ప్రయోగముబట్టి నిర్ధారితములై — భారతమునను చూపబడుచున్నవి — నన్నెచోడని కుమారసంభవమున—

క. పొండిగ నగజతపశ్శిఖి
మూండు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము - అని పూర్ణబిందు ప్రయోగమే

కాక నన్నెచోడనికంటె ప్రాచీనమగు కవిజనాశ్రయమున—

ప్రగీతి. మూండు చేసిన గణములు...ఇ
ట్లుండఁ జెప్పవలయు' అని నిర్ధారకముగా నీ రూపము గలదు.

చూడుడు. శ. ర. సవరణలు వివరణలు పుట 855.

[తరువాయి వచ్చే సంచికలో]

# ఒక ఉత్తరం - జవాబు

శ్రీ వి. ఆర్. శశిధరుఁడు

హైదరాబాద్,
18–12–'73.

డియర్ శశీ—

నీ ఉత్తరం అంది చాలా రోజులయింది. దానికి జవాబు వ్రాయటం ఆలస్యం అవుతోంది. ఈ ఆలస్యానికి కారణం అలక్ష్యంకాదని నువ్వు గుర్తించ గలవు. అందుకే ఆలస్యమయినా ఉత్తరం వ్రాయ గలుగుతున్నాను.

నీ కధ చదివి నా అభిప్రాయాన్ని అంద చేస్తాను.

ప్రస్తుతం యీ రోజునుండి నెల రోజులవఱకు శలవు సంపాదించి మన గుడివాడ వెళ్లే ప్రయత్నంలో వున్నాను.

శలవుకు కారణం 'రొటీన్‌లైఫ్'లో 'టేస్ట్' చచ్చిపోయి జీవితం భయంకరంగా వుండటమే!

—అందుకే, నీవూ—నేనూ—మనము జీవిత పాఠాలు నేర్చుకున్న ప్రదేశానికి వెళుతున్నాను. పతి, నేనూ, సుదర్శనం, మన రాజా—వీలున్నంతవఱకూ అందబోయే ఆనందమేదైనావుంటే అనుభవిద్దామని కలలుకంటూ గుడివాడ బయల్దేరుతున్నాను.

నీ ఉత్తరం నాకన్నా రెండుసార్లు నా శ్రీమతి చదవటం తటస్థించింది.

నీ మీద తన 'సింపతీ' చూపెడుతోంది.

స్త్రీ లేందే మగవాడి జీవితంలో 'టేస్ట్'లేదని భ్రమపడి జాలిపడే మహిళలు 'లిప్‌సింపతీ' యివ్వటంలో అగ్రగణ్యులు.

నా శ్రీమతి అనుకొంటుంది—

—నీవు తోడులేక, దొరకక ఎడారిలో ఎండి పోతున్నావని బాధ పడుతోంది. నేను ఆమెను చూచి జాలిపడుతున్నాను. తన మాటగా ఓ సిఫార్సు చేయ మంది.

హిందూధర్మానికి ఆదిమట్టమైన వివాహ బంధానికి కావలసిన మూడు ముళ్లు వేయటం నేర్చుకోమంటూంది.

అలా సిఫార్సుచేసి నీ కొక గుదిబండ తగిలించేసి చూచి సంతోషిద్దామని తన ఆశ.

ఆడవాళ్లంతా యింతే ననుకోబోకు.

పెళ్లైన మగవాళ్లు కూడా యింతే.

అయినా నువ్వు సంసార సాగరంలో మునిగి పోలేక తేలుతూ, తేలలేక మునిగిపోతూవుంటే, చూచి 'వీడు నాకు తోడున్నాడని' ధైర్యం తెచ్చుకునే అవ కాశం యిమ్మని, అందుకోసం నీవు పెళ్లి చేసుకోమని నేను నా శ్రీమతిలా చెప్పదలుచుకోలేదు.

నేను చెప్పబోయేది,

మనిషికి కూడూ, గుడ్డా, 'గుడ్డి'యే కాదు అవసరం, జీవితం.

జీవితం లేందే మనిషి లేడు.

జీవితం అంటే ప్రాణమే కాదు.

ప్రాణమే జీవిత మనుకొంటే, ప్రతి సూక్ష్మ మైన జీవీ మనకన్నా ధన్యమైనదే.

పరిపూర్ణమైన జీవితానికి,

జ్ఞానం, ఆరోగ్యం, డబ్బూ ముఖ్యం.

యీ మూడూ వున్ననాడు జీవితానికి బోల్డంత వ్యాపకం. 'బోర్' కొట్టదు బ్రతుకు.

నీకు జ్ఞానం వుంది. ఆరోగ్యం నేను చూచి నపుడు వుంది. డబ్బు—అదే మనకు లేంది. అందుకే సంపాదించు డబ్బు. అందుకు నీకున్న జ్ఞానాన్ని వుప యోగించు. సంపాదించు.

డబ్బు + జ్ఞానం = కీర్తి

డబ్బు + ఆరోగ్యం = కష్టం.

జ్ఞానం + ఆరోగ్యం = డబ్బులేని మనిషి.

= భయం భయంగా బ్రతికే మనిషి.

= ఆశ నిరాశలమధ్య నలిగే మనిషి.

డబ్బు ముఖ్యం అబ్బాయ్!

చెత్తా చెదారం కాగితాలమీద దులపటం నీ అలవాటుకాదు. నాకు తెలుసు.

నీకున్న మిడిమిడి జ్ఞానాన్ని కాగితంమీద యిమడ్చటంలో నీకు ప్రత్యేకత వుంది. కనుక,

వ్రాయి,

పంపు,

సంపాదించు—

డబ్బూ,

కీర్తీ,

అలానే,

యిరవై ఎనిమిది ఏళ్లగా ఏకధాటిగా ప్రవహిస్తున్న రక్తం 'అవుట్‌లెట్'వైపు పరుగెడుతోంది.

అది ప్రకృతి ధర్మం.

అది వికృతి అయితే ఆరోగ్యం సున్నా.

ఆరోగ్యంలేందే జీవితం లేదు.

జీవితానికి ఆరోగ్యం 'బేస్ట్'

ఆరోగ్యానికి శారీరక మానసిక సుఖాలు. 'మెడిసెన్సు' శారీరక మానసముఖ సుఖాలకు 'గుడ్డీ' అవుసరం. 'గుడ్డీకి' మూడు ముళ్లూ అవుసరం. మూడు ముళ్లకూ డబ్బు అవుసరం.

డబ్బులేందే నువ్వూ, గుడ్డీ పార్కులో కూర్చొని బఠాలు కొనుక్కొని తింటూ చూచుకుంటూ కొన్నాళ్లు గడపగలరు.

తరువాత,

బఠానీలు తివగా మిగిలిన కాగితాలు తిన్నాక, గడ్డీ, పార్కూ యిఠా తినేసుకొంటూ పోతూ, నిన్ను 'గుడ్డీ, గుడ్డీని నువ్వూ తినుకుంటూ, నంజుకుంటూ బ్రతకాలి.

ఆ బ్రతుకు భయంకరం. అందుకని,

వయస్సు తెచ్చిన తొందరలో పడిపోబోకు. అవకాశాన్నీ, ఆలోచనల్లనూ వినియోగించుకొని సంపాదించు—

డబ్బు,

కీర్తి,

'గుడ్డీ'!

ఇది మిత్రోపదేశం.

ఈ ఉత్తరాన్ని నా శ్రీమతికి చదివి వినిపించాను. బొటబొట కళ్లవెంట నీళ్లు కార్చుకొంది. నన్నడిగింది—

'అంటే, నావలన నీకు జీవితం భారంగా వుందా?'

నాకు నవ్వు వచ్చింది.

ఆడవాళ్లు అంతా యింతే.

మొగుడు ఎప్పుడూ మనసా వాచా తన్నే తలుచుకొంటూ బ్రతుకుతున్నాడని ఊహిస్తూ బ్రతుకుతారు.

నిజంగా,

ఆమె అంటే నాకు యిష్టం, ప్రేమ, అనురాగం వున్నాయి. ఆమెకు నేనంటే వున్నాయి.

అదే జీవితమా?

ఆ జీవితానికి పరమార్థం భార్య, భర్త, అనురాగం, 'సెక్స్' యివే తప్ప మరొకటి లేదా అని ప్రశ్నించాను. 'ఏమో బాబూ, నాకు తెలీదు' అని వెళ్లిపోయింది లోపలికి. పోనీ, యీ ప్రశ్నను నీ కాబోయే భార్యను అడిగి తెలుసుకున్నాక జ్ఞాపకం వుంటే వ్రాయి. కానీ,

ఆమె తప్పకుండా 'ఏమో బాబూ', అని తప్పుకుంటుంది. 'సస్పెన్స్'ను వుంచటంలో ఆడవాళ్లకు యిష్టం వుంటుంది. అందుకే వారి మనస్సుల్లో వుంది చెప్పరు. ఏదైనా చెప్పారా, చేసారా అంటే; అది తప్పక సలహా అయినా అయివుంటుంది లేదా 'సింపతీ' అయినా అయివుంటుంది.

ఆడవాళ్లకు చేతనవ్వుతుంది, భూహించగలిగింది,

'బ్రహ్మచారి పెళ్లికోసం ఎదురుచూస్తున్నాడనీ, భర్త తనే సర్వస్వంగా బ్రతుకుతున్నాడనీను.'

'పూర్ లేడీస్'!

'సెల్ఫిష్ క్రీచర్స్'!

అందుకే వాళ్లంటే నాకు వల్లమాలిన దయ, కసి. అందుకే మిత్రమా!,

నీవు వ్రాసే ఉత్తరాలు ఏ స్త్రీకి యిచ్చినా యిదే గమ్మత్తు జరుగుతోంది. కనుక,

వయస్సు తొందరచేస్తే బాధపడబోకు. ఉత్తరాలలో వలగ బోయకు. మరి, ఏం చేయాలో నేను చెప్పకపోయినా చేయగల సమర్థుడివి.

కనుకనే,

నేను చెప్పటం లేదు.

నా శ్రీమతి నిన్ను అడిగినట్లుగా చెప్పమంది.

'ఐ విష్ హేపీ హేపీ డేస్ టు యూ!'

—సూరి.

* * *

పూనా,
21–12–'73.

డియర్—

సూరీ—

ప్రొద్దున్నేలేచి, చలిలో—

గాలి చల్లగా తగులుతూవుంటే, కాసేపు వణికి, సిగరెట్ వెలిగించేసి, కాలుతూ, కాలిపోతూవుంటే,

కాలటంలోని మజాను అనుభవించేసి, తర్వాత బైటపడ్డాను.

మామూలే—

'టేస్ట్'లేని కాఫీ'

బస్సువెళ్తూవుంటే, అద్దాల్ని మూసేసి, రోడ్డునుచూస్తూ, వెనక్కు వెళ్లిపోతున్న జడల్నీ, పెట్రోల్ బంకులనూ, బస్సుషెడ్డుల్నీ,

ఇంకా,

అన్నిటినీ చూడటం!

బస్సు ఆగింది. దిగటం, ఆఫీసు మెట్లెక్కటం.

—ఫైళ్లు, చుట్టూ దుమ్ము! సాయంత్రం దాకా, యీ మరో ప్రపంచంలో కాలక్షేపం. 'థ్రిల్', 'వెరైటీ' లేకుండా!

అపుడపుడూ మనస్సు సంతోషాన్ని ఫీలయ్యే అరుదు సంఘటనలు వుండటం. ఆ సంఘటనలు ముఖ్యంగా 'సెంట్ పర్సెంట్' వచ్చిన ఉత్తరాలు—'ఫ్రం' అడ్రసు చూడకుండానే, ఆతృతతో చించి చదవటం,

మళ్లీ చదవటం,

చదువుతూ బోవటం

చదినేసి, సిగరెట్ వెలిగించటం,

కాల్చటం!

జరిగింది యిలా!

ఓ మాట,

సినిమాల్లో 'రొమాన్స్' వుంటేనే బాగుంటుంది. కథల్లో 'రొమాన్స్' వుంటేనే బాగుంటుంది. లేకుండా వుంటే,—విసుగు చూడాలన్నా, చదవాలన్నా—తర్వాత ఆలోచించాలన్నా,

బద్ధకం! 'ఇంటరెస్ట్' లేకుండాపోవటం. అలాంటపుడు, ప్రపంచం 'రొమాన్స్'లో గొంతుదాకా కూరుకుపోయి కళ్లుమూస్తూ, తెరుస్తూ బ్రతికేస్తూంటే, ఇంకా చెప్పాలంటే,

కళ్లల్లో 'రొమాన్స్' మెరుస్తూవుంటే,

ఉత్తరాల్లో,

'రొమాన్స్' కబురు లేకుండావుంటే,

రెండోసారి చదివేలా, తర్వాత యింకా, మనస్సులో దిగులూ, బాధా చోటుచేసుకొని కూర్చునివుంటే, మరవటానికి ప్రయత్నంలో చదవటం,

'రొమాన్స్' ఉత్తరాలవల్లే సాధ్యం అంటాను!

అందుకే, నా ఉత్తరాల్లో 'రొమాన్స్' కబురు దొర్లటం.

—నీ ఉత్తరం, వాడిగా. సూటిగా, ఇంకా పదునుగా వుండి, మెదడునూ, మనస్సునూ ఆక్రమించుకొని పోతూవుంటే, పోతే,

బతానీలూ,

గడ్డీ, పార్కూ,

'గుడ్డీ'—

కళ్లముందు తిరుగుతూవుంటే, గిరగిరా తిరిగేసి, బతానీలూ, 'గుడ్డీ'. పార్కూ కనపడకుండా

పోయి, గడ్డి రెక్కల్ని తగిలించుకొని ఇంకా తిరుగుతూ కనపడుతూంటే,

కళ్లుమూసేసుకుందామన్న ప్రయత్నంలో జీవితం కాలిపోతూ, మాడి మసి అవటం,

తల్చుకుంటేనే భయం !

మరెలా ?

ఎలా కళ్లుమూసుకోవటం ?

కళ్లుమూయకుండా, కంటిపాపని రెప్పల్తో కప్పకుండావుంటే,

కాలిపోతూన్న జీవితం, గడ్డిలో తగులబడుతున్న జీవితం,

మెదడు వేడిలో కరిగిపోతోంది !

నువ్విచ్చిన 'డెఫినిషన్లు' నా 'డిక్షనరీ'లో వ్రాసుకొంటున్నాను.

డబ్బు+జ్ఞానం,

డబ్బు+ఆరోగ్యం—

మాటల్ని చిన్నవిగా వ్రాసి,

జ్ఞానం+ఆరోగ్యం మాటను కనపడేలా వ్రాసుకున్నాను. రెడ్ పెన్సిల్‌తో అండర్‌లైన్ చేసాను.

ఒప్పుకుంటున్నాను,

మనిషి సుఖంగా, సుళువుగా బ్రతికివేయటంలో, డబ్బు ఆలోచనవల్లే సుఖాంతం లేదు. వుండాల్సిందీ, ఎదురుగా, పెరిగిపోతూ కనపడేది, కనపడాల్సిందీ డబ్బు !

కానీ, వుంటేనే—

దానివల్లే అన్నీ సుళువుగా దొరుకుతూవుంటే, (కొన్ని దొరక్కపోయినా, వాటిగూర్చి బాధపడే తీరికా, ఓపికా 'బ్లైంవేస్ట్!') మెత్తని పరుపునూ, అంతకంటే మెత్తని పెళ్లాన్నీ, రంగులగ్లాసులో, గులాబీ రంగులా కనపడే ద్రవం, గొంతులో సుతారంగా, మెత్తగా దిగుతూవుంటే,

బ్రతుకుతున్న బ్రతుకులో—

సెకన్లు నిముషాల్గా మారుతూ, నిముషాలు గంటల్గా, గంటలు రోజుల్గా మారుతూ సర్కిల్ బ్రతుకుతూ తిరుగుతూవుంటే,

పెరిగిపోతూ కనపడే జీవితంలో నిజంగా, 'సుఖం' వుంటుందంటావా నువ్వు?

నేనేమంటానో తెల్సా ?

నా 'డిక్షనరీ'లో నాకు అర్థమయిందీ, తెల్సిందీ,

జీవితం అంటే,

నవ్వటం, ఏడవటం, సంతోషపడటం, దుఃఖపడటం !

నవ్వూ,

సంతోషం—

జనం కోరుకునేదీ, కావాలని తాపత్రయపడేది;

ఏడుపూ,

దుఃఖం—

కావాల్సింది ఎవడికి? తాపత్రయపడేది ఎవడు?

వుంటాడా యీ భూమ్మీద ?

కానీ,

దూసుకువచ్చేసి హృదయంలో దిగిపోతే, ఏం చేస్తాడంటావ్ ?

వెరీ సింపుల్ !

దుఃఖంలో, ఏడుపుతో వాడి జీవితం తెల్లారిపోతుంది. అలాంటి జీవితంలో, ఎడారి వయాసిస్సులా నవ్వూ, సంతోషం కనపడితే,

'వెరైటీ'ని నిండుగా, రాత్రి పన్నెండుగంటలప్పటి వెలుగుతున్న గుడ్డిదీపం కాంతి, (సాయంత్రం ఆరుగంటలప్పటి గుడ్డిదీపం వెలుగుకూ, రాత్రి పన్నెండు గంటలప్పటి గుడ్డిదీపం కాంతికీ చాలా తేడా వుందని ఒప్పుకుంటావుగా నువ్వు? తప్పదు. ఒప్పుకోవాలి. రూలులాంటి విషయం). చుట్టూ చిమ్మటం, దాంతో గది స్పష్టంగా కనపడటం లాంటి నిజం,

'వెరైటీ'లో వుంటుంది.

దాంతో,

ఆ కాసేపూ,

పొందిన ఆనందం, కొంచెం సేపయినా,

తాత్కాలికంగా వుండిపోయినా, అనుభూతిమాత్రం కొన్నేళ్లకు సరిపడేలా వుంటుంది.

మరి,

అలాంటి 'వండర్‌ఫుల్' అనుభూతి కావాలి నాకు. అందుకే నేను యిష్టపడేవి యీ జీవితంలో, నాలుగున్నాయి. అవి,

నిజంగా నాలుగు. నాలుగులో రెండు ఏడవటం, దుఃఖపడటం అయితే, మరో రెండు అప్పుడప్పుడూ మాత్రమే నేను కోరుకునేవి నవ్వూ, సంతోషం!

—'ఫూల్'నా నేను?

'ఇడియట్'నా?

లేకపోతే,

రెండూనా?

బలంగా వుందనుకొన్న నా 'గుండె'—ఇవ్వాళ రాత్రి ఆగిపోతుందని తెల్సినపుడు, యీ క్షణంనుంచీ, గుండె ఆగేదాకా ఏం చేస్తానంటావ్?

వున్న కొన్ని గంటల్నీ గడపటంలో, కుర్ర ఆడదీ, ఖరీదైన మెరిసే విస్కీసీసా, 'నేకెడ్' శరీరంలో గదిలో సంతోషం పొందుతూ వుండటం ఎంతగా అబద్ధమో—;

చావు ఆలోచనలు మెదడులోనూ, గుండెలోనూ సుళ్లు తిరుగుతూవుంటే—ఏడుస్తూ, దుఃఖంలో సతమతమవటం, అంతగా నిజం!

—నీ వూహలో నిజాన్ని పంపి ఆలోచించు. చుట్టూ వున్న ప్రపంచంలో యివ్వాల్టిదాకా గడిపేసిన నా బ్రతుకు ఖరీదు—

నా వూహలోని ఖరీదుతో తేడా చూస్తే, త్రాసులో అటూ, ఇటూ వేసి తూస్తే, రెండు వైపులా చూచి 'ఇన్సల్ట్' ఫీలయ్యాను. దాంతో—హృదయం, మెదడూ,—నా తప్పుడు అంచనాను చూచి విరగబడి త్రుళ్లుతూ నవ్వేయి.

చుట్టూ వెక్కిరిస్తూ నవ్వులు.

—నిన్నటి నా వూహలలోనివి కొంచెంగా కరిగిపోయి ఇవ్వాళ నన్ను దెబ్బతీస్తే, రేపు, మళ్లీ వచ్చే

రేపులో, నిన్నటి వూహాలు పూర్తిగా కరిగిపోయి కనపడకుండా పోవటంగూర్చి, ఇవ్వాల్టి అనుభవంను రేపటి అద్దంలో చూస్తే, లేదా చూడాలని ఆరాటం పొందితే,

బ్రతకటం అనే మాట, సాదా సాఫీ మాటలో వెక్కిరింత వుంది. రెక్కలు తెగిపోయిన వూహ, నెత్తురులో తడిసి ముద్దయి, కూలిపోతూవుంటే,

కళ్ళు తిరగవూ?

కళ్ళు తిరుగుతూవుంటే, ప్రపంచం తిరగదూ? తిరిగే ప్రపంచాన్ని తిరక్కుండా పట్టుకొని ఆపగలగటం సాధ్యం అంటావా నువ్వు?

సాధ్యం కానపుడు, యిలాగే కళ్ళు తిరిగే బ్రతుకులో అర్థం?

—ఇవ్వాళ, యీ క్షణంలో నాలో ఉత్సాహం, వుద్రేకం వున్నాయి. నిద్రమత్తు ఆఫీసు జీవితంలో తృప్తిలేకున్నా, వున్నాయని నన్ను మభ్యపెడుతూ మోసగిస్తున్న నా మనస్సు నన్ను తినేసి బండలా నిద్రపోతూంది. అది ఇవ్వాళ మళ్లీ లేచి, నామీద విరుచుకు పడుతోంది. దాంతో, నా మెదడులోని నరాలు నాతో మాట్లాడుతున్నాయి. ఆ మాటల్లో స్పష్టత లేకుండా, వినపడకుండా వున్నాయి.

నాకు మూడు ముళ్లూ వేసే 'సర్టిఫికెట్' వుంది. దానికి గర్వపడాలో లేదో తెలీకుండా వుంది. ఎందుకంటే,

—యీ మొగుళ్ళు రోగ్స్! పెళ్లాం మనస్సులో పిల్లలూ, మొగుడూ వుంటే,

మొగుడి మనస్సులో,

ఆఫీసుపని, రోడ్డుమీద ఆడనేస్తం [నాకు తెల్సిన చాలా మొగుళ్ళ గూర్చి నేను వ్రాసేది] వుంటే, ఆ ఆలోచనలే మెదడును తొలిచేస్తోంటే,

మొగుడూ పెళ్లాల మధ్య వుండేది 'సెక్స్' అనే నేను అనుకోవటం. ఇంకో విధంగా మొగాడి 'సెల్ఫిష్‌నెస్'—[నీ మాటను, అదే, ఆడది 'సెల్ఫిష్'—అనే మాటను రెడ్డింకుతో అడ్డంగా కొట్టేస్తున్నాను.]

ఓ 'ఎగ్జాంపుల్'—

రాత్రివేళల్లో యింటికొచ్చే మగవాడు మల్లె పువ్వుల్ని తెచ్చి పెళ్లాం తలలో కూరటంలో, మంచం మీద ఇద్దరూ వున్నపుడు—చెమటవాసల్ని పూలు కాల్చేస్తాయన్న మాట వుంది. అంటే,

పావలా పూలు వాడు కొంటున్నాడంటే, పెళ్లాం తల అందంకన్నా—వాడికి కావాల్సింది, మంచం మీద పూల వాసన.

ఇది 'సెల్ఫ్' కదూ?

రేపు నేనూ అంతే; ఇంకా,

ఇవ్వాళ, రోడ్డుమీదపోయే అందమైన అమ్మాయితో నా మనస్సు 'డివ్‌వైట్' 'బెడ్‌రూమ్'లో కలిస్తే,

యీ క్షణంలోనే నా పెళ్లాం మనస్సూ అదే పనిచేస్తే—

రెండింటికీ తేడా లేకపోయినా, నా పెళ్ళాం మనస్సును పాతేయాలని నేనుపడే ఆరాటం, లేదా రాక్షసతత్వంతో నేను మొగుడుననే మాట వుంది.

—యీ ఉత్తరాన్ని ముగించే ముందుగా,

నీ నెల గుడివాడ జీవితంలో కొంచెంగా అయినా 'రొటీన్' విసుగు జీవితంలోని క్షణాలు ఆనందంగా, పతీ, సుదర్శనం, మన రాజాలతో గడపాలని తలుస్తాను.

నీ శ్రీమతినీ, మిత్రజనాన్నీ అడిగినట్లుగా,

ఇంకా,

యీ అందరిమధ్యా,

స్నేహం మాటల్తో చూపుల్తో ఉక్కిరిబిక్కిరి అవ్వాలనే నా మాటను నీ మాటగా మన వాళ్లకు చెప్పు.

వుంటున్నాను.

—నీ శశిని.

# శ్రీ బులుసు వేంకటేశ్వరుల కవితాప్రశస్తి

'పల్లకీ నెక్కించె భారత భాగవతమ్ములు రామాయణమ్ము నేడు
సల్లకీ లతవోలె సాగించె నాంధ్రీమతల్లికాగత కవిత్వంబు నేడు
వల్లకీ నినదంబు వారించె తుదితీగపై నొక్కరీతి యౌ పట్టు నేడు
పల్లకీ పరిమళం బనుభూతి కందించె పాలకమ్మని స్వభావంబు నేడు
ఎన్నియున్నను బైనొకం డన్నయట్లు, నీ రచన వెల్లివిరిసి యనేకగతుల
బులుసువంశపయోనిధి పూర్ణచంద్ర! సరసగుణసాంద్ర! వేంకటేశ్వర కవీంద్ర!'

— ఇది శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు నిర్వచన రూపమున రచించిన శ్రీ మదధ్యాత్మ రామాయణ, భారత, భాగవత ప్రథమ సంపుటావిష్కరణ మహోత్సవ సభలో నధ్యక్షస్థానము వహించిన కళాప్రపూర్ణులు, మహాకవులునయిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కావించిన ప్రశంస. బులుసు వేంకటేశ్వరులుగారు పేరెన్నిక గన్న కవులు. వారి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనములుగ విలసిల్లుచున్న యనేకానేక గ్రంథములలో గొన్ని గ్రంథములను గైకొని వానిలో గవి 'యనేకగతుల' వెలార్చిన కవితారీతులను, తదితర విశేషములను సంభావించుట యీ వ్యాసపుటుద్దేశము.

ఆంధ్ర కవిత్వరంగమున యాధునికతపేర బెంపొందుచున్న వచన ఖండికల విజృంభణము మధ్య సంప్రదాయసిద్ధమైన రీతిని, సలక్షణమై ఛందోబద్ధమైన కవిత్వమును వెలయించుచున్న కవులయందు శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారి స్థాన మెన్నదగినది.

'నియమ విహీనతల్ వెలయునే గుణజాలములై? సలక్షణ
క్రియలగు నొక్కొ హేయములు? క్రీడలొకో సుకవిత్వ నైపుణుల్?
రయమున బుట్టుచున్ జెడ ధరన్ నశియింపదె వెంటనే యటుల్
నియమ విహీనదుష్కవిత నిల్చునె నాశము కాక వెంటనే?'

(బులుసువారి శ్రీ వేంకటేశ్వర విజయమున యవతారిక యందు 63 ప.)

అని యభిప్రాయపడిన బులుసువారు భారత సంప్రదాయహిత ధర్మములను లెస్సగా నెఱిగినవారు 'పలికెడిది భాగవతమట, పలికించు విభుండు రామభద్రుండట' యని వినయముట్టిపడు తీరున దెలిపికొనిన మహాకవి పోతనవలెనే బులుసువారు సైత మిట్లు పేర్కొనినారు:

'నేను నిమిత్తమాత్రుడను నేరను వ్రాయగ నొక్క యక్షరం
బైనను నా మనస్సునను నంచిత లేఖినియందు జొచ్చి వా
ణీ నిలయంబుగా దను వనిందితభంగి నొనర్చి యేదొ స
మ్మానిత శక్తి కావ్య మహిమం బరగించు శిలాక్షరంబులన్.'

(శ్రీ వేంకటేశ్వర విజయావతారిక 66 ప.)

ఆ శక్తిని బ్రణుతించిన బులుసువారు తామొనర్చిన తప్పులను సైత మొప్పులుగా భావింపుమన లేదు. తాము రచించున దెల్ల యాశక్తి యాదేశముననే యనియు యిమి కవిత్వపు విఖ్యాతి యాశక్తిదే యనియు, 'లేశం బైనను బెద్దనైన గొఱతల్' తమవే యగు ననినారు. తామొనర్చిన దోషముల నితరుల కంటబడకుండ నిరంతరము శ్రమించు నేటి 'మహాత్ములు' కొందఱు దీనిని మెచ్చకబోవచ్చును. పోనిండు.

### శ్రీ వేంకటేశ్వర విజయము

శ్రీ వేంకటేశ్వర విజయము నిర్వచన పురాణ ప్రబంధము. బులుసు వారిటీవల సంతరించిన దిది. ఈ ప్రబంధ కథానాయకునకును, కవికిని నామమొక్కటే. ఈ సంబంధమునకు గల కారణమును గవి తమ వేంకటేశ్వర విజయపు టవతారికయందు వివరముగ బేర్కొని యున్నారు. అంతకంటె ముఖ్యముగ నెన్నవలసిన ముచ్చట మఱియొకటి యున్నది.

మన తెలుగు కవులకు గలలలో వారి యిష్టదైవతములు, కులదేవతామూర్తులు ప్రత్యక్షమై కృతులను వ్రాసి తమ కంకిత మిమ్మని యడుగు నాచారమును హరిహరనాథస్వామివారు (తిక్కన కలయందు గనిపించి) ప్రారంభించినారు. ఆ స్వామి కలలోన బ్రత్యక్షమైన వేళ యెట్టిదోగాని తరువాతి కవుల కలలలో దేవతలు తేపతేపకు బ్రత్యక్షము కావలసివచ్చినది. ఈ కలలను 'ప్రార్థిత స్వప్నము' లందురు. ఈ యుదంత మిచట జెప్పుట బులుసు వారిని గించపరచుటకు గాదు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారు బులుసువారికి పరీధావి సంవత్సరపు చైత్రమాసమున శుక్లపక్ష తృతీయ (శనివారము) నాటి యుదయమున బ్రీతిని గన్పించి నారు. బులుసువారు 'కల గన్నప్పుడు కాదు రాత్రియును మైకం బందునే వేళగా

దలపోకన్ బరిపూతమైన యుదయాహ్నం బందు స్నానాది కర్మలు గావించి రవంత ధ్యానమున నిర్మగ్నులై యున్న నిశ్చిం వేళ.

అధ్యాత్మ రామాయణ, భాగవత, భారతాదులను, శ్రీకరులైన మహర్షుల చరిత్రలను వ్రాయుటతోఁబాటు శ్రీ వేంకటేశ్వరుని 'కృప గోరుచున్ శతకమంజరి'ని గూర్చుటచేతనే శ్రీవారు 'కనిపించుటల్ పలుక నెంచుటల్' జరిగినవి. కాఁగా శ్రీ వేంకటేశ్వరుఁడు తన 'సత్కథావళుల్ సరస మనోజ్ఞభంగిని ప్రశస్తముగా రచియింపు'మని బులుసువారి కాదేశించినారు. అవివేకులు విరసముగా మార్చి వ్రాసిన వానిని దీర్చిదిద్దుట వలన బులుసువారికి చిరయశము, తనకు మోదము సంభవించునని స్వామివారి యభిప్రాయము.

ఆపై బులుసువారు 'శ్రీ వేంకటేశ్వర విజయము'ను రచించుటకుఁ బూనినారు. ఐదాశ్వాసములలో విస్తరించిన యీ విజయ ప్రబంధము శ్రీ వేంకటేశ్వర స్వామికి భక్తులైన వారికి మోదము చేకూర్చును.

శ్రీ వేంకటేశ్వర విజయమునందలి ప్రథమాశ్వాసము శ్వేత వరహావతార వృత్తాంతముతో నారంభమగును. శ్వేత వరాహ రూపియగు విష్ణువు గరుడుని బిలిచి వైకుంఠమందలి క్రీడాద్రిని భువికిఁ దెమ్మనును. గరుడుఁడు తెచ్చిన దగుటచే గరుడాద్రి యను కీర్తిగాంచిన యా క్రీడాద్రికిఁ గల్పాంతరముల మఱి కొన్ని నామములునుఁ గలిసి వచ్చినవి.

ఇట్లుండ భూలోకమున నున్న మానవులు కామమోహమయ సౌఖ్యమును మదిని నమ్మి దుర్నీతిని సంచరించి బహు దుఃఖవ్రాతలో కాశికిఁ బోవుచుండుటఁ జూచిన బ్రహ్మదేవుఁడు తన కుమారుఁడగు నారదుని బిల్వంబంచి శ్రీమన్నారాయణునకు 'భూమండలిఁ దన యంశను' దయమీఱ నిలుపవలెనను తమ విన్నపమునుఁ దెలుపుటకు నియోగించును. నారదుఁడును బ్రహ్మ యానతి చొప్పున నాదినారాయణుని కడకుఁ బోవును. నారదుఁడు విష్ణుమూర్తికి బ్రహ్మ విన్నపమును విన్నవించును. అప్పుడు విష్ణువు నారదునకు వృషభాచల మహిమ జెప్పును. ఈవిధముగా సాగు కథ యాశ్వాసములు గడచుకొలది శ్రీ వేంకటేశ్వరుని వివిధ దివ్య లీలలను, స్వామివారి వివాహాది విశేషములనుఁ దనలో నిమిడ్చుకొని విశ్వరూపముతో సాక్షాత్కరించును. ఈ ప్రబంధమున నుపాఖ్యానములు సమృద్ధిగా నున్నవి. వానినిఁ గవి రచించిన నేర్పు ప్రశంసనీయమని చెప్పుట కవి ఘనతనుఁ దగ్గించి చెప్పుట కావచ్చునని భావింపఁబడి యున్నది.

కవి యాధునిక యుగలక్షణములను వర్ణించిన తీరు మెచ్చఁదగియున్నది. ఆధునికులలోఁ గొందఱకున్న యాశలనుఁ గవి యెంత సూక్ష్మముగాఁ బరిశీలించెనో తెలిసికొనుట కీ పద్యములనుఁ బరికింపుడు:

సీ. కూఁతురు కనఁగను కొంకినక్కయె యైన,
నల్లఁడు మన్మథుం, డఖిల ధనుఁడు
కావలె., నధికారి కావలె, నత్తమా
మల మాటలే విని మసలువాఁడు
కావలెఁ, దనవారిఁ గడఁ ద్రోచువాఁడయి,
యన్నదమ్ములు లేక యక్క చెల్లె
లేనివాఁ డగుచు నాలిని బూలలోఁ బెట్టి
పూజించువాఁ డయి పొలుపు గుల్క
గీ. వాఁడు కావలె., నాడింప నాఁడు వాఁడు
కావలె, నతండు నించుక కట్నమునకు
నాశపడరాదు, సంతృప్తి నందవలయు
నేమి యిచ్చినఁ, బ్రజకోర్కె లిట్టివి కద!
(ఆ 3— ప 129).

సీ. పూట కన్నంబు లేకపోయినఁ, గట్ట బ
ట్టయె లేకపోయిన, వ్యయమునకును
గాని యైనను లేని కడు దరిద్రుండైనఁ,
జదువు సందెవంకఁ జనకయున్న,
నధికారిపిల్ల, లక్షాధికారి తనూజ,
రంభయూర్వశి మించు రమణి, మఱియు
సంగీత సాహిత్య చతుర, భరత నాట్య
మును జేయు పూఁబోడి, ముందె తనకుఁ
గీ. గాన్కలను గట్నముల నీయఁ గలుగు వాని
ముద్దు పట్టి— మహైశ్వర్యములను గూడి
వచ్చునట్టి తలోదరి— వలయుఁ దనకు
భార్యగా— యువకుల కివి వాంఛ లిపుడు.
(ఆ 3— ప 131).

సీ. పాలలో నొకపాలు పాలు తొంబది తొమ్మి
ది జలంబుఁ గలిపెడి ధీమతులును,
కాని వస్తువు పెద్ద కాసున కమ్మి లా
భములు గడించెడు వర్తకులును,
జీతంబుఁ బట్టియే సేవగాఁ, బనివారి
దే పెత్తనముగాఁగ నెసఁగువారు,
మంచియుఁ జెడ్డ సమానంబుగా సర్వ
సమతఁ గోరెడు నట్టి జడమతులును
గీ. క్షుద్ర లైంగిక కర్మలు చూపి తెరను,
ధనముతోపాటు శీలము ఉగ్గపటల
మొనరఁ జేసెడి వాగును నొందు గౌర
వంబు నేమని వర్ణింపవచ్చుఁ గలిని?
(ఆ 3— ప 133)

# శ్రీ బులుసు వేంకటేశ్వరుల కవితాపరిశస్తి

కవి యీ ప్రబంధమున శ్రీ వేంకటేశ్వరుని వివాహ వైభవమును గన్నులకుఁ గట్టినట్లు వర్ణించి యుండుట సహృదయ హృదయామోదకరము కాఁగలదు.

ద్వితీయాశ్వాసమునందలి భద్రమతి వృత్తాంతమునఁ గవి తెలుఁగువారి వంటలను చవులూరునట్లుగా వర్ణించెను. తెలుఁగు సాహిత్యమున, గానవచ్చు తెలుఁగువారి, వంటలను గూర్చి యీవఱకే పెద్దలు వ్రాసియున్నారు. మరి శ్రీ వేంకటేశ్వర విజయమునందలి యీ ఘట్టమును సైతము పరిశీలించుట లాభదాయకము కాఁగలదు.

'నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూపో నాస్త్యదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య' మను పలుకుఁ (చూడుడు: ఆముక్త మాల్యద— ప్రథమాశ్వాసమున 84 వ పద్యము) శ్రీ వేంకటేశ్వర విజయమున మరింత వివరముగ వినవచ్చును. ఆ వినవచ్చుటలోఁ దెలుఁగువారి యాదరణమే వినవచ్చుటను గుర్తింపవచ్చును.

కవి— తాను పేర్కొనిన 'ద్వాదశ పురాణ గాథలను క్వాచిత్కముగఁ గైకొని, చాలా విధేయత కాని, యతి విధేయతగాని లేక యథోచిత వర్ణనా వైశద్యము, రసభంగము కాని స్వకపోల కల్పనము, సత్య ధర్మ సద్గుణ సత్ప్రవర్తనల ప్రాశస్త్య ప్రశంస, లోకాతిలోక పరలోక విషయ విమర్శాదులతో శ్రీ వేంకటేశ్వర పవిత్ర పురాణముగా, సరస ప్రబంధముగా నిది సంతరింపనైనది' యని తమ 'తొలి పలుకు'నఁ బేర్కొని యున్నారు. అవి సత్య దూరములు కావని చెప్పుట తప్పనిసరి యగు చున్నది.

కవి శ్రీ వేంకటేశ్వర వృత్తాంతమును వర్ణించు పురాణములఁ గుఱించి ప్రస్తావించుట పరిశోధకులకు సహాయకారి కాఁగలదు. ఈ ప్రబంధమునకు శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనము లనుబంధములుగా సంతరించుట జరిగినది.

## బులుసు వారి నిర్వచనాంధ్ర కృతులు

తెలుఁగువారికి కవిత్రయము వారి భారతము, పోతన భాగవతము లనిన యెంత ప్రీతియో చెప్పవలసిన పనిలేదు. మఱి యట్లుండఁగా మఱల వానిని నిర్వచనముగ వ్రాయవలసిన యవసరమేమని ప్రశ్నింప వచ్చును. కాని బులుసువారు తాము భారతమును నిర్వచనముగా వ్రాయుటకుఁ గల కారణమును వివరించినారు. 'సంస్కృత భారతమూలమును బరిశీలించుచుఁ గవిత్రయము వారి రచనలు సంగ్రహించుచు, ఆ సంగ్రహీకరణమున నించుక స్వాతంత్ర్యము వహించుచు, ఆ స్వాతంత్ర్యమున యథాశక్తి నౌచితి పాటించుచు, ఆ యౌచితితోను గొన్ని మెలఁకువలు చూపుచు ముఖ్యముగా సులభ కథా కథనము, సరళ భాషా ప్రయోగము, సామాన్యాంధ్ర భాషాభిజ్ఞులకైన నందుబాటులో నుండవలయునను కుతూహలము' పాటించి నిర్వచన భారతము రచించినట్లు కవి పీఠికలోఁ బేర్కొనెను. ఈ నిర్వచన భారతము కొన్ని పట్టులయందుఁ గవిత్రయము వారి రచన కంటె సంక్షిప్తముగను, మఱికొన్ని పట్టుల యందు వారి రచన కంటె విస్తృతముగను సాగినది.

ఈ కవికి వినయసంపద సహజాలంకారము. కవిత్రయము రచించిన భారతము నొంటిచేత వ్రాసితినని చెప్పికొనుట కీయన కిష్టములేనట్లున్నది. అందులకే కాఁబోలు 'సుప్రసిద్ధములై పఠన పాఠనములనున్న కవిత్రయ పద్య రత్నముల ముందు మద్రచన పేలవముగఁ దోఁపక పోదు. ఐనను 'ముఖే ముఖే సరస్వతీ' యను నానుడిఁ బట్టియో, 'ద్వైపాయనోష్ఠపుట నిస్సృత మప్రమేయం పుణ్యం పవిత్ర మథ పాపహరం శివంచ' యనియో ప్రాజ్ఞు లీ రచనను జిత్తగింపక పో''రని పేర్కొనినారు.

తమ రచనకును వ్యాస, కవిత్రయాదుల రచనలకును గల తారతమ్యములనుఁ గొన్ని యుదాహరణముల మూలమున గవియే పేర్కొనియున్నారు. అందలి యొక యుదాహరణము నిచట పరిశీలింతము.

విరాటుని కొల్వు కూటమును బ్రవేశించి భీమసేనుడనిన మాటలు మూలమున నీ విధముగ నున్నది.

శ్లో. 'సూదోఽస్మి నరేంద్రవల్లభో, భజస్వమాం వ్యంజనకార
ముత్తమమ్,
నరేంద్ర సూదః పరిచారకోఽస్మితే, జానామి సూపాన్
ప్రథమం న కేవలాన్
ఆస్వాదితా యే నృపతే పురాభవన్, యుధిష్ఠిరేణాపి నృపేణ
సర్వశః
బలేన తుల్యశ్చ నవిద్యతే మయా, నియుద్ధ శీలశ్చ సదైవ
పార్థివ
గజైశ్చ సింహైశ్చ సమే యివా నహం, సదా కరిష్యామి
తవానఘ ప్రియమ్.'

(సం. భార. 9.7, 9, 10, 11, 12).

ఈ సందర్భమున తిక్కన యిట్లు వ్రాసెను :

శా. 'దేవా! వాలవ జాతివాఁడ విను వర్ణింగొల్వఁగా వచ్చితిన్
పేహారక తనొండుమై వెలుఁగ నీ చిత్తంబునన్ మెచ్చు న
ట్లేవంటం గడునేర్తు బానసమునం దిచ్చోటనే కాదు న
న్నే పోటన్ మిగులంగ నెవ్వఁడును లేఁడెబ్బంగులం జూచినన్.'
(భార. విరా. 1—218)

ఈ సందర్భమును బులుసు వారీ క్రింది పద్యములతో నిర్వహించిరి.

ఉ. 'సూదుడనేను వంటలను సొంపుగఁజేయఁగలాడఁబూర్వ మెం
తో దయ ధర్మజుఁడు తుష్టిగ నేలెను సంతసించి నా
సూదన పాటవంబునకు శూరతఁ జంపెదఁ గ్రూరజంతులన్
మోది వధింపఁగాఁగలను మోటగు మల్లుల నెంతవారలన్.'

(నిర్వ. భార. విరా 2475)

''సూదుఁడన వంటలవాఁడు, మహావీరుఁడు నని రెండర్థములు. తిక్కనగారి 'నాలవ జాతివాఁడ' ననుమాట కా యర్థములు చెప్పుట సాధ్యమేమో చూడవలయు''నని బులుసువారి యభిప్రాయము. ఇందలి బాగోగులు సహృదయులకు, ప్రత్యక్షములు కాఁగలవు.

ఈ నిర్వచన భారతమునకు ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య. కే. వి. ఆర్. నరసింహముగారు 'తొలి పలుకు'ను రచించిరి. ఆయన చెప్పినట్లు 'పండితపామర రంజకముగా' బులుసు వారీ గ్రంథరచన సలిపిరి.

ఈ గ్రంథప్రాశస్త్యమునుఁ దెలుపుటకుఁ గూడ వారి మాటలే చాలును: 'పదలాలిత్యమును, భావసారళ్యమును గ్రంథమున ప్రతి పద్యమునందును గన్పట్టుచున్నవి.' ఇది అతిశయోక్తి కాజాలదని మాత్రము చెప్పవచ్చును.

ఇఁక బులుసు వారి భాగవతమునుఁ గొంత పరిశీలించి చూతము.

పోతన భాగవతముతో పెంపువహించిన తెలుగుఁభాష యందు మఱల తానుభాగవత రచన మొనర్పఁజూచుట 'హనుమంతుం గని కుప్పిగంతులిడున'ట్లా భాస్కరుం జూచి జ్యోతిని వెల్గించిన యట్లు, వారినిధి కింతే యింత వార్బిందువున్ గొని చూపించిన యట్లు, యక్షపతికిన్ గూర్మిన్ ధనం బల్పమిచ్చినటుల్' ఉండునని కవి భావము. అంతకుముందుఁ గవి—

ఉ. 'ఆ మహనీయ భాగవతమాంధ్ర సరస్వతి నోముపంట శో
భా మధురస్రవంతి భవ బంధుర పంక విమోచకంబు మో
క్షా మృత పూర మాత్మ తనివారఁగఁ బుష్టిగఁ గ్రోలఁగలి వాం
ఛా మమతన్ పునారచన సంగ్రహ భంగినొనర్పఁ బూనితిన్.'

అని పేర్కొనెను.

ఈ నిర్వచన భాగవతమునకు ఆంధ్రసాహిత్యాచార్యులలో నెన్నదగిన వారైన ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు సమగ్రమైన పీఠికనొకదానిని వెలయించినారు. ఆయన యభిప్రాయానుసారము 'శ్రీ మద్భాగవత రచన కావించుటకుఁ బోతరాజు గారికి వలెనే శ్రీ వేంకటేశ్వరులు గారికిని అనితర లభ్యమలైన యధికారార్హతలున్నవి. ఇరువురును మహాభక్తులు, సత్త్వగుణ రత్నాకరులు, ఇరువురును సహజపాండిత్యులు, అనర్గళ కవితాధారా సుధా రాసులు, ఇరువురును ప్రతిభా పాథోనిధులు, స్వార్థరహితులు.'

'పోతనగారు సంస్కృత భాగవతమును వీలైన చోట్ల నెల్ల శ్రీధర వ్యాఖ్యా నిజభక్తి సంపత్సాహాయ్యముచేఁ బెంచియుండిరి. శ్రీ వేంకటేశ్వరులుగారు మూలమును సన్నిహితముగా ననుసరించుచు, నవకాశమున్నచోట సంక్షేపించుచు, నవసరమని తోచిన చోట్ల యథాతథముగా రచన సాగించుచు నీ నిర్వచన భాగవతమును సంతరించిరి. పోతన భాగవతమందు అష్టమ స్కంధాంతము రమారమి ఐదువేల పద్యములు గలవు. ఈ భాగవతమున నిరువది యెనిమిది వందలు మాత్రముగలవు'—. ఇదియు దివాకర వారి యభిప్రాయమే.

'శ్రీ వేంకటేశ్వరులుగారి శైలి ప్రసన్నమై, స్పష్టమై ఆడంబర రహితమై, లాక్షణికమై, సరసమై, ధారాశుద్ధి శోభితమై, సర్వజన సుబోధమై యలరారు చున్నది. సంభాషణ సందర్భములందు వారు పెక్కుచోట్ల లోకప్రవృత్తిని ప్రతిబింబింపఁ జేసినారు. సంగ్రహముగా వ్రాయఁబూనియుఁ గథా కథనమున వారు చూపిన నేర్పు ప్రశంసనీయమై యున్నది. తత్త్వవేదాంత రహస్యములను జెప్పు సందర్భముల వారు కొన్ని యెడల నవలంబించిన సంగ్రహీకరణము మెప్పు గొల్పుచున్నది. పోతనగారు భాగవతమును రచించిన పిమ్మట మరల దానిపైఁ జేయివేయుట సాహసమే యయ్యును శ్రీ వేంకటేశ్వరులుగా రా సాహసమును సరస సుందరముగా సాగించినా' రను దివాకర్లవారి యభిప్రాయమక్షర సత్యము. ఇంతకంటే నింక చెప్పుట కేమున్నది?

రసికుల పరిశీలనార్థము ప్రసిద్ధికెక్కిన పోతన పద్యములు కొన్నిటిని బులుసువా రెట్లు రచించిరో పరామర్శింతము.

'ఒక సూర్యుండు సమస్త జీవులకు'నని ప్రారంభించు పోతన పద్యముతో బులుసు వారి యీ పద్యమును బోల్చిచూడ వచ్చును.

మ. ఒకఁడే సూర్యుడు లోకజీవులకుఁ దానొక్కొక్క రీతిన్ గ్రుపా
త్మకు డై తోఁచెడి భంగి నేఘనుఁడు దా మాయన్ విలాసంబుగా
సకలంబైన ప్రపంచ సీమల హృదబ్జాంతంబులన్ బెక్కురూ
ప కృతుల్ దాల్చుచు నుండు నట్టి భగవద్ద్రుఖాతు సేవించెదన్.'

(నిర్వ, భాగ. ప్రథమ—145)

ఇందలి ప్రహ్లాద చరిత్రమును పోతన భాగవతమునందలి ప్రహ్లాద చరిత్రముతోఁ బోల్చి చూచినపుడు పోతనకును, బులుసు వారికినిఁ గల సాదృశ్యము సోదాహరణముగాఁ గానవచ్చును.

# శ్రీ బులుసు వేంకటేశ్వర్లు కవితాప్రశస్తి

రుక్మిణీకల్యాణ ఘట్టమున పోతన వ్రాసిన 'ఘనుఁడా భూసురుఁ డేగెనో' అను పద్యమును బులుసువారు రచించిన యీ క్రింది పద్యములతోఁ బోల్చిచూచికొనుడు.

చ. "అకట! వివాహవేళ కిఁక నంతకు వారలు మూఁడు జాములే
వికల మనస్కనై తిఁ గనిపింపఁడు కృష్ణుఁడు రాకయుంట కిం
తకుఁ గల హేతువేమొ మహితద్విజుఁ డేఁగెనొ యేమియయ్యెనో
సకల మయోమయంబ బగుట సందియ మందెమ డెంద
మెంతయున్'

(నిర్వ. భాగ. దశమ. 5191)

మ. "అనవద్యుండగు కృష్ణదేవునకు నాయందే జుగుప్సాంశమై
నను గన్పట్టిన దేమొ లేనియెడ మానం డెంత మాత్రంబు నా
కనుకూలంబుగ లేఁడు ధాతయు శివుం డావంత కారుణ్యమై
నను జూపం డిది యేమి కర్మమొ యిఁకన్ నాభాగ్యమెట్లున్నదో!'

(నిర్వ. భాగ. దశమ—5192)

ఈ భాగవతమునందలి మొదటి యెనిమిది స్కంధములు సంక్షేపములుగా సాగఁగా, తుది నాలుగు స్కంధములు యథా మూలము విపులములైనవి. కాని ఈ నిర్వచన భాగవతము మూలానుసారము సాగుటచే పోతన రచనకును దీనికిని గొన్ని భేదము లుండుట సమంజసమే. కవి తన భాగవతము నందలి గుణమును గ్రహింపవలసినదిగా విజ్ఞహంసలకు విన్నపము చేసినందులకై కాదు గాని, యిది సుగుణసంపన్నమని చెప్పుటసత్యము నంగీకరించుటయే యగును.

మఱి బులుసువారి నిర్వచన కృతులలో నధ్యాత్మ రామాయణ మొకటి ప్రసిద్ధముగాఁ గనవచ్చుచున్నది. అధ్యాత్మ రామాయణ మాత్మజ్ఞానాపేక్ష గల వారికి నిత్యపారాయణ గ్రంథము. ఈ యధ్యాత్మ రామాయణము విశ్వామిత్ర ప్రోక్తమని యొక నానుడి. అధ్యాత్మరామాయణము మునిపల్లె సుబ్రహ్మణ్య కవి వ్రాసిన 'అధ్యాత్మరామాయణ కీర్తనలు' అనుపేర తెలుగువారి 'రసనలే తాటియాకులుగా' నిలచిపోయినది. తదితర కవులు దీనిని కావ్య రూపమున వ్రాసిరి. బులుసువారి యీ కృతి సంపూర్ణముగ నుండి సహృదయామోదకరముగనున్నది. బులుసువారు తెలుగులో గావ్యరచన చేయుటకే యధ్యాత్మ రామాయణమున జెప్పిన కారణము నొక్కమాఱు పరిశీలింతము..

'చ తెలుఁగున నున్న తీపియును దేటదనంబును
సొకుమార్యమున్
విలువయు పన్నెచిన్నెలును, వింతదనంబును, శంద
చందముల్
చలువయు సౌరభంబునుఁ బ్రశస్తత లేవు ప్రపంచభాషలన్
తెలుఁగున మాతృభాషనె కృతిన్ రచియించెద నిష్టసిద్ధికై'

బులుసువారి గ్రంథమునఁ బ్రదర్శించిన ప్రజ్ఞ వెన్నుట కిది యదను కాదు. కావున వారి యధ్యాత్మ రామాయణమునఁ రచించిన పద్యములొండు రెండు మననము చేసికొందము.

చ. 'కడు విషపూరితం బయిన కాల భుజంగమునోటఁ
జిక్కియున్
ఉడుగగు కప్ప యీఁగలకుఁ బైఁబడఁబోవునటుల్ తలంపఁగా
జడుఁడగు మానవుండు ననిశంబునుమృత్యువునోటఁజిక్కి పై
బడఁగఁ దలంచు భోగముల వాంఛను మిక్కిలి చిత్రమౌఁ గదా'

(నిర్వ. అధ్యా. అయోధ్యా—679)

సీ. 'ఇనుము సూదంటు రాయి ముందునఁ జలించు
నటులు జడమయ్యు మాయ నీ యద్భుతమగు
చూపుచేతఁ జలించుచు నోపు సకల
సృష్టి చేయఁగఁ జేయును నెల్లసృష్టి. (యుద్ధ—3181)

ఈ గ్రంథమున నచటచట బులుసువారు చేర్చిన యతో జ్ఞాపికలు చక్కఁగా నున్నవి.

బులుసువారు రచించిన కృతులు పదులకొలది యున్నవి. వానిలో వారి మహర్షుల చరిత్రలు సంస్కృత నాటకానువాదములు నెన్నఁదగినవి. వారి మహర్షుల చరిత్రలు మన ప్రాచీన సంప్రదాయమునకు సరిక్రొత్త విలువలు సంతరించినవి. ఇట్టి మహా మహిమా సమన్వితులు జన్మించిన పూజ్య భరతావని యందు జన్మించుట మన భాగ్యమనిపించు నంత ఘనముగా సాగినవా మహర్షుల చరిత్రలు. అవి పదేపదే పునర్ముద్రణను బొందుట వాని ప్రాశస్త్యమును; బులుసువారి ఘనతను సూచించుచున్నవి.

సంస్కృత నాటకములను తెలుఁగులోని కనువదించుటకు మన పూర్వకవులు పూనుకొనకఁ బోవుటచే మన భాషా సాహిత్యము లక్షింగొఱత వాటిల్లెనమకొనువారు కొందఱుందురు. వారి యీ కొఱతను 'వేణీ సంహారము' 'కుందమాల' 'యజ్ఞఫలము' మొదలైన నాటకముల ననువదించి తీర్చిన ఘనత బులుసువారికి దక్కినది.

బులుసువారి యీ యనువాద నాటకములు పాఠ్యగ్రంథములుగా విద్యార్థుల నలరించినవి. 'కుందమాల' పదికూర్పుల నందిన దనియు 'వేణీసంహారము' ఆరుకూర్పులనొందినదనియుఁ దెలిసినపుడు సంతోషము కలుగును.

అనువాదము చేయుట క్లేశముతోఁ గూడిన పని. ఆ క్లేశమును లెక్కైన గణింపక హృదయంగమమైన యనువాదము లను వెలయించుట బులుసువారి పనితనముగా గనిపించెను. అందువలననే

సీ. "ఎవ్వారి భుజబలం బెంచి దాయాదుల నిలఁద్రుణంబులుగ
నీ వెంచినావో
యాచార్య ద్రోణ భీష్ము లీ యవనీతలంబున లేరైరిగా తండ్రి!
వీరవరుని
కర్ణపుత్త్రుని, జయకాలరుద్రుని వంటి వృషసేను
నట్టులు పిలుకుమార్చి
వేయేల నర్జును జూచి భీతిల్లి జగమెల్ల సుతులు నూర్గురు
రణక్షితిని బడిరి

ఆ. మిగిలియుంటి వీవ పగర ప్రతిజ్ఞకుఁ
బోరు మానవయ్య! వైరితోడ
గ్రుడ్డివార మేము గురులము నీకు న
మ్మేలు కొనుము తండ్రి మేలు కలుగు" అనెడు వేణీసంహారము (పంచమాంకము) నందలి పద్యము ధృతరాష్ట్రుని శోకమును గన్నులకు కట్టించి కంటనీరు పెట్టించును. భట్టనారాయణుని నాటకములోని రసవంతములైన పట్టులు బులుసువారి యనువాదములోనుఁ గనుపట్టుటకుఁ గారణము సహృదయులకే విదితము.

సీతా పరిత్యాగకథ నితివృత్తముగఁ గైకొని దిఙ్నాగుడు సంస్కృతమున వ్రాసిన 'కుందమాల'కు బులుసువారి చక్కని యనువాదమును సంతరించి తరించి నారనవచ్చును.

చ. 'కలిసికొనంగ దక్షిణమె గాఢముగా హృదయంబు నాత్మ బం
ధులు వశపర్చుకొందు రెటో; దోషముకాని గుణంబుకాని యుం
తలు తలపోయకుండఁ గనె తక్షణమాత్రనె చంద్రకాంతపుత్
శిలలు కరంగి పోలె దరిసించి మనోహర పూర్ణచంద్రునిన్!'

ఇది బులుసువారి 'కుందమాల' (పంచమాంకము) లోని పద్యము. అనువాదమని చెప్పినఁ గాని తెలియదు.

మన తెలుఁగుతల్లి భాగ్యవశమున నీ యుగమున జన్మించిన మంచి కవులలో బులుసువారు నొకరు. 'అర్షకవి శిరోమణి' యైన వారి కృతులును సహృదయ హృదయానంద దాయకములైన సువర్ణ మణులే.

'తెలుఁగు విద్యార్థి'



# కలగూరగంప

## మారీచీ పరిణయము

అయ్యా,

డిసెంబరునెల 'భారతి'లో శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు రచించిన 'మోహనాంగి విరచిత మారీచీ పరిణయ' సమీక్ష చదివాక ఈ నాలుగు పంక్తులు వ్రాయాలనిపించింది.

సెట్టి లక్ష్మీ నరసింహంగారు, మా నాన్నగారు గంటి సూర్యనారాయణశాస్త్రిగారు మంచి స్నేహితులు. సెట్టి లక్ష్మీ నరసింహంగారి రచనలను కొన్నిటిని మా నాన్నగారు తమ 'కల్యాణి' పత్రికలో ప్రచురించారు. సెట్టి లక్ష్మీనరసింహంగారు కవితా సమితిలో సభ్యులు. అప్పటి కవితా సమితి కార్యదర్శి (నేటి కళాప్రపూర్ణ) శ్రీ పురిపండాకు వారితో మంచి స్నేహ సంబంధా లుండేవి. మా నాన్నగారితోను, మిత్రులు శ్రీ పురిపండాతోను మారీచీ పరిణయ కర్తృత్వాన్ని గురించి నేను ప్రసంగించిన సందర్భా లున్నాయి. ఈ ప్రసంగాల వల్ల 'మారీచీ పరిణయం' కేవలం సెట్టి లక్ష్మీనరసింహం గారి స్వకపోల కల్పితమేనని తెలుసుకున్నాను. దీనికి మూలం అంటూ వేరే ఏదీ లేదు. పాఠక లోకాన్ని భ్రాంతిలో ముంచి వినోదించడమే వారి లక్ష్యం. వారికి శ్రీ నోరివారు సూచించిన మరి ఏ ఇతర ఉద్దేశ్యం ఉన్నట్లు ఎప్పుడూ, ఎక్కడా వినలేదు. వారితో సన్నిహిత సంబంధాలున్నవారు మాత్రమే వారి విచిత్ర ప్రవృత్తిని వివరించి చెప్పగలరు. నాకు మా నాన్నగారినుంచి తెలిసిన సత్యాన్ని మాత్రమే ఇక్కడ వ్రాస్తున్నాను.

శ్రీ నోరివారి సమీక్ష సమర్థవంతమైన దనడంలో సందేహం లేదు. అయినా అనవసరమైన విషయాలకు చోటిచ్చి, అవమానా న్నాపాదించే వాక్యాలు వ్రాయడం సమంజసంగా లేదని భావిస్తున్నా. వ్యావహారిక భాషావాదులు సలక్షణం ఛందోబద్ధం అయిన కవిత వ్రాయలేరనే అపప్రథను ఉల్లేఖించడం సహృదయతకు తార్కాణం కాదు. ఒకప్రక్క శ్రీ సెట్టి వారు అప్పటికే పరిణతుడు, లబ్ధప్రతిష్ఠుడు అంటూనే మరో ప్రక్క పై అపవాదాన్ని ఉట్టంకించడం సరసంగా లేదు. 'తక్కిన గ్రంథం వ్రాయు శ్రమలేకుండ కథా సంగ్రహ మిచ్చినారు' అనుట వీరికి శ్రీ సెట్టి వారి పద్యరచనా సామర్థ్యంపై నమ్మకంలేదని సూచిస్తున్నది. సెట్టివారి చిత్రమాలికలను గాని, ఇతర కృతులనుగాని శ్రీ నోరివారు చూడలేదేమో! వాల్మీకి వాక్యాన్ని ఉట్టంకించడంకూడా వారి పేద మనస్సును వ్యక్తం చేస్తున్నది.

**శ్రీ గంటి శ్రీరామమూర్తి.**

## మారీచీ పరిణయము

### శ్రీ నోరి నరసింహశాస్త్రి సమీక్ష

నాచే ఆంగ్ల, ఆంధ్ర భాషలలో ప్రస్తావన, వివరణలతో ప్రచురించబడిన మారీచీ పరిణయమును సమీక్షించుచు (భారతి, డిశంబరు, పు. 60—65) శ్రీ నరసింహశాస్త్రిగారు నాపై కొన్ని మిథ్యా దోషములను మోపిరి. వానికి సమాధాన మొసగుట నా విధిగా భావించు చున్నాను.

(1) మారీచీ పరిణయము మోహనాంగి వ్రాసినదా లేక ఆమె పేర వేరెవరైన చేసిన కూట కరణమా అను విషయమును పురస్కరించుకొని, 'సంపాదకులు ఉభయవాదములకు గల ఆధారములను మొత్తము మీద దాచకుండా న్యాయముగానే ప్రదర్శించిరి కాని మోహనాంగి కృతమే యని భ్రాంతిపడి లోకమును భ్రమపెట్ట పూనుకొన్నారు' అని శాస్త్రిగారు నుడివిరి. నేను ఇట్టి భ్రాంతికి లోను కాలేదు. లోకమును భ్రమపెట్ట పూనుకొనలేదు అను విషయము, ప్రస్తావనలో 'కొన్ని అసందర్భములు' అను శీర్షిక క్రింద నేను వ్రాసినదానిని చదివినవారి కెవరికైనను అర్థము కాగలదు. నేను ఇట్లు వ్రాసితిని : 'మారీచీ పరిణయ కథనము ఈ వ్రాతలకు (అనగా, నేటికి ఎరుకలో గల చరిత్రాంశములకు) విరుద్ధముగ నున్నది. అంతే కాక అసందర్భము గను, అర్థరహితముగ నుండి, ఈ కావ్యము మోహనాంగి వ్రాసినదేనా అను సంశయమును

వృద్ధిచేసి, దానికి గల చారిత్రక ప్రామాణికతను అను మానాస్పదము గావించుచున్నది.' (మా. ప, పు. 40) కావలి వెంకటరామస్వామి 'దక్కను కవి జీవితములు' ఆధారముగా ఈ కావ్యమును, కృష్ణరాయల కాలము తరువాత, ఎవరైన వ్రాసి యుండిరేమో అని అను మానమును మాత్రము నేను వెలిబుచ్చితిని. నేను ఈ కావ్యము వెలువరచునాటికి నా ఎరుకలోనికిరాని విష యము శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారి వ్యక్తిగత శీలము. నేను ఈ కావ్యమును ప్రచురించిన తర్వాతనే, దానినిగూర్చి శ్రీ గోపాలకృష్ణగారు 28–9–73 'జమీన్‌రైతు'లో చేసిన పుస్తక పరిచయమును పురస్కరించుకొని శ్రీ ఆరుద్ర (జమీన్‌రైతు, 2–11–73), శ్రీ నిడుదవోలు వెంకటరావు (జమీన్‌రైతు, 23–11–73) గారలు దాని కర్తృత్వమును గురించి వ్రాసిన వ్యాసములలో, రచ యితగా శ్రీ సెట్టి లక్ష్మీనరసింహము గారి వ్యక్తిగత శీలమును గురించి, శ్రీనాథునిపేర వారు ఇతః పూర్వము గావించిన 'రసికాభిలాష'మను కూట కరణమును గురించి విపులముగా వ్రాసియున్నారు. మిసెస్ వి. వి. యన్. కాలేజీలో చరిత్రోపన్యాసకులుగ నున్న సెట్టివారిని తమ విద్యార్థి దశనుండి ఎరుగుదు మని వెంకటరావుగారు చెప్పుచున్నారు. దీనిని బట్టి, సెట్టి లక్ష్మీనరసింహము గారికి, నాకు వయసున రెండు తరముల అంతరము కలదు. నాకు సెట్టివారి వ్యక్తి గత శీలమునుగూర్చి తెలుసుకొనుటకు అవకాశము తక్కువ. సెట్టివారికి దగ్గర సమకాలీనులై, వారి వ్యక్తిగత శీలమును ఎరుగుటకు ఎక్కువ అవకాశము కలిగిన శ్రీ నోరి నరసింహశాస్త్రులవంటి పండి తులు, సెట్టివారు ఇట్టి కూటకరణము గావించి లోకము మీద రుద్దుచుండగా, అట్టి విష యము తమ ఎరుకలోనికి వచ్చియు మిన్నకుండుట ధర్మమా? నేను ప్రస్తావనలో చెప్పాను—1929 లో సెట్టి లక్ష్మీనరసింహం ఈ కావ్యభాగాలను ప్రచురించి నప్పటినుండి, 1970 ఏప్రెల్ 'భారతి'లో శ్రీ కొండూరు వీరరాఘవాచార్యుల వ్యాసం మినహా, గత 45 ఏండ్లుగా దీని సంగతి పట్టించుకొన్న పరి శోధకుడు నాకు తటస్థపడలేదు. అందులోను, 'రసి కాభిలాషము' వంటి చారిత్రేతరమైన కావ్యవర్ణనలు కాక, విజయనగర చరిత్రనే తారుమారు చేయు మారీచీ పరిణయ పీఠికా పద్యములవంటి వానిని ఉపేక్ష చేయవచ్చునా? 1970 ఏప్రెల్ 'భారతి'లో కొండూరు వీరరాఘవాచార్యుల వారు మారీచీ పరిణయముపై వ్రాసిన సుదీర్ఘ వ్యాసమును నరసింహశాస్త్రిగారు చూచినట్లు తెలిపినారు. అప్పుడైనను, 'ఆముక్త మాల్యద'ను రాయలు వ్రాయలేదని నేటికిని నమ్ము చున్న నరసింహశాస్త్రిగారు గాని, మరెవ్వరైన చారిత్ర కులు, సాహిత్య చారిత్రకులు గాని, ఈ మారీచీ పరిణయ కర్తృత్వ నిజానిజములను గురించి ('భారతి' మూలముననే) తెలిపియుండవచ్చును గదా! అట్లు ఖండించనపుడు, సెట్టివారి శీలమును స్వయ ముగా ఎరిగిన వారి సమకాలీనులు గతించిన తర్వాత, అనగా ఇక 50 లేక 100 ఏండ్ల తర్వాత, మారీచీ పరిణయ కర్తృత్వమును గూర్చిన నిజానిజములు తెలియుటకు అవకాశము ఉండదు గదా? ఒకడు అతి పనిగా, అందరి ఎరుకలో, భావి తరాల్నంతా తప్పు త్రోవపట్టించే ఒక తప్పుడు పని చేస్తుంటే, చూసీ చూడనట్లు ఉపేక్షించడం సభ్యసమాజం హర్షించ దగిన విషయం కాదు. ఆ ఉపేక్ష సాహితీ ప్రపం చంలో మన కనీస పౌరసత్వ బాధ్యతలను విస్మరించ డమే. నా ఈ ప్రచురణ, సెట్టి భ్రమకును లోనుగాక, లోకమును భ్రమపెట్ట పూనుకొన్నది గాక, ఇన్నాళ్ళుగా లోకమున ఉన్న, ఇంకనూ ఉండుటకు అవకాశము గల గిన, భ్రమను తొలగించి, ఈ మారీచీ పరిణయ కర్తృత్వ విషయ నిజానిజముల వెల్లడించుటకై చరిత్రకారుల, సాహిత్య చరిత్రకారుల దృష్టి దీనిపై పు మరలించిన, 'చిత్తశుద్ధి'తో గావించిన, పూనికగానే భావించుచున్నాను. ఇందులో నా పొరపాటు ఏదైన వున్న, అది సెట్టి లక్ష్మీనరసింహముగారి వ్యక్తిగత శీలమును గూర్చి పరిశోధించక పోవుటయే. ఇక నేను ప్రస్తావనలో ఆకర సహితముగ పేర్కొన్నచరిత్రాంశముల ప్రామాణికులైన డా॥ నేలటూరి వేంకటరమణయ్య, డా॥ ఆర్. సుబ్రహ్మణ్యం ఇత్యాదులు చర్చించి నిగ్గు దేల్చిన అంశములే. నేను చేసిన పని మారీచీ పరిణయమును (అది ఎవరు వ్రాసినదైననూ) లోని చారిత్రకాంశములను వీనితో సమన్వయించి, అవును, కాదు అని చెప్ప ప్రయత్నము మాత్రమే.

(2) మారీచీ పరిణయ అవతారిక తుళువ వంశము సాళువ వంశాంతర్గత మనుచున్నది. వీరేశలింగంగారు 'ఆంధ్ర కవుల చరిత్ర' (1890) తోను, చిలుకూరు వీరభద్రరావుగారు 'జీర్ణ కర్ణాటక చరిత్ర' (1905) తోను, కొమర్రాజు లక్ష్మణరావు గారు 'మహమ్మదీయ మహాయుగము' (1908) తోను, మారీచీ పరిణయమునందు ఇవ్వబడిన కృష్ణరాయల వంశక్రమమునే ఇచ్చియున్నారు. సెట్టి లక్ష్మీనరసింహముగారు ఈ వ్రాతలే ఆధారముగా మారీచీ పరిణయమునందు రాయల వంశక్రమమును కల్పించిరని తమ సమీక్షలో నోరివారును, తమ వ్యాసములతో ఆరుద్ర (జమీన్‌రైతు, 2–11–73), నిడుదవోలు వెంకటరావు (జమీన్‌రైతు, 23–11–73) గార్లును అభిప్రాయపడుచున్నారు. కాని చరిత్ర విద్యార్థిగ నన్ను వేధించుచున్నది ఒకటే సమస్య. ప్రామాణిక ఆంధ్ర చరిత్రకారులుగను, సత్యశోధకులుగను ప్రఖ్యాతిగన్న కందుకూరి, చిలుకూరి, కొమర్రాజు గారలు ఎట్టి ఆధారము లేకయే విజయనగర చరిత్రకు అతిముఖ్యమైన ఈ రాయల వంశక్రమమును తమ పుస్తకములలోని కెక్కించిరని నమ్మవలయునా? కాని యెడల, ఏ కావ్యాది ఆధారములతో ఈ పరిశోధనా జిజ్ఞాసువులు ఈ రాయల వంశక్రమమును తమ గ్రంథములలో చెప్పగలిగిరి? ఇది చారిత్రకులు గట్టిగా పరిశీలించి నిర్ణయించవలసిన విషయము. నోరి వారికి తెలిసియున్న తెలుపగలరని ప్రార్థన.

(3) 'సంపాదకులు ప్రసిద్ధ పరిశోధకులైన డా. నేలటూరు వెంకటరమణయ్యవంటి వారిని ఈ గ్రంథము నిజానిజములు తేల్చుడని సవాలువంటిది వేసినారు. అది పుట్టలో నిదురించుచున్న మహాభుజంగమును మేలుకొలుపుట వంటిదే కాగలదు'— అని నరసింహశాస్త్రిగారు వ్రాసినారు. పెద్దలగు నరసింహశాస్త్రిగారు ఇట్టి పరుషమును ప్రదర్శించుట పాడిగాదు. ఈ పరుష వాక్యములచే విజయనగర చరిత్రకు Tacitus వంటి వారైన డా॥ నేలటూరు వేంకటరమణయ్యగారికి అపచార మొనర్చినారు. విజయనగర చరిత్ర విద్యార్థులెవరైనను వేంకటరమణయ్యగారికి ప్రత్యక్ష శిష్యులుగనో, ఏకలవ్య శిష్యులుగనో ఉండక తప్పదు. వారి గ్రంథములు లేక విజయనగర చరిత్ర లేదు. వారికి నేను ఏకలవ్య శిష్యుడను. వారితో నాకు సుంత పరిచయ మేర్పడినది. వారు శిష్య వత్సలులు. వారికి, నాకు, హస్తి మశకాంతరము. వారు హిమాలయ సదృశులు. వారితో పోల్చినపుడు నేనొక వామలూరువుము. అట్టి వారిని నేను సవాలు చేయుట అనునది నగుబాటు విషయము. నా ప్రస్తావనలో ఏ వాక్యము లాధారముగ నోరివారు పై మాటలు వ్రాసిరో వాని నిట ఉటంకించుచున్నాను.

'ఆంధ్ర చారిత్రక పరిశోధక చక్రవర్తులైన కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్రాతలయందు గాని, విజయనగర సామ్రాజ్య చరిత్ర చతురాననులై, ఆ చరిత్ర పరిశోధనకే జీవితము నంకితము గావించిన ఆచార్య నేలటూరు వేంకటరమణయ్యగారి వ్రాతలయందుగాని ఈ కావ్యప్రసక్తియే లేకపోవుట ఆశ్చర్యము గొలుపుచున్నది. ఈ అవతారికా పద్యములయందు కృష్ణరాయని వంశాదికమును, జీవిత విశేషములను గురించి చెప్పబడిన కొన్ని చారిత్రకాంశములతో గల అనుమానాస్పదమైన విషయములనుబట్టి, ఇది మోహనాంగి పేరుతో బరగుచున్న 'బినామి' (Spurious) కావ్యమని మన మంగీకరించవలసి వచ్చినను, ఆ విషయమునైనను చర్చించి పాఠకుల ఎరుకకు తేవలసిన బాధ్యత చారిత్రకులపైన ఉన్నది కదా' (మా. ప, పు. 3).'

పై నా వాక్యములు ఏ పాఠకునికిగాని, నాకు వేంకటరమణయ్యగారి ఎడల నమ్రతాభావము లోపించినదని స్ఫురణ గలిగించిన ఎడల, ఈ పత్రికా ముఖమున ఆచార్య వేంకటరమణయ్యగారికి హృదయపూర్వక క్షమాపణలు అర్పించుచున్నాను.

డా॥ సి. వి. రామచంద్రరావు.

## అనేకార్థద్యోతకం—మాట

తెలుగుమాట కొంచెం ఘాటయింది గానే ఉంది. గిడుగు వారికి పదకొండర్థాలతో, గత నవంబరు భారతిలో శ్రీ ద్వా. నా. శాస్త్రిగార్కి మరో పదిహేడు అర్థాలతో సాక్షాత్కరించింది. శాస్త్రిగార్ని ఈ మెదడుకు మేతపెట్టే వ్యాసం అందించినందు కభినందిస్తూ మరికొన్ని అర్థాలు వివరిస్తాను.

1. 'ఊరకే మాటాడితే సరిపోదు—చేసి

చూపాలి' అంటాము. ఇక్కడ క్రియలో ఉన్న 'మాట' ప్రగల్భం అనే అర్థానికి ద్యోతకం. శాస్త్రిగారిచ్చిన 14, 25 వాక్యాలలో సమర్థన, సులభం అనే అర్థాలే వస్తువిగాబట్టి ఇది వాటికంటే ప్రత్యేకం.

2. 'అయితే! నీవూ వెళ్లిపోతావన్నమాట!' ఇక్కడి మాట కేవలం ఊతపదం. తనకు తెలిసిన కొత్త విషయాన్ని వక్త వ్యక్తంచేస్తూ ప్రశ్నిస్తున్న భావం దానివల్ల స్ఫురిస్తుంది. ఇక్కడ 'తా'మీద, "మాట'మీద ఇంకొంచెం ఊనిక (Stress) చేస్తే భయపెడుతున్నట్లు తెలుస్తుంది.

3. 'మాట పడిపోయింది'అంటాము. ఏ రోగం తోనో మాట్లాడలేని స్థితి (నోరుపడి పోవడం) వచ్చిందన్న మాట.

4. 'ఏమిరా! మాటా పలుకూ లేకుండా నిలబడ్డావ్' అంటూ పంతుళ్లు అనడం ఎరుగుదుము. ఇక్కడ ఏకార్థక పదాలు వరుసగా వచ్చాయి. మాట సమాధానార్థకం అవుతోంది.

5. 'మనం మాటంటే మాటే' అన్న చోట రెండో మాట కేమర్థం? (చెప్పిన దానికి) తిరుగు లేదు అనే కదూ! ఇలా పదావృత్తివల్ల భావవైవిధ్యం కల్గడం 'కమలాక్షు నర్చించు కరములు కరములు' మొదలయిన చోట్ల పరిచితమే.

6. 'దానితో వాళ్లిద్దరికీ మాటల్లేవు.' ఎడ మొగం పెడ మొగం అయ్యారనేగా భావం!

7. 'ఇంకా మాటాడితే నీదే తప్పు.' ఇక్కడి 'మాటాడితే'కి వాదిస్తే అని కదూ అర్థం. 'లోతుకు దిగి చర్చిస్తే నీదే దోషం' అని వక్త అభిప్రాయం.

8. 'మాటలు చెప్పి పంపించాడండీ'! అని 'ఏ అప్పుకోసమో ఎవరి దగ్గరకో వెళ్లిన పనేమైంది'? అని అడిగినప్పుడు అంటాము. ఇక్కడి మాటలు ఆప్పెగవేసి దాన్ని కప్పిపుచ్చేందుకు ఉద్దేశింపబడ్డవి.

'అన్నమాటేమిటి? ఉన్న మాటే'! అని నేడు సినిమాల్లో సర్వత్రా విన్పిస్తోంది గానీ ఇలాంటి భావం ఇచ్చే లక్ష్యాలు శాస్త్రిగారే చూపించి ఉన్నారు గాబట్టి పత్యేకంగా గణించను.

అలాగే గిడుగువారి 'మాట ఇచ్చాడు', శాస్త్రి గారి 'మాట నిలబెట్టుకో'లలో అర్థ భేదం ఏదీ లేదను కుంటాను. 'వాడి మాట ఏం చేశారు' అన్నపుడూ 'నీ మాట కాదు నువ్వూరుకో' అన్నపుడు అర్థ భేదం స్ఫురించదు. 'లేకపోతే మనకు మాట వస్తుంది' అన్నా 'మాట పడదు' అన్నా రెండు చోట్లా 'నింద పడకపోవడమే' ఉంది. శాస్త్రిగారు వీటిని పరిశీలిస్తా రని ఆశిస్తూ ఒక వేళ అర్థ వైవిధ్యం ఉన్నా అది ప్రత్యేకంగా పరిగణించ తగినంతటిదా అని అనుమానం వ్యక్తం చేస్తున్నాను.

ఇలాంటి రోచకమూ, ఆలోచనా ప్రేరకమూ ఐన వ్యాసానికి శాస్త్రిగార్ని మనం పునః అభినం దించాల్సి ఉంది.

**శ్రీ వీరపు బాలసుబ్రహ్మణ్యం.**

## అప్పకవి ప్రస్తావన అనవసరం

భారతి—సెప్టెంబరు 1973 సంచికలో 'పండిత రాయల వెక్కిరింపులు' అనువాద పద్యం ఒక దానిలో '**యతి తప్పినది**' అని శ్రీ పాత కోట రాధా కృష్ణమూర్తి అన్నారు. (చూ. భారతి. నవంబరు 1973.) ఆ పద్య చరణం యిది—

'పెరుగున్ నీ యెడ కల్పవృక్షములు,
నీవే మాలి స్వర్వాటికిన్...' (12 పుట.)

ఇందులో 'పె-వే' (14 వ అక్షరం) లకు యతి.

పద్యపాదాలను యతులవరకు కచ్చితంగా తుంచి వ్రాయటం లేదు రచయిత. (పాదారంభాలు కచ్చి తంగా తుంచుతున్నారు.) పాదమధ్యాలు అర్థవశంగా బహుశః తుంచుతున్నారేమో? 'పె—నీ' (13 వ అక్షరం) లకు యతి అనుకొన్నారా మూర్తిగారు? అచ్చులో చూచినప్పుడు ఝటితి అలాంటి భ్రాంతి కలిగే అవకాశం వున్నది.

'ఏ—వ'లకు 'అభేద వర్గయతి' చెల్లుతుంది. 'పె—వే' లకు యతి చెల్లడం 'ప్రాణి విరామము' అవు తుంది. అయితే ఇక్కడ మొదటి 'పె'లోని అచ్చు విరగదు. కాని వళిస్థానంలోని 'వే' లోని అచ్చు విరుగుతుంది. నీవు+ఏ (నీవు మాత్రము—ఏవార్థకము)

నీవే అయింది. ఇట్లా విరుగుతున్న అచ్చుకే యతి చెప్పాలని మూర్తిగారి అభిప్రాయమైతే, అది పొరపాటే. ఇక్కడి అచ్చును విరచకుండా హల్మైత్రిని గూడా పాటించవచ్చునని అన్నారు ఛందఃకారులు. అట్టియతిని 'కాకు స్వరవళి' అన్నారు. దీనిని ఉభయవళి భేదం క్రింద అప్పకవి అంగీకరించాడు.

కాగా, భారతి—డిసెంబరు 1973 సంచికలో అది 'అఖండయతి' అని రచయిత డా. మహీధర నళినీమోహన్ సమాధాన మిచ్చారు. అది పొరపాటు. అది అఖండయతి కాదు, కాకు స్వరయతి. ధూర్జటి అఖండ యతిని ఒకదాన్ని ఉదాహరించడము, తాము అఖండ యతులను యథేచ్ఛగా ప్రయోగించినట్లు చెప్పుకొనడమూ గాక, 'వాటిని అప్పకవి ఒప్పుకోకపోతే మించి పోయిందిలేదు' అని నిష్కారణంగా అప్పకవిని నిందించడం అనవసరం.

అప్పకవి అంగీకరించిన కాకు స్వర వళిని అఖండ యతిగా తాము అనుకొని, దాన్ని అప్పకవి ఒప్పుకోలేదనడం న్యాయం కాదు.

అప్పకవి అఖండయతిని అంగీకరించక పోవడం తప్పే కావచ్చు. తానే తనకు తెలియకుండా అఖండ యతిని ప్రయోగించి కూడా ఉండవచ్చు. భీమకవిదో, రేచనదో 'మానుగ విశ్రమాక్షర...' పద్యం ఉపసర్గ సంధికి ఉదాహరణగా ఇచ్చిన అప్పకవి, దీనిలోని మొదటి పాదంలో గల 'నిత్యసమాస విశ్రాంతి'ని (అఖండ విశ్రమము గూడ ఇదే నంటాడు అప్పకవి) అంగీకరించి, అదే పద్యం మూడో పాదంలో గల యతిని అప్రశస్తమని నిరాకరించడము అసంబద్ధమే. అప్పకవిని ఆక్షేపించ వలసిన ఘట్టాలింకా అనేకం యిలాంటివి లేకపోలేదు. కాని నళినీమోహన్గారు అసందర్భంగా అప్పకవిని ప్రస్తావించారు. అప్పకవిని, చిన్నయసూరిని, బహుజనపల్లి వారిని అవకాశం కల్పించుకొని ఆక్షేపించడం మనకొక సరదా!

శ్రీ బండి నాగరాజు.



# గ్రంథవిమర్శలు

## అభిప్రాయాలు—అనుభవాలు

(రచయిత : శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరి, మూల్యము : 5 రూపాయలు. సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్నం—1 మదరాసు—1.)

ఈ గ్రంథకర్త శ్రీ లింగం వీరభద్రయ్య చౌదరిగారు డెబ్బది సంవత్సరముల వయస్సుదాటిన తరువాత రచించిన గ్రంథమిది. ఉన్నత విద్యకై విదేశముల కేగిరి. 1920–26 సంవత్సరముల నడుమకాలమునందు వీరు ఇంగ్లాండులో నుండిరి. అనంతరము వీరు ప్రభుత్వమునం దత్యున్నతమగు పదవి నలంకరించిరి. అప్పుడు దక్షిణదేశమందలి వివిధ నగరములలో నుద్యోగరీత్యా నివసించిరి. వివిధములగు నీ యనుభవములకు నభిప్రాయములకు రూపకల్పన మీ గ్రంథము. వీరు విదేశములం దున్నను స్వదేశమును తన సంఘమును మరువలేదు. నగరములం దున్నత పదవిలో నుండియు నీ ఉద్యోగ విరమణము తరువాత గ్రామ జీవనమునే వరించిరి. వీరు కృష్ణామండలమునకు చెందినవారు.

వివిధములగు నంశములపై వీరు తమ యభిప్రాయములను వెలిబుచ్చిరి. వీరి వచనమునందు సారళ్యమున్నది. సున్నితమగు హాస్య గర్భితము వీరి వచనము.

యుద్ధరంగమునందు మరణించిన వారందరు స్వర్గలోకము నలంకరింతురనియు, రంభకౌగిలిలో సుఖింతురనియు మన పురాణములు చెప్పునంశము. ఈ నడుమ పాకిస్తాన్‌కు భారతదేశమునకు జరిగిన యుద్ధమునందు పలువురు వీరులు మరణించిరి గదా. వీరందరు 'క్యూ'లో నిలిచి రంభ పొందు ననుభవింతు మనుకో వలసి యుండును. 'వీరందరిని రంభ సంభాళించు కొనగలదా' (పుట 14) అని వీరు చెప్పుటలో చక్కని హాస్యము పోషింపబడినది. మరియు పురాణము లందలి కథలు కల్పితములనుటను వీరు సూచించిరి. రామాయణమునందలి 'రాముడొక భావన. ఆదర్శము అని నా నమ్మకము' (పుట 134) అని తన యభిప్రాయమును వివరించిరి. అట్లని వీరు నిరీశ్వర వాదమును ప్రతిపాదించుచున్నారన వీలు లేదు. 'సదా భగవత్సేవ చేయు జీవనం వ్యర్థం'; (పుట 135) 'దేవుడు కన్న బిడ్డలను బానిసలుగా చేయు దుష్టుడుకాదు' (పుట 133) అను నీ మాటలవలన దేవుడున్నాడనుటను విశ్వసించు వారనియే తెలియును.

శ్రాద్ధకర్మలందు సువర్ణ గో భూదానాలు ప్రేతమునకు సంతృప్తి కలిగించుననుట హేతుశూన్యమని వీరి తలపు. 'సూక్ష్మరూపంలోని ఆత్మకు భౌతికరూపంలోని ఆవు ఎలా తోడ్పడుతుంది.' (పుట 21) అని వీరు సూటిగ ప్రశ్నించారు. ఏదో నెపంతో చందాలను వసూలుచేసి స్వోదర పోషణ చేసుకొనేవారిని వీరు తీవ్రంగ నిరసించారు. 'ఒళ్ళువంచక సుఖజీవనం చేయవచ్చునని పూర్వంవలె ఒక్క కులమేగాక అన్ని కులాలు నేర్చుకొన్నవి' (పుట 53)

పద్యములను రచించినంతమాత్రమున కవిగాడని వీరి భావన. రసమనగా 'హృదయము నార్ద్రీ మొనరించి, మనస్సు నుత్తేజపరచి, బుద్ధిని ప్రజ్వలింపజేయునది' (పుట 39) అని వీరు వివరించిరి.

గ్రామ జీవనమునకు వీరి గ్రంథము దర్పణమన వచ్చును. తన చిన్ననాటికీ నేటికీ గ్రామ వాతావరణమునందెట్టి మార్పులు గలిగినవో వీరు వివరించి యున్నారు. గ్రామమనగానే వ్యవసాయం జీవనాధారంగా గల రైతాంగం అని వేరే చెప్పనవసరంలేదు. రైతుకు పాలేరు లేనిదే సాగదు. మునుపు రైతులకు పాలేళ్ళకు నడుమ సత్సంబంధం ఉండేది. పాలేరును రైతు తన పుత్రునివలె వాత్సల్యంతో చూచేవారని 'పాలేరు రైతుకు బిడ్డవంటివాడు' (పుట 78) అను వాక్యము తెలుపుతుంది. ఆ రోజులలో ఎంత ఆసామీ భార్య అయినా చీకటితో లేచి పాచి ఊడ్చుకొని ... తనే చేసుకొనేది (పుట 101) మరియు నాటి గృహములు చాల చిన్నవిగా ఉండేవి. నేడు గ్రామాల్లో పనిచేయడం తగ్గిపోయింది. కూలీలకు రైతులకు సత్సంబంధాలు లోపించినవి. దొంగతనము పెరిగినది. ద్వేషము అధిక

మైనది. ఈర్ష్య మితిమీరినది. స్కూలున్నను సరిగా శోధించువారు అరుదయ్యారు. గ్రామము విద్యుదీకరణ మైనను నుపయోగములేదు. కుళాయి లున్నను నీరు రాదు. చెఱువుగట్టు మురికి కునికి పట్టు. బట్టల నుదికి ఆ గట్టుపై ఆరవేయుదురు. నేయి, పాలు, పెరుగు, కోళ్ళు, చేపలు, కూరగాయలు బస్తీవారికి అమ్మటం మొదలైనందున గ్రామములందేవియు లభించుటలేదు. పెండ్లి భోజనములలో అశుభ్రత, రద్దీ మొదలగునని (పుట 106, 107) సహింప రాని వయినవి.

శ్రీ చౌదరిగారు వివాహమాడిన గ్రామీణులు ఆ రోజుల్లో మోటుగ (పుట 89) నుండేవారట. ఆ రోజుల్లో ఈ రోజుల్లో కూడా శ్రీ చౌదరిగారి ప్రాంతీయులను మాటల విషయమునందు ఔదార్యమును చేతల విషయమునందు సంకుచితత్వము (మాట గొప్ప మానిక పిచ్చ) గలవారని తదితర ప్రాంతీయు లను కొందురు. ప్రతి పురుషునిలోను...కొంత మంచి కొంత చెడు ఉండును (పుట 137) అను చౌదరిగారి మాట శిరోధార్యము.

భూసంస్కరణములను పేర గరిష్ఠ భూపరిమితిని ప్రభుత్వము విధించుటను వీరు విమర్శించిరి "మన రాజ్యాంగంలో వ్యక్తి ప్రస్తావనేగాని కుటుంబ ప్రస్తావనలేదు (పుట 130) అనియు దాన కుటుంబ సభ్యులకు సంక్రమింపవలసిన భూమిని ఇతరులకు పంచుచున్నారనియు, బీదలకు భూమి నిచ్చినను ఉపయోగముండదు. మరియు నుత్పత్తి తగ్గి దేశమునందు కరువు అధికమగుననియు వీరు సహేతుకముగ నిరూపించిరి.

సత్యభామ ద్రౌపదిల (పుట 69) అవయవ పొందిక (పుట 41) మొదలగు ప్రయోగ విశేషము లిందు గలవు. భవభూతి ఉత్తరరామాయణములోని కథ నాధారముగా తీసికొని ఉత్తర రామచరిత్రమను దృశ్యకావ్యమును వ్రాసిరి దీనిపేరు 'ఉత్తర రామాయణం, (పుట 33) అనుట ప్రామాదికము. కవిరాజు గారి ఉవాచ (పుట 28) అనుటలో ఉవాచ అనగా మాట, సూక్తి అని తలంచియుందురు కాని 'ఉవాచ' అనగా 'పలికెను' లేక 'చెప్పెను' అని అర్థము. ఇది భూతకాలిక ప్రథమపురుష ఏకవచన రూపము. వ్యవహారమునందు రూఢిగాంచిన 'నాయకి' అను అసాధు రూపమును గాక 'నాయిక' (పుట 39) అను వ్యాకరణ సమ్మతమగు రూపమును ప్రయోగించి వీరు వ్యాకరణముపై తనకుగల యాదరమును సువిదితము గావించి యున్నారు. ఆంగ్ల వాక్యమును తెలుగు లిపిలో (పుట 41) వ్రాసి వీరు తెలుగుపైగల యాదరమును వ్యక్తము గావించి యున్నారు.

పై రచనలోని సారనిస్సారాలను ఉచితానుచితాలను పాఠకుల నిర్ణయానికి వదలి వేస్తున్నాను, (పుట 1) అనుటలో వీరి యుదాత్త ప్రకృతి విశదమగు చున్నది.

వీరు తమ యభిప్రాయమును నిర్మొగమాటముగ చెప్పగలవారు. గ్రామీణ జీవితవిధాన వర్ణనములో వీరి స్వీయచరిత్ర విశదమగుచున్నది. వీరి వచన రచన సరసము. వస్తుగౌరవము లేకున్నను ఉక్తి చమత్కారము వీరి రచనమునకు జీవమును గలిగించినది. ఈయంశము నందు వీరిప్రతిభ అపూర్వము.

—శ్రీ జె. సూర్యనారాయణ.

## కుండలినీ జ్ఞానయోగము

(రచన, ప్రచురణ : కోరుట్ల భక్తబృందము, క్రౌను సైజు 40 పేజీలు, వెల రూ. 2–50, ప్రతులకు—శ్రీ గోనె విఠల్, జ్యోతిష సాముద్రికులు. బోయివాడ, కోరుట్లపోష్టు, కరీంనగరముజిల్లా, ఆంధ్ర ప్రదేశ్.)

ముక్తిని సాధించడానికి భక్తి, కర్మ, జ్ఞాన యోగాలు చాలా ప్రసిద్ధమైనవి. అవి ఒక దానికంటె ఒకటి కష్టతరాలు. సాధకులు వారి వారి శక్తులను అనుసరించి ఆయా మార్గాలలో సాధన చేస్తారు. ఇవి కాకుండా మరొక సాధన ఉన్నది. అదే యోగ మార్గం. అన్నింటికంటే కష్టమైనది. అందువల్లనే సామాన్యులెవ్వరూ దాని జోలికి పోరు, అది పై వాటి కంటె తక్కువ కాలంలో బ్రహ్మానందానుభవాన్ని కలిగిస్తున్నా.

యోగసాధన అనేక రీతుల ఉన్నది. వాటిలో కుండలినీ జ్ఞానయోగం కొంత సుకరమైనది. గురువుల వాత్సల్యాన్ని పొంది, వారి ఆదేశం ప్రకారం సాధన చేస్తే సామాన్య జనులకు కూడా ఈ యోగాభ్యాసం

కొంత సుకరం. దానిని సులభ పద్ధతిలో కుండలినీ జ్ఞానయోగి శ్రీ అవధూత గోవిందగిరి స్వాములవారు కోరట్లలోని తమ భక్తులకు బోధచేసి, అభ్యసింపజేసి, సత్ఫలితాలను కలిగించారు. ఆ అనుభవజ్ఞులైన భక్తులు ఆ కుండలినీ జ్ఞానయోగాన్ని గురించి, గురువుగారివల్ల తెలుసుకున్న విషయాలను సంగ్రహంగా ఈ చిన్న పుస్తకంలో వివరించారు. ఒక్కరు కాక అనేకులు కలిసి, పర్యాలోచించి మార్చినందువల్ల విషయం సుబోధంగా ఉన్నది.

ఇందులో వెన్నెముక అడుగుభాగంలో ఉండే కుండలినీశక్తి శిరోమధ్య భాగంలోని సహస్రారాన్ని ప్రవేశించే మార్గాన్ని తెలిపే చిత్రమూ, యోగమార్గాన్ననుసరించి శిరస్సులోని భాగాలను తెలిపే చిత్రమూ ఉన్నవి. అవి విషయాన్ని కొంత సులభంగా గ్రహించడానికి ఉపయోగిస్తాయి. ఇందులో శ్రీ స్వామి జీవిత సంగ్రహం, కుండలినీయోగాన్ని గురించిన ప్రాచీన నవీనపద్ధతులు, యోగం, సాధకు లనుసరించవలసిన నియమాలు, మార్గాలు తెలుపబడినవి. ఈ యోగానికి సంబంధించిన ఇతర విషయాలు, గురువు, ఉపదేశం, ముక్తి మున్నగు విషయాలు సూక్ష్మంగా తెలుపబడి ఉన్నవి. పై విషయాలనుగురించి ఆదిశంకరులు, స్వామి వివేకానందులు తెలిపిన విషయాలు వారి గ్రంథాలనుండి ఉద్ధరింపబడినవి. భగవద్గీత, బ్రహ్మవిద్య, సీతారామాంజనేయం మున్నగు వాటిలోని విషయాలు కూడా చేర్చబడినవి.

ఈ యోగాన్నిగురించి తెలిపే గ్రంథాలు చాలా ఉన్నా, అవి సులభంగా అర్థం కావు. సామాన్యులకు అవి అందుబాటులో ఉండవు. బహుగ్రంథాల సారాన్ని గ్రహించి సులభమార్గంలో కుండలినీయోగ ప్రక్రియను తెలియజేసే పుస్తకాలలో ఇది ఎన్నదగినది. రచన చాలా సరళంగా సాగినది. ఈ యోగమార్గాన్ని గురించి తెలుసుకొనదలచినవారు తప్పకుండా చదువవలసిన పుస్తకం ఇది. దీనిని తయారుచేసి, ప్రకటించిన కోరుట్ల భక్తబృందంవారు అభినందనీయులు.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

## లోకాలోకము

(రచన: శ్రీ మల్లాది- సూర్యనారాయణమూర్తి. డెమ్మీ్మసైజు 14+30 (సవరణలతో సహా) పుటలు. వెల మూడు రూపాయలు. ప్రచురణ కర్త: శ్రీ ఎమ్. వి. ఎస్. రావు, తణుకు, పడమటి గోదావరి జిల్లా, ప్రతులకు: ప్రచురణకర్తకే వ్రాయవలెను.)

రచయిత తన 'మాట' లో 'నాకు చిన్నతనము నుండీ ఉండిన సంఘ సంస్కరణప్రీతి, మూఢ విశ్వాస తిరస్కృతి మొదలైన భావాలను నా చదువు, సాంగత్యం, అనుభవం—ఇవన్నీ బలపరిచాయే గాని సడలించలేదు. కాగా మతం, దేవుడు, దయ్యం, పుణ్యం, పాపం, స్వర్గం, నరకం, కర్మ— ఇత్యాదుల్ని గురించి నా భావాలలో కొన్నింటిని స్వేచ్ఛగా పద్యరూపంలో వ్రాయాలని సంకల్పం కలిగింది' అని అంటున్నారు. దైవానికి రూపకల్పన చేయకూడదనీ, గుళ్ళూ, గోపురాలూ, వ్యర్థాలనీ, మతాలు అనైక్యతా కారణాలనీ, విశ్వజనీనమైన మానవతామతమే మతమనీ మతాచార్యులు రాజ్యాధిపతులవలె భోగా లనుభవిస్తూ ఉంటారనీ, పురాణాలన్నీ అబద్ధాల పుట్టలనీ—ఈ పుస్తకంవల్ల తెలుస్తున్నది. అప్పుడప్పుడు తమ భావాలను వ్యక్తంచేస్తూ విడివిడి పద్యాలను వ్రాయడం జరిగింది. ఈవిధంగా తయారైన నూట ముప్ఫయి అయిదు పద్యాలు ఈ గ్రంథరూపంగా వెలువడ్డాయి. వాటి నన్నిటినీ ఒక క్రమంలో పెట్టడానికి రచయిత ప్రయత్నించారట! ఆ ప్రయత్నం చాలావరకూ సఫలమయినదనే చెప్పాలి.

లోకాలోక పర్వతం బయటికి అంధకారమయంగానూ, లోపల తేజోవంతంగానూ ఉంటుంది. ఇందులో మూఢాచారాలూ, విగ్రహారాధనా, మతాలూ, క్రమశిక్షణ రాహిత్యమూ, అవిధేయతా మొదలైన అజ్ఞానరూప తమోభావాలు వెల్లడి చేయబడి, ప్రబోధరూపమైన విజ్ఞాన జ్యోతిని ప్రసరింపజేయడానికి ప్రయత్నం జరిగింది. 'లోకాలోకం' అనే పేరు దీనికి బాగుగా కుదిరింది.

రచయిత కళాశాలలో అధ్యాపకులుగా ఉండడంవల్ల నేటి విద్యార్థుల మనస్తత్వాలూ, అవిజడులూ, ఆందోళనాలు, అకృత్యాలూ అనుభవ పూర్వకంగా బాగా అర్థం చేసుకున్నట్లు కానవస్తుంది. అందువల్లనే సాంఘిక పరిస్థితులతోపాటు విద్యావిధానాలనూ, విద్యార్థుల ప్రవృత్తులనూ తీవ్రంగా విమర్శించి ఉన్నారు. విద్యావిధానంతోనూ, విద్యార్థి సామాన్యంతోనూ ఆయన చెప్పినవన్నీ సత్యదూరాలు కానేకావు.

తమ మనోభావాలను చక్కని పద్యాలలో వెల్లడించే నేర్పు మూర్తిగారికి బాగా ఉన్నది. ఆక్షేపణ, అధిక్షేపణ లేకుండా ఉంటే రచన ఎంతో హృద్యంగా ఉండేది. వసుత్కృతికోసం ప్రాచీన కవులు వర్ణించిన దేవతా వర్ణనలు ఏరి తీవ్రవిమర్శనకు గురికావడం అలా ఉండగా—దేవతలనే ఆక్షేపించారు.

'అవసరమ్మైనపు డమెరిక
కవయ్యె రష్యానుగూడి కదనంబున శా
త్రవుఁ జావఁదన్నునట్టులె
శివకేశవ రాజకీయ సిద్ధాంతములున్.'
(ప. 18.)

అని శివకేశవులను రాజకీయ నాయకులనుగాను అమెరికా, రష్యాలవారితో సరియైన వారినిగాను ఆక్షేప పూర్వకంగా చిత్రించారు రచయిత.

'బ్రహ్మసూత్ర గీతాదులు పండితులకు,
దేవతాకథ లల్ప ధీయుతులకు
నంచుఁ జెప్పఁజాలుట యాత్మవంచనంబు
పూర్వులెల్లరు ఘనులంట పొసఁగదెపుడు.
కుక్కలెల్ల చేరి కొట్లాడి చెఱచిన
విస్తరాకువోలె నిరిసె నొకటి;
ఊకదంచుపనికి నుద్దియైన దొకటి;
ఒక్కదానియబ్బ యొకటి యయ్యె.'
[ప. 32, 33]

అని ప్రాచీన వేదాంత, పురాణాదులూ, ప్రాచీనులూ నిశితంగా విమర్శింప బడినారు.

'సూతుండు శౌనకాదులకొ
శూలి నిజాంగనకో వచించె నీ
జాతిగ సం చనామకులు
వ్రాసిన వ్రాత లలాతజాలముల్
వాతలె కాని సద్గతికి
బాటలు కావని బల్లగ్రుద్ది ని
ర్భీతిగఁ జెప్పఁగల్గు నొక
వీరుఁడు గల్గుట యెన్నఁడో కదా!'

అని రచయిత పరితాప పడుతున్నారు, అట్టి వీరులు ఇప్పుడు ఎంతోమంది ఉండడం గమనించలేదేమో!

'నేటి మఠాధినాథులు' (మఠాధి పతులు) మహారాజులతో సమానంగా గజాంతైశ్వర్యాన్ననుభవిస్తూ ఉంటారనీ, వారు 'అజ్ఞాత మానవసేవా పరమార్థ తత్త్వ'లనీ నిందించడం (ప. 77) బాగులేదు. ప్రజాపాలకులైన రాజులకు వలె ధర్మపాలకులైన పీఠాధిపతులకు అవి అధికార చిహ్నాలు. సొంతానికి కావు. వారి నిత్యజీవన పద్ధతినీ, ఆహారాదులనూ గూర్చి ఎరిగి ఉన్నవారు ఇలా అనరు.

కొంగజపాలుచేస్తూ, పిల్లి మొక్కులు మొక్కుతూ గుళ్లోని రాళ్లను పూజించడం మతం కాదనీ, త్రికరణశుద్ధి కలిగి ఉండడమే ముఖ్యమనీ వీరన్నది సత్యం. ఏ మతమూ దీనిని కాదని చెప్పలేదు. ఏ మతమూ ఉండకూడదని చెప్పిన మూర్తి గారు 'ఒక సత్కార్యంబుఁ దత్క్రైస్తవో, ద్యతికిన్ దీటగుదానిఁ బూనరు' (ప. 78) అని క్రైస్తవ మతాన్ని మెచ్చుకోవడం చిత్రంగానే ఉన్నది.

వీరు విద్యార్థుల కిచ్చిన ప్రబోధం ప్రశస్తంగా ఉన్నది. అందులో రాజకీయాల కుంభకోణం, నాయకుల మోసం, ప్రభుత్వం తీరుతెన్నులు చూపబడినవి. సంస్కరింపబడవలసిన వెన్నో చెప్పబడ్డాయి. ముఖ్యంగాఁ 'ఆత్మవత్సర్వ భూతాని' అన్న సూత్రం తెల్పబడింది. దాన్ని అమలులో పెట్టే మొనగాడు రావాలి. ఒకడు చాలడు. అందరూ మొనగాళ్లే కావాలి. మానవకోటిలో అది సాధ్యమా? అన్నదే ప్రశ్న. ఏ సదుపదేశాలూ దానికి సమాధానం కాలేవు. కావలసినది కార్యశూరత!

తమ భావాలను విస్పష్టంగా చక్కని శైలిలో పద్యాల మూలంగా ప్రకటించగల సామర్థ్యం మూర్తి గారి కున్నది. పోతన్నగారి 'అలవైకుంఠ పురంబులో', పద్యాన్ని, శశాంక విజయంలోని 'ఈ యాకులపాటు చూచి, యిక నాకులపాటును–' అనే పద్యాన్నీ తీసుకుని రసభంగం లేకుండా సందర్భశుద్ధిగా చెప్పడం మెచ్చుకో దగినది.

ప్రాచీనాచారాలూ, పద్ధతులూ నచ్చకపోయినా రచయితకు ప్రాచీన సంప్రదాయ కవిత్వం నచ్చినది. అందువల్లనే సలక్షణమైన—రచన సాగింది. 'పార్వతీం ప్రతి శంకరోవాచ' (ప. 5.) 'అలక్షితాద్యతన పంథా పాంథులు' (ప. 77) 'ఓయి యువజనులు' (ప. 111) అని ప్రయోగిఁపబడినా కవితా ప్రవాహంలో అవి కానరాకుండా కొట్టుకొనిపోతాయి.

తమకు నచ్చిన యీ కృతిని గురించి మహబూబ్‌నగర్ కాలేజి ఆంధ్ర శాఖాధ్యక్షులు వల్లపురెడ్డి—బుచ్చారెడ్డిగారి సమీక్ష, పాటిబండ మాధవశర్మగారి అభిప్రాయం, సుహృద్భావంతో శతావధాని బాలబ్రహ్మచార్యులుగారు వ్రాసిన పద్యాలు దీని ప్రశస్తిని తెలుపుతున్నవి.

## రాగవీణ

(రచన: శ్రీ రాముడుగు—శ్రీ మన్నారాయణశర్మ, క్రౌను సైజు 14+48 పుటలు. వెల 2 రూ. నల్లగొండ సాహితీ మేఖల ప్రచురణ, ప్రతులకు—శ్రీ ఆర్. ఎస్. ఎన్. శర్మ, ఇంటి నెం. 8–1/147 గొల్లగూడ, నల్లగొండ.)

ఇది భగ్నప్రేమికుల విషాదగాథను వర్ణించే ఖండకావ్యం. స్మృతి, శ్రుతి, మధురస్మృతి, భగ్నశ్రుతి, అపశ్రుతి—అనే అయిదు శీర్షికలతో వివిధ సన్నివేశాలు ఇందు కన్నులకు కట్టేరీతిని వర్ణించబడినవి.

సుధేష్ణ ఒక శ్రీమంతుల యింటిబిడ్డ. అల్లారు ముద్దుగా పెరిగి తమ భవనంలో హంస తూలికా శయ్యపై పవళించే సుకుమార శరీర. పదకుండేళ్ల బాల్యంలోనే ఆమెకు బావపై ప్రేమ. వయస్సువచ్చి యౌవనం అంకురించగా ఆ ప్రేమ అనురాగంగా మారింది. అతనికీ ఆమెపై ఎంతో అనురాగం. ఆమె వీణమీటుతూ, రాగాలాపనచేస్తూ, పాడుతూవుంటే వింటూ ఆ బావ (పేరేమిటో చెప్పబడలేదు.) తన్మయుడై పోయేవాడు. ఒకనాడు వారిద్దరూ వినోదంగా విహరిస్తూ ఉండగా సుధేష్ణ తండ్రిచూచి 'బావ'ను ఒక గదిలోనికి పిలిచి, చీవాట్లుపెట్టి కొట్టాడు. యువకుడు చేసేది లేక గట్టిగా ఏడ్చాడు. ఆ ఏడ్పు సుధేష్ణకు కూడా వినిపించింది. ఆమె మనస్సు చాలా కష్టపడింది. యువకుడు ఇక తనకు సుధేష్ణ దక్కదని నిశ్చయించుకుని, విరక్తుడై కరుణానందుడనే బౌద్ధ సన్న్యాసికి శిష్యుడై, ప్రేమానందుడనే పేరుతో బౌద్ధభిక్షకుడైనాడు. కొన్నేళ్లు గడిచాయి. ఒకనాడతడు భిక్షం కోసం సుధేష్ణఉన్న యింటికే వచ్చాడు. ఆమె అతనికి భిక్షం పెట్టింది. కాని అతడే తన బావ అని పోల్చుకోలేకపోయింది. కొన్నాళ్లు గడిచాయి. అతడు భిక్షకు వస్తూనే ఉన్నాడు. ఆమె ఎప్పుడూ దైన్యంతోనే ఉండేది. ఒకనాడు—ప్రేమానందుడు సుధేష్ణను ఆమె విచారానికి కారణం అడిగాడు. ఆమె తన వృత్తాంతం యావత్తూ వివరంగా చెప్పింది. అతడు వెనక్కి తిరిగిపోతూ ఉండగా, పైమీది వస్త్రం జారిపోయి వీపుమీద పెద్ద మచ్చ కానవచ్చింది. ఆ సన్న్యాసి బావయే యని తెలుసుకుంది. అతని వెంటబడింది. అతన్ని వశం చేసుకోవాలని చూచింది. అతడు మనస్సు గట్టిచేసుకుని ఆశ్రమానికి వెళ్లిపోయాడు. కాని మనస్సు ఎంతో బాధపడుతున్నది. కరుణానందుడు దీనినంతా గ్రహించి 'బలవంతాన కోరికను చంపుకోకూడదు. వెళ్లు. నీకు వైరాగ్యం కలిగినప్పుడే రా. పోయి సుఖపడు. ఆశ్రమం నీ కెప్పుడూ ఆశ్రయ మిస్తుంది' అని పంపివేశాడు. ప్రేమానందుడు ఆనందంతో సుధేష్ణ మందిరానికి వెళ్లాడు. అర్ధరాత్రి. అంధకారమయం. కాళ్లకు వీణ తగిలింది. వంగిచూడగా ప్రియురాలి మృతదేహం కానవచ్చింది. ఎంతో విలపించి, మృతదేహాన్ని శ్మశానానికి తీసుకునిపోయి అగ్ని సంస్కారం చేశాడు. బౌద్ధారామం నుండి ప్రభాతగీతాలు వినిపించాయి ప్రశాంతంగా. అతనికి వివేకం కలిగింది. సిద్ధి పొందడానికి ధర్మపథమే మార్గమని తెలుసుకున్నాడు. కథ ముగిసింది.

'బౌద్ధధర్మమార్గాన నడచిన 'సౌందరనందం, ఆనందభిక్షువు' అనే కావ్యాల జాడలో (ఇది) నడచినట్లు కనబడుతుంది.....కావ్యం మొత్తం పరిశీలించగా భావకవులు అలవరుచుకున్న పద్యశైలి పద్యంలో బిగువు ఇందులో ప్రతిఫలిస్తున్నవి. సంప్రదాయ కవిత్వం ప్రతిభావంతంగా ఇచట సాక్షాత్కరిస్తున్నది' అంటూ శ్రీ అంబటిపూడి—వెంకటరత్నంగారు 'ఉపశ్రుతి'లో తెలియజేశారు. ఆయన ఉన్నమాటనే చెప్పారు.

ఒక్క ఉదాహరణ—

'చల్లని పిల్లవాయువులు
సాగిన కమ్మని పూలతావిలో
నుల్లము పల్లవింపఁగల
ఉజ్జ్వల మోహన వేణుగాన మ
ల్లల్లన వీనులంబడియె
ఆ సుషిరధ్వని వచ్చువైపుకే
మెల్లనలేచి వెళ్లితి భ్ర
మించిన నా హృదయానుయాయినై.'

(పుట. 24.)

రచన చక్కగా సాగింది. కథా సంవిధానంలో కొంత శ్రద్ధ తీసుకుంటే ఇంకా బాగుండేది. సుధేష్ణ తండ్రి 'బావ'ను తిట్టి, కొట్టినట్లు, 'బావ' ఏడ్చినట్లు కూర్చడం రసవంతంగా లేదేమో! తర్వాత ఆమె తండ్రి ఏమయినట్లు? ఆమె ఆ భవనంలో ఒక్కర్తె ఉన్నదా? ప్రేమానందుడు తానొక్కడూ సుధేష్ణ కళేబరాన్ని మోసుకొని శ్మశానానికి వెళ్లాడా?—ఇలాంటి సందేహాలకు అవకాశం ఉన్నది. వాటికి అవకాశం లేకుండా ఉంటే బాగుండేది.

శ్రీ అంబటిపూడివారూ, ఆచార్య దివాకర్లవారూ, డాక్టరు పాటిబండవారూ, డా. నారాయణరెడ్డిగారూ దీనిపైని సదభిప్రాయాలు ఇచ్చారు.

"ఆంగీరస"

## ముగ్ధ

(కథల సంపుటి)

(రచయిత: శ్రీ కొడవంటి కాశీపతిరావు. పేజీలు: 96; వెల: రు. 2–00. ప్రతులకు: (1) కథాసాహితి 3–5–43/1, రాంకోటి, హైదరాబాద్–1, (2) కొడవంటి కాశీపతిరావు, 9–7–46 తూర్పు బలిజవీధి, విజయనగరం, విశాఖజిల్లా.)

తొమ్మిది కథల సంకలనం ఇది: కథలన్నింటిలోనూ ఇతివృత్తం స్త్రీ, పురుషుల ప్రేమకు సంబంధించినది. ముగ్ధ కథలో మాష్టారు, భానుమతి వీళ్ళిద్దరిమధ్యా మూగతనంలో విఫలమయిన ప్రేమ కనిపిస్తుంది. భానుమతి మాష్టారిని ప్రేమించింది. మాష్టారు భానుమతిని ప్రేమించినట్లుగా కథలో ఆధారాల్లేవు. మాష్టారికి తన వృత్తిలోంచి బ్యాంకు ఉద్యోగంలోకి ప్రవేశం దొరికింతరువాత భానుమతిని మళ్లీ ఆయన చాలా కాలందాకా కలవలేదు. వాసు పెళ్ళిలో కలవడంతో కథంతా మాష్టారికి అర్థమయింది. అభిలాష కథానికలో చిత్తరంజన్‌కి కళ్యాణికి మధ్య విఫలత్వంపొందిన ప్రేమదర్శనమిస్తుంది. చిత్తరంజన్‌ది కళాహృదయం. సౌందర్యాన్ని ఆరాధించడమే అతనికి తెలుసును గాని అనుభవించడాన్ని గురించి అతనెప్పుడూ ఆలోచించలేదు. కళ్యాణిది అనుభవదృష్టి. చివరికి కళ్యాణికి వేరొకరితో పెళ్ళి అవుతుంది. భార్యాభర్తలు చిత్తరంజన్‌ని కలుస్తారు. కళ్యాణి తన ఆధిక్యాన్ని ప్రదర్శించడానికి చిత్తరంజన్ ఎదుట చిత్రంగా ప్రవర్తిస్తుంది. చివరికి తన పరాజయాన్ని అంగీకరిస్తుంది. చెప్పాలని ఉంది కథలో ప్రమీల, సత్యానందం భార్యాభర్తలు. ప్రమీల సత్యానందంతో తృప్తిచెందక చిదంబరంతో శృంగార జీవితాన్ని సాగిస్తుంది. ఇది సంజీవరావు కంటబడుతుంది. సంజీవరావు ఈ విషయం సత్యానందంతో చెప్పేలోపునే గుండెపోటువచ్చి మరణిస్తాడు. కథ అయిపోతుంది. అమానుషం కథ పిలుపుకి, చేతకిమధ్య వ్యత్యాసాన్ని చూపే కథ. షరీలా రమణమూర్తులు బి.యిడి. చదువుతున్నవాళ్ళు. రమణమూర్తి షరీలాను సిష్టర్, సిష్టర్ అని పిలుస్తూనే ఆమె శరీరంమీద సినిమాహాల్లో చెయ్యివెయ్యడం, పడిపోవడంలాంటిది చేస్తాడు. చివరికి వీళ్ళిద్దరికీ పెళ్ళి నిశ్చయమవుతుంది. మెట్లు కథ తనకంటె క్రింది వాణ్ణి పైవాడు ఎలా చూస్తాడో చెప్పే కథ. కళ్ళు కథలో ప్రేమలత అప్పలరాజుని చూసిన తక్షణమే ప్రేమిస్తుంది. కొన్నాళ్ళు అలాగే ప్రేమించి అప్పలరాజు ఎలిమెంటరీస్కూలు టీచర్ అని తెలియంగానే ఆ ప్రేమను బహిష్కరిస్తుంది. 'రిఫెన్డ్' స్త్రీ పురుషుల ప్రేమ మధ్య అనుమానానికి వింత అవకాశం ఉందో చెప్పే కథ. చుక్కాని ఒక నాయకి, ఒక నాయకుడు, ఒక ప్రతినాయకుడు మధ్య ప్రేమ కథ. గుల్‌బహారా కూడా ప్రేమ కథే.

ఈ తొమ్మిది కథలూ చదివితే ఈ రచయిత దృక్పథం ఏ పాఠకునికైనా తేలిగ్గా అర్థం అవుతుంది. రచయిత శ్రీ కొడవంటి కాశీపతిరావుగారికి కథాపరంగా

వస్తువు స్త్రీ, పురుష సంబంధమైన ప్రేమ తప్ప మరొకటి కనబడటం లేదనేది సుస్పష్టమవుతున్నది. ప్రస్తావనలో రాజేంద్రగారు 'తెలుగు కథానికా ప్రక్రియ శ్రీ కొడవంటి కాళీపతిరావులాంటి ప్రతిభావంతుల చేతిలో పడటంవల్లనే ఉత్తమమైన కథలు చదివే భాగ్యం తెలుగు పాఠకులకు కలుగుతోంది' అంటున్నారు. ఈ మాటలు రచయిత మీదున్న అభిమానాన్ని పురస్కరించుకుని రాసినవే కాని ఆలోచనాత్మకంగా రాసినవి కావు. ఉత్తమమైన కథ అని పిలవడానికి ఆ కథకు కావలసిన హంగులు చాలా ఉంటాయి. కాళీపతిరావుగారి కథల్లో 'ఉత్తమం' అనే లక్షణం కనబడటం కష్టం. 'చెకోవ్, ఓ హెన్రీ, మొపాసాలాంటి వారి కథల్లో కనిపించే సాంకేతిక ప్రావీణ్యం ఈ సంపుటిలోని కథల్లో కనిపిస్తుంది' అనడం చాలా అన్యాయం. పోగా ఈ కథల్లో 'సాంఘిక అవగాహన ఉంది' అని చెప్పడం మరీ ఆశ్చర్యం. అసలు ప్రామాణిక దృక్పథమే కథల్లో లోపించినపుడు సాంఘిక అవగాహనకు స్థాన మెక్కడ?

## సింహాద్రి స్వీట్ హోమ్

(కథల సంపుటి)

(రచయిత : సోదుం జయరాం పేజీలు : 139 వెల: రు 3-00 లు. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; ఏలూరు రోడ్డు; విజయవాడ—2.)

ఈ సంకలనంలో మొత్తం పదిహేను కథ లున్నాయి. దరిదాపు అన్ని కథల్లోనూ ఏదో ఒక కోణంలోంచి ఈనాటి సాంఘిక స్వరూప ఆవిష్కరణ జరిగింది. సింహాద్రి స్వీట్ హోమ్ కథలో సింహాద్రి పాత్ర చాలీచాలని జీతాలతో జీవితాల్ని గడుపుతున్న మధ్య తరగతి ఉద్యోగులకు ప్రతీక. తిరుగుబాటు కథానిక తండ్రి తరానికి కొడుకు తరానికి ఆలోచనలో, ఆచరణలో గల వ్యత్యాసాన్ని ధ్వనింపజేస్తున్నది. వరదయ్య నాగభూషణం తండ్రీ కొడుకులు. నాగభూషణంలో క్రమేపీ వచ్చిన మానసిక పరిణామం సామాజిక వ్యవస్థలో క్రమక్రమంగా వస్తున్న మార్పుకు నిదర్శనం. రాజీ కథ జీవితంలో ఆర్థికశక్తితో పోరాడి ఓడిపోయి ఆశక్తితోనే రాజీపడ్డ నిశాలిని జీవితానికి సంబంధించినది. అడవి కథలో సుందరమ్మ కూడా ఈ వ్యవస్థకు తన మానాన్ని కుదవబెట్టి అలాగే రాజీ పడుతుంది. యువకిశోరం ఆదర్శానికి, ఆచరణకి మధ్య గల భేదాన్ని తెలియజేసే కథ. ఇప్పటి యువతరంలో రెండు రకాల మనస్తత్వాలు కనబడుతున్నాయి. ఒకరు— వారాశించిన జీవితంకోసం సమాజాన్ని, తల్లిదండ్రుల్ని కూడా ఎదిరించగల సమర్థులు. దానికి తిరుగుబాటు కథలో నాగభూషణం పాత్ర ఉదాహరణ. మరొకరు— వీళ్లకి ఆదర్శాలయితే ఉంటాయి కాని ఆచరణలోకి వచ్చేసరికి తమ చుట్టూ ఉన్న అడ్డుగోడల్ని అధిగమించే శక్తి వీళ్లకి లేక ఆ గోడల్లోపలే ఉండిపోతారు. ఇలాంటి వారికి యువకిశోరం కథలో సుదర్శనం పాత్ర ఉదాహరణ. ఉద్యోగాన్వేషణ కథ ఇప్పటి ఇంటర్వ్యూల ఫార్సును తెలియజేస్తుంది. మనసూ—మదింపూ కథ వర్గ సమాజంలో మనుషుల మధ్య సంబంధాలు ఆర్థికమైనవే కాని హార్దికమైనవి కావని ఋజువు చేస్తుంది. మరుగుజ్జులు కథ ఆలోచనాపరంగా మన సాహితీవేత్తల ఎదగలేనితనాన్ని వెల్లడిస్తుంది. గూటిలో చిలుక, క్లైమాక్సు లేని కథ, లౌక్యుడు—ఆదర్శవాది, పెళ్లి మొదలైన కథలు ధనస్వామ్య వ్యవస్థలోని అన్యాయాలను విశ్లేషించి చూపించే కథలు.

ఈ కథ లన్నింటిలోను రచయితకు గల సామాజిక అవగాహన ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. పూర్వం గాని, ఇప్పుడుగాని, మరెప్పుడైనాగాని గొప్ప రచయిత అయినవాడు తన కాలంనాటి వాస్తవికతతోపాటు భవిష్యత్తును గూడా దర్శించ గలడు. అంటే రచయిత తన కాలాన్ని అధిగమించి కనీసం కొన్ని శతాబ్దాలు కాకపోయినా దశాబ్దాలయినా ముందుకు చూడగలగాలి. అలా ముందుకు చూడగలిగినప్పుడు తను జీవించే వ్యవస్థలోని లోపాలకు ఒక పరిష్కారం కనబడుతుంది. ఆ పరిష్కార మార్గమే అతని రచనా సిద్ధాంతంగా అతని రచనల పొడుగునా అంతర్వాహినిగా ప్రవహిస్తూ ఉంటుంది. రచయిత శ్రీ సోదుం జయరాంగారు తన కథల్లో తన కాలంనాటి వాస్తవికతకు నివాళు లెత్తారు. రాబోయే సమాజ స్వరూపాన్ని ఆయన ఊహించ లేదు. (ఇందులోని కథల దృష్ట్యా మాత్రమే) 'విశ్వం ముగించిన చోట రెజీనా జీవిత కథలో యింకా క్లైమాక్సు రాలేదు. ఇకముందు వస్తుంది అది. రెజీనా జీవిత కథలోని క్లైమాక్సుకు బీజం పడింది యిప్పటికి; అసలు క్లైమాక్సు ముందుంది. రెజీనా జీవితం తర్వాత యేమైంది అని ప్రశ్నించుకునేవానికి క్లైమాక్సు

ముందువస్తుందని 'తెలుస్తుంది' అని అంటున్నారు తాచమల్లి రామచంద్రారెడ్డిగారు పరిచయంలో. ఆ క్లైమాక్సు ఎలా వస్తుందో గెస్ చేసి పాఠకునికి ధ్వనిప్రాయంగా చెప్పడమే గొప్ప రచయిత లక్షణంగా నేను భావిస్తున్నాను.

శ్రీ టి ఎల్. కాంతారావు

# రాక్షసీ నీ పేరు రాజకీయమా

(నవల)

(రచన: ఆదివిష్ణు. ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం—మద్రాసు—సికింద్రాబాదు. పేజీలు: 160. వెల: రు. 2—50 పైసలు.)

ప్రేమ ప్రేమ అని గగ్గోలుపెట్టే కాలంలో ఆ ప్రేమ మోతాదు తగ్గించి రాజకీయాన్ని సెటైర్ చేసి ఆదివిష్ణు ఒక చక్కని నవల వ్రాశారు. దాని పేరు 'రాక్షసీ నీ పేరు రాజకీయమా.'

వంద పేజీలవరకు కాళ్ళు లేకుండానే కథ సాగింది. తరువాత కాళ్ళువచ్చి నడక సాగించింది. తిమ్మాపురానికి రామదాసు ప్రభువు. అంటే గ్రామానికి సర్పంచిలా ఉన్నాడు. అనుచరులు కుక్కల్లా వెంట తిరిగారు. వారందరూ ఆయన కరుణవల్లనే బ్రదికి బట్టకట్టారు. కాని రాజకీయాల్లో అంద వేసిన చేయి. రాజకీయంలోనే మేడకట్టి కారులో షోకిల్లాలా తిరిగాడు. మోసం, క్రౌర్యం పుట్టుకతో వచ్చాయి. ఒక స్త్రీని బలాత్కారం చేయుటంతో రాజకీయ ప్రపంచంలో అడుగుపెట్టాడు.

రామదాసుకు చిరంజీవి కుమారరత్నం. అన్ని విషయాల్లో తండ్రివంటివాడే కుమారుడు. తాను చేసిన ఘనకార్యాల మాటున ఉన్న దగా, మోసాలను అ ఆ లతోపాటు అబ్బాయికి నేర్పాడు. పుత్రుడు పెరిగి పెద్దవాడవుతూంటే తండ్రి సంతోషించాడు. చిరంజీవి సుమతికి ద్రోహం చేశాడంటే రామదాసు నవ్వుకొన్నాడు. ఎందుకంటే చదువుకొనే రోజుల్లో తాను సీతను మోసంచేసి జీవితాన్ని నాశనం చేశాడు. తనకంటే కొడుకు రెండాకు లెక్కువ చదివాడని మురిసిపోయాడు. రామదాసు సీత అడ్రసు తెలిసికొని ఆమె దగ్గరకువెళ్ళి తనదగ్గరకు రమ్మన్నాడు. ఆమె తిరస్కరించింది. ఆ తిరస్కారమే రామదాసులో మార్పు తెచ్చింది. అంతేగాక ఎదుటి మనుష్యుని అర్థంచేసుకొని సానుభూతి చూపింపగల సమర్థుడయ్యాడు.

చిరంజీవి సుమతికి అన్యాయం చేశాడు. ఆమెను గర్భవతిచేసి పెళ్ళిచేసుకొంటానని మాట యిచ్చాడు. కాని వెంటనే మాటప్రకారం జరగలేదు. సుమతి స్నేహితుడు ప్రసాదం. చిరంజీవి చేసిన తప్పుడు పని సుమతి వల్ల విని దానికొక పరిష్కార మార్గంకొరకు రామదాసుదగ్గరకువెళ్ళి పరాభూతుడై వచ్చాడు. ప్రసాదం మాటలు రామదాసును రామునికి దాసుగా తయారు చేశాయి. పూర్వంలోచేసిన దౌర్భాగ్యపు పనులకు పశ్చాత్తాపపడ్డాడు. ఆ పశ్చాత్తాపం చేతనే రాజకీయ జీవితానికి రాజీనామా చేసి, చిరంజీవి ప్రాభవంవల్ల గర్భం ధరించిన సుమతిని కోడలుగా స్వీకరించి యావదాస్తి ఆమె పేర వ్రాయించి తనవలన సీతకు జరిగిన అన్యాయాన్ని తుడిచివేసి కొనాలని తహ తహపడ్డాడు. తనకు పుట్టిన బిడ్డల్లో మార్పు చూశాడు. ప్రసాదం వివేకి. చిరంజీవి అవివేకి. చిరంజీవి తన చేతుల్లో పెరిగాడు. ప్రసాదు సీత చేతిలో పెరిగాడు. తిరస్కారంతో రామదాసులో మార్పువచ్చి మానసిక వ్యథతో క్రుంగిపోయాడు. రామదాసు బ్రదికి చచ్చిన మనిషి. సీత మరణించి జీవించిన యిల్లాలు.

కథ విషాదాంతం. విషయం సమాజంలో పేరుకొన్న దౌష్ట్యం. ఈ నాటి యువతరంలో కన్పించే స్వరూప స్వభావాలు చిరంజీవిలో ప్రతిబింబించాయి. పట్నం చదువులు ప్రారంభమైన తరువాత సామాన్యంగా విద్యార్థిలో వికృత భావాలు చెలరేగుతాయి. ముఖ్యంగా కాలేజీ ఎలక్షన్సులో పాల్గొనటం, ప్రేమ వ్యవహారంలో తలదూర్చటం మున్నగు ఘటనలు జరుగుతూంటాయి. నవలలో యీ విషయాలు చాల స్వభావ సిద్ధంగా ఉన్నాయి. చిరంజీవి యీ నాటి విద్యార్థికి ప్రతిరూపం. మంచి చెడు తెలియక యౌవనోద్రేకంతో కళ్ళు మూసికొని ప్రవర్తించే వారికి అతని ప్రవర్తన ఒక ఉదాహరణ. చిరంజీవి వంటి కుర్రవాళ్ళుంటే సమాజం నాశనమగుటయే కాని అభివృద్ధి చెందదు. ధనం పేరుతో అహంకారంగా ప్రవర్తించి పదవి సంపాదించటమే ధ్యేయంగా భావించే మహానుభావు లున్నంతకాలం యీ ప్రజాస్వామిక ప్రభుత్వ

నికి పతనంతప్ప మరోమార్గం లేదని రచయిత అభిప్రాయం.

రామదాసు యీ కాలపు రాజకీయవేత్తకు దర్పణం. అతనిలో ఉన్న అవలక్షణాలన్నీ నేటితరం రాజకీయవేత్తలో కరుడుకట్టి ఉన్నాయి. అతడు దగా, మోసాలను వింతగా నిర్వచనం చేశాడు. రాజకీయంలో నటన ముఖ్యమన్నాడు. అందం నెత్తిపైన చేతులు పెట్టి అణచి బానిసలగా మార్చుకోనమని, పైకి పెద్దమనిషిగానుండి తప్పుడు పనులు చేయమన్నాడు. అసలు యీ రామదాసులాంటి రాజకీయవేత్తలే ఆంధ్రోద్యమాన్ని కుక్కచింపిన విస్తరిగా తయారు చేశారు. అయితే యితనిలో పశ్చాత్తాపం ఉన్నది. ఆ పశ్చాత్తాపంవల్లనే పాఠకులకు కథాంతంలో అతనిపై సానుభూతి కలగటాని కవకాశమేర్పడింది. సీత మరణానికి రామదాసే కారణం. ఇతడు తిన్న యింటికే వాసాలు లెక్కపెట్టాడు. ఆమె దీనస్థితి యితన్ని మనిషిగా మార్చింది. రాజకీయానికి తరతమా లుండవు. ఏ పనినైనా అవలీలగా చేయిస్తుంది. అవసరం వస్తే ప్రాణం కూడ తీయిస్తుంది. మార్పు తీసికొని రావాలన్నా అదే తీసికొని రాగలదని చెప్పటకు రామదాసు రాజకీయాలే సాక్ష్యం.

స్త్రీ పాత్రలలో సీత, సుమతి బ్రదికి చెడిన వారని చెప్పటకు వీలులేదు. సీతను రామదాసు గర్భం చేసి వివాహ మాడటానికి జంకితే ఆమె ఏకాంత జీవితాని కలవాటుపడి కన్న కొడుకును ఉత్తమునిగా తీర్చి సమాజంలో ఒక వ్యక్తిగా జీవించుటకు చోటు చూపించి కన్ను మూసింది. సుమతి రామదాసు పుత్రుడైన చిరంజీవి చేత గర్భిణీ అయి అతన్నే వివాహ మాడింది. వీరిద్దరిలో ఎవరు గొప్పంటే ఎవరికి వారు గొప్ప. అయితే సీత సాధింపలేక మరణించింది. సుమతి సాధించి చిరంజీవి భార్యయై రామదాసు ఆస్తికి వారసురాలయ్యింది. సీతలో పట్టుదల అధికం. సుమతిలో సడలిన ప్రవర్తన అమితం. సీత బలాత్కారం చేయబడ్డది. సుమతి బలాత్కారం లేకుండా చిరంజీవితో కాలాన్ని నిర్ణయించుకొన్నది. ఆధునిక యువ స్త్రీ సమాజానికి సుమతి ప్రతీక. ఆశయం, ఆదర్శం కాలదన్నలేని నారీ సమాజానికి సీత ప్రతినిధి. ఆచరించిన పనులను బట్టి చూస్తే సుమతి గుణశీలాలు వికృతమైనవి. ఆ అవస్థలో పడిన స్త్రీ జీవితం అంతేననిపిస్తుంది. సీతలాంటి యువతులు నేటి సమాజంలో ఉన్నను మరణించటమనేది ఆశ్చర్యంగా ఉన్నది. రచయితే ఆమెను చంపారు.

రచయిత కథకంటే సైటెర్‌కు ప్రాముఖ్యమిచ్చారు. ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని మిడిమిడి జ్ఞానం కల్గిన రాజకీయవేత్తలు విచిత్రమగు రీతిలో వ్యాఖ్యానిస్తున్నారు. ఆయా పద్ధతులు చూచి రచయితకు మంట మండినట్లున్నది. అందువల్లనే యీనాటి రాజకీయ వాతావరణాన్ని హేళన చేశారనిపిస్తుంది. రామదాసు వంటి రాజకీయవేత్తలో వచ్చిన మార్పు రాగల్గితే యీ దేశం యింకా ముందుకు పోవటాని కవకాశం ఉంటుంది. పదవికి ప్రాకులాడే నాయకులు చిరంజీవిలా సంఘానికి చీడపురుగులే కాని మరేమి కాదని ఆదివిష్ణు నొక్కి వక్కాణిస్తున్నారు.

నవలలో రెండుమూడు సంఘటనలు అసహజంగా ఉన్నాయి. అదేమంటే—సుమతి విశృంఖలంగా ప్రవర్తిస్తూ చిరంజీవి లాంటి బంగారు పిచ్చుకల మధ్య సంచరిస్తూంటే రాబోయే పరిణామాలను ఆలోచింపక తల్లి కుమార్తెను హెచ్చరిక చేయకుండా ఉండగలదా అంటే సందేహం కలుగుతుంది.

మొదటినుండి చివరివరకూ కన్నతల్లే అయినా తాను అక్కనని కన్నబిడ్డకు చెప్పి తన్ను తాను మోసం చేసికొని బిడ్డను మభ్యపరచటం చిత్రంగా ఉన్నది. సీత — రామదాసు సంగతి ఊరి వారికి తెలియకుండా ఉంటుందా. ఉంటే కన్నబిడ్డయైన ప్రసాదం చెవిని పడకుండా రహస్యం దాగి ఉన్నదా? వీని యన్నింటిని కాదని రచయిత సీతను అక్కగానే చూపించటంచేత లోపం కాన్పిస్తున్నది. అక్క అని చెప్పి నప్పించటం రోజులవరకే పరిమితం. సీత జీవితంలో సంవత్సరాలు దొర్లినా అక్క అని ప్రసాదం నమ్మటం అవాస్తవికంగా కానవస్తున్నది.

తండ్రి ఎప్పుడూ కుమారుని అభివృద్ధిని కాంక్షించేవాడు. కుమారుడు తండ్రిపేరు పైకి తేవాలనుకొంటాడు. కాని చిరంజీవి రామదాసును కన్న తండ్రిగా ఊహింపక పరాయి వ్యక్తిగా ఊహించి తను పెరిగి పెద్దవాడవుతున్నాననే అసూయ తండ్రిలో ఉన్నదనుకొంటాడు. ఏ విషయంలో అయినా జరుగు

ఉండేమో కాని రాజకీయ విషయంలో యిలాగ జరగదు. కాకలుతీరిన రాజకీయవేత్తల కుమారులీవిధంగా అనుకోరు గదా. ఎందుకీవిధంగా రచయిత కల్పించినట్లీ ఘటన ?

ఆధునిక సమాజంలో గూడుకట్టుకొన్న రాజకీయాలకు, రాజకీయవేత్తలకు పట్టిన తుప్పును రాల్చి సక్రమంగా నడుచుకోమని హెచ్చరించారు రచయిత. రచనలో క్రొత్తపోకడ ఉన్నది. కథను ప్రేమతో ముడిపెట్టక విసుగులేని రాజకీయాలను తూర్పారబట్టి నాయకులకొక మార్గాన్ని చూపించి ఆ మార్గాన పయనించమని ప్రబోధించారు. ఈనాడు వస్తున్న నవలల్లో యీ నవలదొక ప్రత్యేకమార్గమని చెప్పవచ్చును. వారినుండి యింకా మంచి నవలలు రావచ్చునని ఆశింపవచ్చును.

— శ్రీ రామమోహన్.

## స్వీయ జీవిత సమీక్ష

(రచన : కామరాజు హనుమంతరావు వెల : రు. 8. ప్రచురణ : ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల కార్యాలయము, దానవాయిపేట, రాజమండ్రి—3).

స్వీయ జీవితం అనలేదు ఈ గ్రంథకర్త. జీవిత చరిత్ర అని అయినా అనలేదు. స్వీయ జీవిత సమీక్ష అనే శీర్షిక నెంచుకున్నారు శ్రీ కామరాజు హనుమంతరావు. ఉద్దేశ పూర్వకంగానే యీ శీర్షిక నెంచుకొని ఉంటారు శ్రీ హనుమంతరావు. వారి జీవిత చరిత్రనే సమీక్ష చేసుకున్నారు శ్రీ హనుమంతరావు. సమీక్ష మాత్రమే సుమా. అయితే వస్తునిష్ఠంగా జరిగిన సమీక్ష ఇది.

'ప్రజలను ఉద్దీపింపజెయ్యాలి. కార్యోన్ముఖులను జెయ్యాలి. అటువంటి జీవిత కథకు సాహిత్య విలువల దృష్ట్యా కాకపోయినప్పటికీ, సార్వజనీనత కారణంగా ప్రయోజనం ఉంటుంది. అనన్యత, అపూర్వత అవచ్ఛిన్నత వంటి కావ్యగుణా లన్నింటికంటే సార్వజనీనతకే అధికప్రాముఖ్య మివ్వాలి జీవిత చరిత్రలో.' ఈ దృష్టితో 313 పుటల స్వీయ జీవిత చరిత్రను పాఠకులు పరిశీలించదగును.

మాతృపితృదేవులు, గురుదేవులు, సోదరీ సోదరులు, స్వాతంత్ర్యము, అంతర్వాణి, తీవ్రపరిశోధనలు, ధర్మపథము, కేతవరం ఆంధ్ర లక్ష్మీ విద్యాలయము ఆంధ్రబ్రహ్మ సాధనాశ్రమము, కాకినాడ బ్రాహ్మ సమాజము, రాజమహేంద్రవరం హితకారిణీ సమాజము ప్రాక్ప్రతీచీ గ్రంథమాల, సర్వమత సమ్మేళనము గృహస్థ జీవనము, వ్యక్తిగత జీవనము, భక్తి కవితా స్రవంతి అనే పదహారు అధ్యాయాలున్నాయ్ ఈ పుస్తకంలో.

'మానవ స్వభావములందు తారతమ్యములు మనము గాంచుచున్నాము. వాటినిబట్టి ధర్మజీవము నందు పెంపొందుటతో తారతమ్యములు మానవుల నడుమ నేర్పడును' అన్నారు రచయిత పరిచయము రెండవ పుటలో; అయితే మరి స్వభావములలో యీ తారతమ్యములు ఏర్పడడానికి కారణ మేమిటి? అవి ఎట్లు పోవును? ఈ ప్రశ్నలకు (బ్ర) (బ్రా)హ్మ సమాజ సిద్ధాంతం చెప్పే సమాధానా లేమిటి? మానవ స్వభావములోని తారతమ్యముల నంతరింప జేయడం సాధ్యమని ఈ సిద్ధాంతావలంబకులు అంగీకరించుతారా? అంగీకరించే పక్షంలో ఎంతమంది మానవుల స్వభావాన్ని, కనీసం తెలుగునాట, యీ ఉద్యమం మార్చగలిగినది ?

'ఇదంతయు ఈశ్వరానుగ్రహము' అనే సిద్ధాంతము నంగీకరించి, దానికే కట్టుబడి, దాన్నే అమలు జరిపే పక్షంలో తుది బ్రహ్మసమాజంవంటి ఉద్యమాల లక్ష్యం యేమిటి ? ప్రయోజనమేమిటి ?

సమాజంలోని ఒక వర్గాన్ని ప్రోత్సహించి, మరొక వర్గాన్ని లేదా మరికొంతమందిని నిర్లక్ష్యం చెయ్యడం, లేదా ఒక సమస్యను పరిష్కరించేందుకని చేసే కృషి ఫలితంగా మరోలక్ష సమస్యలకు ఆస్కారమివ్వడం ఒక ఉద్యమానికి ప్రాతిపదిక అయిన సిద్ధాంతం బలహీనమయినదని కాలం రుజువు చెయ్యలేదా ?

ఈ రచయిత తండ్రి శ్రీరామభక్తుడు. ఆ భక్తి ఎక్కువై ఎవరికి చెప్పక ఇల్లు విడిచి దేశాటనముచేసి భక్త సింగారిదాసుగా ఇంటికి తిరిగి వచ్చెనట. తండ్రికి గల భక్తి ఈ రచయిత మనస్సుపై చిన్ననాటినుండియు పనిచేసెను. శ్రీ హనుమంతరావుగారి సోదరి సవతి పుత్రుడు పెదబాపయ్య. గొప్ప సంస్క

రణవాదిగా పేరుపొందెను ఆ రోజులలో. గమనించ వలసన అంశమేమిటంటే – సంస్కరణలుగా, విపరీత ములుగా ఒకానొక కాలంలో పరిగణించబడే పద్ధతులు ఆ తరువాతి కాలంలో మామూలు పద్ధతులుగా లేదా సామాన్యములుగా మారిపోవును. అంతమాత్రానసే ఆయా పద్ధతులను తొలుత ప్రారంభించిన వ్యక్తుల ప్రాముఖ్యమెంతమాత్రమూ తగ్గజాలదు. అట్లని ఆయా వ్యక్తులను దేవుళ్ళుగా భావించడం కూడా సమంజసం కాదు. ఈ సింగరిదాసు బ్రహ్మానంద సరస్వతిగా మారెను. బాపట్ల చేరువలో యీ బ్రహ్మానంద సరస్వతి ఆరాధన ప్రతిసంవత్సరమూ జరుగుచుండునట. ఇట్టి ఆరాధనలు బ్రహ్మ సమాజ సిద్ధాంతమున కనుగుణ మయినవా ?

'గురువు' అంటే ?

'సామాన్య మానవులను అద్భుతరీతిని థమ దర్శనముచేతనో స్పర్శచేతనో ఆశీర్వచనముచేతనో యుత్తమ వర్తనుల జేయగల సుప్రసిద్ధ గురువులు అచ్చట గలరని మనము వినుచుందుము' అన్నారు రచయిత 21 వ పుటలో. అంతవరకూ బాధ లేదు కానీ, 'ఎవరికైన గురువులు ఇద్దరో ముగ్గురో అంతకంటే నెక్కువ మందియో యుండ వచ్చును. ఒక్కరే గురువుగా నుండవలెనని తలంచుట మంచిది గాదు.' ఇది చర్చనీయాంశము. అందు నా బ్రహ్మ సమాజ సిద్ధాంతమునందు నమ్మకము గలవారు ఈ నిర్వచనాన్ని ఆమోదించుతారా? ఆమోదించే పక్షంలో బ్రహ్మ సమాజంలో ఇన్ని వర్గాలు ఈనాడు ఆంధ్ర దేశంలో యేర్పడి ఎవరికి వారే యమునా తీరేగా వ్యవ హరించుట ఏవిధంగా సమర్థనీయము?

'ఆయనయే నన్ను మొదట ప్రేమించి, దగ్గ రకు చేర్చుకొనెను' 24 వ పుట. ఈ వాక్యంలో ప్రేమ దగ్గరకు చేర్చుకొనెను అనే మాటలలో రచయిత ఆశించి, ఉద్దేశించిన అర్థానికి భిన్నమయిన అర్థం వచ్చే అవకాశం లేదా? విజ్ఞులూ, అనుభవజ్ఞులూ అయిన హనుమంతరావుగారు తెలుగు మాటలను ఉప యోగించడంలో మరికొంత జాగ్రత్త వహించడం అవ సరం కాదా?

బాపట్లలో 1902 వ సంవత్సరంలో బ్రహ్మ సమాజోద్యమపు ఆందోళనలో ఈ రచయిత తగు లొన్నెనట. (49 వ పుట) ఇక్కడ తగుల్కొను అనే మాటలో అంత ఔచిత్యం కనిపించదు. వాక్యార్థ మును బట్టి ఆ మాటను ప్రయోగించడం సరిగ్గానే ఉన్నదని వాదించవచ్చు. అది వేరే సంగతి. తగుల్కొను అను మాట వాడుకలో వేరో అర్థం ఉన్నదని హను మంతరావుగారికి తెలియదని ఈ సమీక్ష రాస్తున్న రచయిత అనుమానించడం లేదు.

ఈ రచయితతో కలిసి ఈ ఉద్యమంలో పని చేసిన పాలపర్తి నరసింహము, కోటంరాజు పున్నయ్య, మతుకుమిల్లి సుబ్బారావు, వేదాంతం వెంకటకృష్ణయ్య, మల్లాది వెంకటేశ్వర్లు, బొడ్డుపల్లి రాఘవయ్య, కొమరవోలు రాజయ్యగారలు. ఎవరి దోవ వారయినది ఈనాడు వీరందరిదీ. అనగా బ్రహ్మసమాజ సిద్ధాంతం కాలానుగుణంగా మారిపోయినదని అర్థమా లేక వైవిధ్యానికి ఈ సిద్ధాంతంలో ఆస్కారం లేని కార ణాన, వ్యక్తిత్వాన్ని సిద్ధాంతంతో సమన్వయం చేసుకో లేదని కారణాన ఎవరి దోవన వారు పోయిరని అర్థమా?

స్వర్గీయ నేతి చలపతిరావుగారు నండూరు గ్రామంలో శ్రీ కొమరాజు హనుమంతరావువద్ద విద్యా భ్యాసం చేసెనట. అది ఎన్ని సంవత్సరాల కిందటి మాట? బాపట్ల తాలూకా నండూరు గ్రామంలో ఉపాధ్యాయుడుగా పనిచేసిన రోజులలోనే వీరేశ లింగముగారి గ్రంథములతో పరిచయం కలిగినదట శ్రీ హనుమంతరావుగారికి. వితంతూద్వాహమును గురించి నండూరులో ఆ రోజులలో పండిత సభ ఒకటి జరిగెను. ఆ తరువాత గుంటూరు వంటి పట్టణాలలో అటువంటి సభలు జరిగెను. వీటి ఫలితంగా యీ రచయిత ఆలోచనలలో మరికొంత మార్పు కలిగెను. బాపట్లలో జరిగిన ఒక సభలో పూర్వాచారములను ఈ రచయిత తీవ్రముగా ఖండించగా, బాపట్ల హైస్కూలు హెడ్‌మాస్టరు శ్రీ పంచాపకేశ అయ్యరు గారికి ఆగ్రహం కలిగెనట. ఇంతకూ శ్రీ శంకరా చార్యుల వారిని ఆక్షేపించగల మేధాశక్తి శ్రీ పాలపర్తి నరసింహంగారికి ఆ రోజులలోనే కలిగెనా? పూర్వా చారము లనగానేమో ఆ రోజులలోనే శ్రీ హనుమంత గారికీ శ్రీ పాలపర్తి నరసింహంగారికీ నిజంగా తెలిసి ఉండిన పక్షంలో భూమిగుండ్రంగా ఉన్నట్లు వీరి ద్దరి జీవితాలూ ఇప్పుడున్న తీరున ఉండేవా?

అంతర్వాణి

మనస్సు ఏ మాత్రము యోచింప లేకుండెను. ఊరక విశ్రాంతిగ నేలపై గూర్చుంటిని చల్లనిగాలి తలకు తగులుచు నించుక నుల్లాసము గూర్చుచుండ నండూరు జీవితము ఒక యద్భుత ఘటనగ మదికి తట్టెను. నన్నచట సురక్షితముగ... ..ధర్మ పదమే' 72 వ పుట. ఇది ఏ యాచారముననుస రించిన అనుభవము? పూర్వాచారములను ఖండించే వ్యక్తిలోగల ద్వయీ భావము కాదా! ఈ అనుభూతి నుంచి పాఠకులు నేర్చుకొనవలసినదేమి? ఇట్టి అను భూతుల వర్ణన ఎవరికి ఏ విధంగా ప్రయోజనం కలుగును?

'రసోవైసః',

అను మంత్రమునకు దోడుగ 'ధర్మంచర' అను మంత్రమును మానవుడు మది నుంచుట యత్యా వశ్యకము 85 వ పుట. ఇదియు స్మార్త ధర్మమే. ఆ వైదిక మతమే. ఇందు బ్రహ్మ సమాజ సిద్ధాంతము నకు సంబంధించిన ప్రత్యేకత యేమి?

బ్రహ్మ సమాజంలోగల పరస్పర వైరుధ్యాలను శ్రీ హనుమంతరావుగారు 93 వ పుటలో కొంత ప్రస్తావించిరి. వారి అనుభవంనుంచి వెలువడిన ప్రస్తావన అది. శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడు, కందుకూరి వీరేశలింగము పంతులుగారు టంగుటూరి శ్రీరాములుగారు. నాళము కృష్ణారావు గారు, అత్తిలి సూర్యనారాయణగారు, కారుమూరి కామరాజు ప్రభృతులతో యీ రచయితకు పరిచయాను భవాలున్నవి. ఆ కాలం అట్టిది. తదనుగుణంగానే యీ రచయిత ప్రవర్తించి ఉండవచ్చును.

(1) '12-5-06 కా. హ. రా. యజ్ఞోప వీతము తిరిగి వేసికొనెనని కలగంటిని.'

(2) '14-5-06 హనుమంతరావు యజ్ఞోప వీతము తిరిగి వేసికొనెనని వింటిని. '97 వ పుట ఈ యజ్ఞోపవీతం గురించి ఇంత గొడవ దేనికో? యజ్ఞోపవీతం లేని బ్రాహ్మణులు ఎంతమంది లేరు కనుక ఈనాడు. డ్రాయర్లు, బనియన్లు, స్వెట్టర్లు, బ్లవుజ్‌లు...ఇంకా యింకా పలురకాల అలంకరణ లున్నవి గదా. వాటిలో ఒకటి యజ్ఞోపవీతం అని అను కుంటే సరిపోదా? 'అట్లా కాదు. ఒక రకం తాత్విక చింతనకు చిహ్నం యజ్ఞోపవీతం. ఈ కాలానికి పనికి రాదు ఆ తాత్విక చింతన' అని భావించుచో తదను గుణమయిన వాదన చేయవలెను గదా? యజ్ఞోపవీతం దేనికి? దాన్ని వేసుకున్నవారు ఏమి చెయ్యాలి? ఎంత మందికి తెలుసు ఈ రోజులలో. తెలిసినా ఆ ఆచారా లన్నీ పాటించుతూ కూర్చుని వినేందుకు ఇనాము లున్నవా? అగ్రహారా లున్నవా యీనాడు? అనూచా నంగా వస్తున్న పద్ధతులలో ఒకటి అయింది ఉప నయనం. చేసినవారు చేస్తున్నారు. లేనివారు లేదు. ఈ గొడవ ఇంతటితో ఆపడం వివేకమూ, హేతు వాదమునకు అనుగుణమూ ననుకుంటాను. పాత దేవుళ్లను తొలగించి కొత్త దేవుళ్లనూ కొత్త బ్రాహ్మణులనూ సృష్టించడమే సంస్కరణ అనే వారికి నా నమస్కారములు.

కాలజ్ఞానము

గతంలోనుంచి ప్రస్తుతం — ప్రస్తుతంలోనుంచి భవిష్యత్తు—ఇది కాలగతి. కాలప్రవాహము ఇందులో ఎవరి పాత్ర వారికి. అయితే విచిత్ర మేమిటంటే ఎవరికో ఎక్కడో ఎప్పుడో ఏదో ఒక అనుభూతి గలు గును. ఆ అనుభూతియే సత్యమని ఆ వ్యక్తి నమ్మును. దాన్ని ఇతరులు కూడా నమ్మునట్లు చేయుటకు యత్నించును. ఇదియే మానవ సంకల్పం. ఈ సంకల్పం బీజముగా ఉద్యమములు రూపొందెను. అంతకంటే ప్రయోజనకరమయిన నమ్మకాలు మన సానుభూతి నుంచి రూపొందినప్పుడు అంతవరకూ చలామణీ అవుతూ వచ్చిన నమ్మకాలు వాడిపోతయ్. అంతరించి పోతయ్. ఈ గ్రంథం 7 వ ప్రకరణం—ధర్మపథము గురించి ఇంత చెప్పవలసివచ్చినది.

'వివాహము జరిగిన ఆరు సంవత్సరముల తరు వాత పంతులుగారు వ్రాసిన తమ స్వీయ చరిత్రలో నా వివాహమును గూర్చి కొన్ని విషయములు విపరీత ముగ వ్రాసిరి......విరమించుకొనుచున్నాను' 126 వ పుట. వితంతూద్వాహోద్యమంలోని పరస్పర వైరు ధ్యాలూ బలహీనతలూ ఈ ప్రకరణంలో ప్రస్తా వితము లయినవి. వీటివల్ల సమాజానికి కొంతయినా ప్రయోజనం కలదనుకొంటాను.

హితకారిణీ సమాజం, ధర్మసాధని పత్రికల నిర్వహణలో శ్రీ హనుమంతరావుగారి కృషి ప్రశంసనీయం. వితంతు వివాహం, వర్ణాంతర వివాహం వంటివన్నీ స్వాతంత్ర్యోద్యమంలో భాగములే. కావున సంస్కరణ మహాసభకు 5-6-1929 న దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు అధ్యక్షత వహించి, ఇద్దరు వితంతువుల పోషణమునకు వలసిన సొమ్ము నిరాశపూర్వకముగ నిచ్చుటకు అంగీకరించి అటుల నొసంగుచు వచ్చుట—205 వ పుట -సమంజసమే.

'పరిశుద్ధాస్తిక పద్ధతిని వివాహము జరుపగోరిరి' 209. పరిశుద్ధాస్తిక వివాహ పద్ధతి అననేమి? వైదిక వివాహ మంత్రాలలో నేటి కాలానికి పనికిరానివి చాలా ఉన్నవని విజ్ఞులంటుంటారు. అట్టి భాగాలను తొలగించి, సరయిన వివాహ పద్ధతిని రూపొందించేందుకు పండితులు ఎందుకని యత్నించరూ? ఆ విధంగా సంస్కరించడం తప్పవుతుందా? తప్పయితే ఏ ప్రమాణాన్నిబట్టి? వివాహాన్ని చట్టం ప్రకారం నమోదుచేసే పద్ధతి సరయిన దవునా కాదా అనే మీమాంసకు అస్కారమే లేదు గదా! అటువంటి సంస్కరణలకు చోటివ్వని ఇరుకయినదా వైదిక వివాహ విధానం? వివాహ విధానానికీ, దేవుడికీ సంబంధమేమిటీ! దైవసాక్షిగా అనే బదులు చట్టం ప్రకారం అంటే తప్పవుతుందా? దైవదూషణ మవుతుందా మారుతున్న వర్తమాన సమాజ వ్యవస్థలో?

కామరాజు హనుమంతరావుగారి జీవితం గురించి తెలుసుకునే దృష్టితో కాక, ఆంధ్రలో బ్రహ్మసమాజం తీరుతెన్నులతో పరిచయ మేర్పరచుకొనదలిచేవారికి కొంత ఉపయోగపడుతుంది. ఈ పుస్తకంలో కొంతమంది వ్యక్తులు—నాయకులను గురించిన ప్రస్తావన మరి కొంత వివరంగా యీ పుస్తకంలో జరిగి ఉంటే బాగుండేది కదా. ఆయా నాయకులను గురించి ఎటూ ప్రస్తావించారు గదా హనుమంతరావుగారు! అటువంటప్పుడు మరికొంత వివరంగా రాజారామ్‌మోహన్ రాయ్, దేశిరాజు పెదబాపయ్య, ముట్నూరి కృష్ణారావు, కందుకూరి వీరేశలింగం వంటివారిని గురించి వ్రాయడం అప్రస్తుత మవుతుందా? అసందర్భ మవుతుందా?

శ్రీ వి. ఎస్. అవధాని.

## లియొనిద్ బ్రెజ్నేవ్

(వెల : 7 రూపాయలు. విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.)

లియొనిద్ బ్రెజ్నేవ్ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి. ఇటీవలనే 1973 నవంబరు చివరలో ఆయన భారతదేశం సందర్శించేరు. ఆ సమయంలో సోవియటు భారతదేశాల మధ్య ఆర్థిక, వాణిజ్య సహకారాభివృద్ధికై 15 సంవత్సరాల ఒప్పందం జరిగింది. దానిని అమలు జరుపుతూ ఖనిజ తైల నిధుల అన్వేషణకు, బొగ్గు పరిశ్రమ అభివృద్ధికి, ఇంకా అనేక రంగాలతో సహకారం అందచేయడానికి ఉన్నతాధికార నిపుణ బృందాలు మన దేశం వచ్చేయి. వీటన్నింటి దృష్ట్యా విశాలాంధ్ర ప్రచురణాలయం తీసుకువచ్చిన ఈ పుస్తకానికి ప్రత్యేక విలువ వుంది.

దీనిలో ఆయన జీవిత సంగ్రహంతోపాటు 1970 ఏప్రిలు 21—1973 మే 21 మధ్య కాలంలో వివిధ సందర్భాలలో ఆయన చేసిన ప్రసంగ భాగా లున్నాయి. ఒక మహాదేశ నాయకుడుగా, ప్రపంచంలో కెల్ల అతిబలీయమైన ప్రజాపార్టీ నాయకుడుగా ఆయన చేసిన ప్రసంగాలకు సోవియటులోనే గాక అంతర్జాతీయంగానే ప్రాముఖ్యం వుంది.

ఈ ప్రసంగా లన్నింటా పొడుగునా మనకు కనిపించే భావాలు రెండు. ఒకటి జాతీయ లక్ష్యాలను తెలిపేదీ. రెండోది అంతర్జాతీయ లక్ష్యాలను తెలిపేదీను.

'...సోషలిస్టు వుత్పత్తిని అధికతరవేగంతో అభివృద్ధి చేయడం, ఇంకా ఎక్కువ సామర్థ్యం, శాస్త్రం, సాంకేతిక ప్రగతి, శ్రామిక ఉత్పాదక శక్తిని అంతకంతకు పెంచడం, ఈ ప్రాతిపదికపై ప్రజల జీవన ప్రమాణాలలో మునుపటికన్న గణనీయంగా ఎక్కువ పాదార్థిక, సాంస్కృతిక స్థాయిని సాధించడం'... సోవియటుపార్టీ 24 వ మహాసభ నిర్ణయాలు.

'ఇంత విస్తృత స్థాయిలో యిలాంటి లక్ష్యాలను మనం మునుపెన్నడూ నిర్ణయించుకోలేదు'— అంటారు బ్రెజ్నేవ్.

'ప్రజల ప్రయోజనాలూ, వారి సంక్షేమం

పట్ల శ్రద్ధా, వారి ఆత్మిక, సాంస్కృతిక అభివృద్ధీ—ఇదే పార్టీ కార్యకలాపాల పరమ లక్ష్యం. పార్టీని స్థాపించడంలోని వుద్దేశమే యిది. ఈ లక్ష్యాన్ని సాధించేందుకే విప్లవం తెచ్చేరు...' (పుట 117) అంటూ సంగ్రహంగా పార్టీ లక్ష్యాల్నీ, ప్రగతినీ, భావికార్యక్రమాన్నీ వివరిస్తూ, 1971 జూన్ 11 న బౌమన్ స్కీ జిల్లా (మాస్కో)నుంచి సుప్రీం సోవియట్ నియోజకవర్గ అభ్యర్థిగా చెప్పిన మాటలే మన కాయన ప్రసంగా లన్నింటా వినిపిస్తాయి.

దీని ఆధారంగా రూపొందించుకొన్న అంతర్జాతీయ కార్యక్రమం లక్ష్యాలు రెండోది.

'సోవియట్ యూనియనులో కమ్యూనిస్టు నిర్మాణాన్ని కొనసాగించడం కోసం, శాంతియుత పరిస్థితులను నెలకొల్పేందుకూ, సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తుల కార్యకలాపాలను బట్టబయలు చేసేందుకూ, సోషలిజాన్నీ, దేశదేశాల ప్రజల స్వాతంత్ర్యాన్నీ, శాంతినీ కాపాడేందుకూ...పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ తమ సర్వశక్తులా కృషి చేశాయి.' (పుట 101.)

అయితే—'అంతర్జాతీయ వ్యవహారాల్లో అంతా మన ఒక్కరిమీదనే లేదు. మన మిత్రులపైనే ఆధారపడి లేదన్నది నిస్సందేహం...కొన్ని ముఖ్యమైన పనులింకా పూర్తికావలసి వుంది'—అన్నారు బ్రెజ్నేవ్ 24 వ పార్టీ మహాసభ కిచ్చిన నివేదికలో పుట (115).

సోషలిస్టుదేశం సోషలిస్టేతర దేశాలతో ఆర్థిక సంబంధాలేనా పెట్టుకోవడాన్ని సిద్ధాంత రీత్యానూ, ఆచరణాత్మకంగానూ వ్యతిరేకించేవారికి సమాధానం అన్నట్లుగా ఆయన మే 21 న (1973) పశ్చిమ జర్మనీలో చేసిన టెలివిజన్ ప్రసంగంలో ఇల్లా అన్నారు.

'మా పథకాలకూ, స్వయం పోషకత్వ పథకాలకూ ఎట్టి పొత్తూ లేదు. మా దేశానికి బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా చేసే విధానాన్ని మేము అనుసరించడం లేదు. పై పెచ్చు బైటి ప్రపంచంతో సర్వతోముఖ సహకారం దినదినాభివృద్ధి చెందే పరిస్థితుల్లో, మా దేశం అభివృద్ధి చెందుతుందనే అవగాహనతో మేము వ్యవహరిస్తున్నాం. సోషలిస్టు దేశాలతో మాత్రమేగాక, మాకు విరుద్ధమైన సామాజిక వ్యవస్థకు చెందిన దేశాలతోకూడా ఈ సహకారం వృద్ధి పొందాలని మా అభిప్రాయం.' (పుట. 257–258)

సంగ్రహంగా చెప్పాలంటే శాంతి, సౌమనస్యం, విభిన్న ఆర్థిక వ్యవస్థలు గల దేశాలమధ్య సహజీవనం, సహకారం సోవియటు విదేశాంగ నీతికి ప్రాతిపదికలు. చాలామంది భావిస్తున్నట్లు వీనిని బ్రెజ్నెవో, 24 వ పార్టీ మహాసభో, అంతకు పూర్వం కృశ్చేవో ప్రతిపాదించినవీ, అమలు జరిపినవీ కాదు. సోవియటు యూనియను పుట్టిన నాటినుంచి అది అనుసరించిన విధానమే యిది. ఈ విధానానికి రూపకల్పనచేసిన మహావ్యక్తి లెనిన్. ఆయన కర్తృత్వం క్రిందనే 1917 నవంబరు 8 న సోవియట్ చేసిన మొట్ట మొదటి ఆ శాసనం, శాంతి గురించి. 1921 ఫిబ్రవరి 28 న ఇరాన్‌తో, అదే మార్చి 16 న టర్కీతో, ఆగస్టు 31 న అఫ్‌గనిస్తాన్‌తో స్నేహసంధులు చేసుకొంది, సోవియటు. ఈ విధానాన్ని సమర్థించుకొంటూ, లెనిన్ సోవియట్ల రెండవ కాంగ్రెసు ప్రతినిధుల సమావేశంలో ఇల్లా అన్నారు. 'మన పరిస్థితులూ వారి పరిస్థితులూ వేరు. కనక సంప్రదింపులు ప్రారంభించి లాభం లేదనే అవకాశం శత్రువుల కివ్వకూడదు. ఆ అనుకూల స్థానం వాళ్లకు లేకుండా చెయ్యాలి. మన షరతుల్ని అంతిమ సందేశం రూపంలో వారి ముందు పెట్టకూడదు. అంటే మనం ఎటువంటి శాంతి షరతుల నైనా, ప్రతిపాదనల నైనా ఆలోచించడానికి అంగీకరిస్తున్నా మన్నమాట. వానిని ఆలోచిస్తాం. అయితే వానిని అంగీకరిస్తామనే అర్థంలేదు. వానిని రాజ్యాంగసభముందు పెడతాం. దేనిని అంగీకరించాలి, దేని నంగీకరించరాదో నిర్ణయించే అధికారం దానిది.'

[లెనిను—సోవియటు విదేశ రాజకీయాలలో ఉదాహరణం—పుట—22]

ఈ ఆలోచనా విధానానికి ఫలితమే శాంతియుత సహజీవనం.

'దేశాలమధ్య తగవులోవున్న అంశాలను బల ప్రయోగంతోగాని, యుద్ధంతోగాని గాక శాంతియుత మార్గంలో పరిష్కరించుకోవాలని ఈ సూత్రం అర్థం' అన్నారు 1969 లో జరిగిన అంతర్జాతీయ

కమ్యూనిస్టు— వర్కర్సుపార్టీల అంతర్జాతీయ మహా సభలో, బ్రెజ్నేవు. అయితే పక్కనే మరొక్క విషయం కూడా తెగేసి చెప్పేరు, అక్కడే.

'శాంతియుత సహజీవనం అన్నది సిద్ధాంత పోరాటానికి వర్తించదు.'

అంతేకాదు.

'సోషలిస్టు, పెట్టుబడిదారీ రాజ్యాలమధ్య యుద్ధం లేకపోవడంగానే వుంచకూడదు. శాంతియుత జీవన పరిస్థితులను పాటిస్తే వానిమధ్య సంబంధాలు విస్తరించడానికి విస్తృతావకాశాలు లభిస్తాయి. చర్చలలో అంతర్జాతీయ సమస్యల పరిష్కారం గురించీ, యుద్ధప్రమాదం తగ్గించేందుకూ, అంతర్జాతీయ వుద్రిక్తతలను తగ్గించేందుకూ తీసుకొనే చర్యలను సమన్వయ పరచడం గురించి, పరస్పరానుకూల ఆర్థిక, వాణిజ్య, శాస్త్రీ, సాంకేతిక, సాంస్కృతిక సంబంధాలు పెంచుకోడం గురించీను నేను చెప్పేది.'

[అదే వుపన్యాసంలో]

ఈ అభిప్రాయాలను సోవియటుపార్టీ, ప్రభుత్వమూ అమలుపరచ ప్రయత్నించేయి, ఏంతవరకూ విజయం పొందేయి, ఇంకా ఏంచెయ్యాలి అనే విషయాలను బ్రెజ్నేవ్ ప్రసంగా లన్నింటా, ముఖ్యంగా 24 వ పార్టీ మహాసభ కిచ్చిన నివేదికలోనూ, (1971 మార్చి 30) సోవియట్ ట్రేడ్ యూనియన్ల మహా సభలో (1972 మార్చి 20) చేసిన ప్రసంగం లోనూ సవివరంగా తెలుపబడినాయి.

అటుతరవాత గడచిన రమారమి ఈ రెండేళ్ల కాలంలోనూ ఆ కృషి మరింత ఫలప్రద మయింది.

వియత్నాం యుద్ధం అమెరికా పరాజయ స్వీకారంతో ముగిసింది. మధ్యప్రాచ్యంలో అరబ్బులు ఇజ్రాయిలీల అజేయభావాన్ని దెబ్బతీసి, వారిని చర్చలకు తీసుకురాగలిగేరు.

ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారీ విధానం తీవ్రఆర్థిక సంక్షోభాలకు గురి అవుతూంది. కర్రెన్సీ ఒడుదుడుకులు సర్దుబాటు చేసుకోలేనంత తీవ్రంగా వస్తున్నాయి. పైగా ప్రస్తుతం వ్యాపించివున్న ఇంధన సంక్షోభం దాని అతితీవ్ర దుష్ఫలితాలూను.

రెండో వేపున సోషలిస్టు వ్యవస్థలోవున్న దేశాల పురోభివృద్ధి—ఎవరు ఎంత కాదన్నా విస్పష్టంగా కనిపిస్తూండడం.

ఇటువంటి ఘట్టాలు ఎదురైతే సాధారణంగా సామ్రాజ్యవాద దేశాలు తొక్కే అడ్డదారి యుద్ధ ప్రజ్వలనం. ఒక్క ఢిల్లీని గాక సాధ్యమైనన్ని ఎక్కువ ఢిల్లీలను సృష్టించడమూను.

కాని, ఆ పని జరగలేదు. సరికదా పది పన్నెండేళ్లగా పట్టుకు వస్తున్న ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణం చల్లబడింది. యూరపు రాజ్యాలను శాశ్వతంగా తూర్పు పశ్చిమ రాజ్యాలనుగా విడదీసి వుంచాలనే ప్రయత్నం భగ్నమయింది. నాటో వ్యవస్థను సజీవంగానే వుంచి, వార్సా సంధి రాజ్య శిబిరాన్ని తప్పని సరిచేసినా యూరపులో సమష్టి భద్రతా వ్యవస్థను నిర్మించడానికై ప్రాథమిక చర్యలు సాగుతున్నాయి.

ఈ పరిస్థితినే బ్రెజ్నేవ్ కమ్యూనిస్టు యువజన సంఘం 16 వ మహాసభలో (1970 మే 26) బ్రెజ్నేవ్ ఇల్లా చెప్పేరు:

'ప్రపంచరంగంలో రెండు సామాజిక వ్యవస్థల మధ్య తీవ్ర పోరాటం జరుగుతున్న యుగంలో మనం జీవిస్తున్నాం. సామ్రాజ్యవాదం ఇంకా అస్త్రసన్యాసం చెయ్యలేదు. అంతర్జాతీయ పరిస్థితి కారణంగా మనం సోవియటు సాయుధ బలాల రక్షణ స్తోమతునూ, వాటి పోరాట సంసిద్ధతనూ పటిష్ఠం చేసుకోవడం తప్పనిసరి అవుతూంది. ఇది మన పవిత్ర కర్తవ్యం.'

(లియోనిద్ బ్రెజ్నేవ్—పుట 70.)

అయినా యూరపులో ఉద్రిక్తతల ప్రశమనకు సాగిన కృషి ఫలోన్ముఖ మవుతూంది. యూరపు భద్రతా వ్యవస్థ ఏర్పాటుకు ప్రథమ ప్రయత్నాలు నడుస్తున్నాయి.

అటువంటి మంచి వాతావరణం ఆశియాకు మాత్రం అక్కర్లేదా?

ఒకప్పుడు అక్టోబరు విప్లవ సంవత్సరోత్సవాల్ని గురించి లండన్ టైమ్స్ పత్రిక వ్రాస్తూ వింటర్ పాలెస్‌మీద దాడిసాగుతూ, అఖిల రష్యా సోవియట్ల మహాసభ జరుగుతున్నప్పుడు రష్యను కాలెండరులో తేదీ అక్టోబరు 25 పశ్చిమ దేశాల కేలండరులో అది నవంబరు 7. కాలెండరు తేదీలలో

పశ్చిమదేశాలకన్న రష్యా వెనకబడి వున్నది 13 రోజులే కాని, పారిశ్రామికాభివృద్ధిలో 100 ఏళ్ళు వెనుకబడి వుంది. రాజకీయ సామాజిక నిర్మాణంలో 150 ఏళ్ళు వెనుక బడి వుంది. ఈవేళ సోవియటు యూనియనూ, దాని సహచర రాజ్యాలూ తాము సాధించిన ఘన విజయాల నొక్కమారు తిరిగి చూసుకొంటున్నాయి. నిస్సందేహంగా గర్వపడదగిన విషయం - అంది.

—దేశీయ వ్యవహారాలలోనే కాదు. అంతర్జాతీయ పరిణామాలలోకూడ సోవియటుపార్టీ 24వ మహాసభ వేసుకొన్న కార్యక్రమం విజయవంతం అవుతూంది -- అదికూడా తక్కువ గర్వకారణం కాదు.

1969 జూన్‌నెలలో కమ్యూనిస్టు— వర్కర్స్ పార్టీల అంతర్జాతీయ మహాసభలో బ్రెజ్నేవ్ ఆశియాకు సమిష్టి భద్రతావ్యవస్థ సూచనచేసినప్పుడు కొందరు నవ్వేసేరు. కొందరు మరో యుద్ధకూటమా— యని చప్పరించేసేరు. మరికొందరు సాధ్యమయ్యేపని కాద న్నారు. కొందరు తమ అనుమానాలు మనస్సులో వుంచుకొని వూరుకున్నారు.

బ్రెజ్నేవ్ తన సూచనను క్రమంగా విస్తరిస్తూ; విశదీకరిస్తూ వచ్చేరు. దానిలో చైనా ప్రవేశానికి అభ్యంతరం లేదనేది మొన్నమొన్నటి విస్పష్ట ఆహ్వానం అయినా, ఆ వ్యవస్థకు మూలసూత్రాలు విషయంలో విస్పష్టమైన వివరణ 1972 మార్చి 20 న సోవియట్ ట్రేడ్ యూనియన్ల మహాసభలోనే ఇచ్చేరు.

'దేశాలమధ్య సంబంధాల్లో బలప్రయోగాన్ని విసర్జించడం, దేశాల సర్వసత్తాకతనూ, సరిహద్దుల అనుల్లంఘనీయతనూ గౌరవించడం, ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకుండా వుండడం, పూర్తి సరిసమానత్వం, పరస్పరలాభాల ప్రాతిపదికపై ఆర్థిక, తదితర సహకారాలను విస్తృతంగా అభివృద్ధిపరచుకోవడం —ఆశియాలో సమష్టి భద్రత యిటువంటి సూత్రాలపై ఆధారపడి వుండాలన్నది మన దృక్పథం.'

[లియొనిద్ బ్రెజ్నేవ్, పుట—181]

ఆశియా సమష్టి భద్రత గురించి సోవియటుకు ఇంత శ్రద్ధ ఎందుకు? ఇది ఇతర దేశాల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడం కాదా, అనడం దగ్గరనుంచి, ఏదో ఒక దేశంమీద కక్ష తీర్చుకొనేందుకు చేస్తున్న పని కాదా యనే ప్రశ్నవరకూ అనేక రూపాల ప్రశ్నలు వేస్తున్నారు.

సోవియటు యూనియను విస్తృతిలో మూడింట రెండు వంతులు ఉరల్సు పర్వతాలకు తూర్పున ఆశియా లోనే వుంది. దక్షిణాన హిందూకుష్ పర్వతశ్రేణినుంచి ఉత్తరధ్రువ సముద్రంవరకూ వ్యాపించివుంది. అందుచేత భారతదేశం, చైనా, కొరియా లంతగానూ సోవియటు యూనియను ఆశియాఖండ దేశమే. ఆశియా ఖండంలో వచ్చే కల్లోలాలు దాని సరిహద్దులకు తగలకుండా వుండవు. కనకనే ఆశియా సమష్టి భద్రత యెడ సోవియటుకు అంత శ్రద్ధ.

ఈ శాంతివాంఛ, సహజీవనవాంఛ, సమష్టి భద్రత ఆతురత—ఇవన్నీ మిగిలిన ప్రపంచ ప్రజలకు కూడా అవసరమే. అయినా, వీనినుంచి సోవియటు నాయకులు ప్రత్యక్షంగా కోరేది ఏమిటో పశ్చిమ జర్మనీలో చేసిన టెలివిజన్ ప్రసంగంలో చెప్పేరు, బ్రెజ్నేవ్.

'సోవియటు ప్రజలు రేపు, నేటికన్నా మంచి జీవితం గడపాలన్నది మా లక్ష్యం.'

[లియొనిద్ బ్రెజ్నేవ్, పుట 257]

ఇంతవరకే చెప్పి ముగిస్తే కమ్యూనిస్టు వుద్యమము, సోషలిస్టురాజ్య కుటుంబము, దానికి నాయకత్వం వహిస్తున్న సోవియటు యూనియను సోవియటు ప్రజల అభివృద్ధి లక్ష్యంతో సామ్రాజ్య వాదులతో, పెట్టుబడిదారీ విధానంతో సఖ్యతకు ఆతురత పడుతున్నదని చైనా సాగిస్తున్న ప్రచారానికి తావివ్వడమే అవుతుంది.

జరిగిందీ, జరుగుతున్నదీ అంతేనా?

వియత్నాముపంటి చిన్నదేశం, మహాబలవంతమైన అమెరికావంటి దేశాన్నీ, దాని అసామాన్య ఆయుధ సంపదనూ ధిక్కరించి నిలిచి, ఓడించి, రాజీకి రప్పించగలిగిందంటే ప్రపంచంలోని అభ్యుదయ కాముకులంతా దానియెడ కనబరచిన సుహృద్భావం, సానుభూతి మాత్రమే చాలవు. సాదార్థిక సాయం కావాలి. దానిని అందచేసినది సోషలిస్టు కుటుంబమూ, ముఖ్యంగా సోవియటూ.

ఒక దిశను సహజీవనానికి ప్రయత్నిస్తూనే,

తెండోవేపున వియత్నామీ ప్రజల స్వాతంత్ర్య పోరాటానికి సాయపడింది.

ఎందుకు? 'విప్లవం ఎగుమతి చేయబడే వస్తువుకాదు'—అనేదే కాదు. 'విప్లవ నిరోధాన్ని ఎగుమతిచేసి ప్రజల అభీష్టాలను అణచివేయడానికి అంగీకరించరాదు'—అని కూడ సోవియటు దృఢనిశ్చయం.

ఆ దృఢనిశ్చయం తన సరిహద్దులలో, సోషలిస్టు కుటుంబానికిచెందిన హంగరీ, జెకోస్లోవాకియాల మీద విప్లవ ప్రతీఘాతకులు కుట్రలుచేసినప్పుడేకాదు క్యూబాతో 1961 లో, బాంగ్లాదేశ్‌వద్ద 1971 మరోమాటుకూడ కనబరచింది. లేకుంటే అమెరికా బంగాళాఖాతంలోకి ఏడవ నౌకాసైన్యం తెచ్చినందు వలన ఎటువంటి దుష్ఫలితాలు కలిగివుండేవో మనం వూహించలేనిది కాదు.

మధ్యప్రాచ్యంలోనూ, ఆఫ్రికాలోనూ కూడ మనకు కనిపించే చిత్రం ఇదే.

ఇంతతోకూడ ఈ చిత్రం పూర్తికాదు. వర్ధమానదేశాలతో సర్వతోముఖ సహకారం నెరపడం అందులో ఒకభాగమే. నయావలసవాదుల చేతిలోపడి, ఈదేశాలు తాము సంపాదించుకొన్న స్వాతంత్ర్యాన్నికూడా కోల్పోయి, సామ్రాజ్యవాదులు రగులుస్తున్న కమ్యూనిస్టు వ్యతిరేక అగ్నిగుండంలోకి సమిధలు కాకుండా చెయ్యాలంటే అవి ఆర్థిక స్వాతంత్ర్యం సాధించేటందుకు తోడ్పడాలి. ఆ తోడ్పాటు ఆ దేశాలు సోషలిస్టు పంథాకు మళ్లేందుకు, మళ్లిన తరవాత సులభంగా ఆత్మరక్షణ చేసుకొనేందుకు సాయపడే బలమైన ప్రజాతంత్ర వుద్యమం ఏర్పడేందుకు తోడ్పడాలి. ఆ ప్రజాతంత్ర వుద్యమాన్ని బలపరచుకోవలసింది, ఆయా దేశాలవారు సోవియటుకాదు. 'విప్లవం ఎగుమతి చేయబడదు' అది గుర్తుంచుకోవాలి. దానికి తోడ్పడే శక్తులకు సాయం చేయడం, ఆ పూర్వరంగం తయారు కావడానికి తోడ్పడనుమానే అది చేయగలదు.

భారతదేశం మొదలైన ఆశియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోని వర్ధమాన దేశాలలో ప్రభుత్వ రంగంలో పరిశ్రమల నిర్మాణానికి చేస్తున్న సహాయం వెనుకనున్న అభిప్రాయం అదే. అజ్ఞాత నాగాలకు ఆయుధాలిచ్చి కల్లోలాలు రేపడంవలన దేశం పోరాటాలూ విచ్ఛిన్నం అయే ప్రమాదం వుంది కాని, ప్రభుత్వ రంగంలో పరిశ్రమల నిర్మాణం సోషలిస్టు ఆర్థికాభివృద్ధికి కావలసిన మెట్లును దృఢపరచడమే అవుతుంది. ప్రజా పోరాటాల కది బలకరం.

లియొనిద్ బ్రెజ్నేవ్ ప్రసంగాలు అన్నింటా సోవియట్‌పార్టీ పదేపదే చేస్తున్న లక్ష్య ప్రకటనలు ఎంత వరకూ సిద్ధించేయో, ఇంకా ఏం చేయవలసివుందో సోవియటు ప్రజలకు, ప్రపంచ అభ్యుదయ కాములకు గుర్తు చేస్తున్నారు.

'సోవియట్ యూనియను శాంతికాముక దేశం. అసలు మన సోషలిస్టు వ్యవస్థ స్వభావమే ఇందుకు కారణం. తక్కిన సోషలిస్టుదేశాలతో కలిసి, సోషలిజాన్నీ, కమ్యూనిజాన్నీ నిర్మించేందుకు, అనుకూలమైన అంతర్జాతీయ పరిస్థితులను నెలకొల్పడం, సోషలిస్టుదేశాల ఐక్యతా సంఘీభావాలనూ, పరస్పర మైత్రీ సౌభ్రాతృత్వాలనూ పటిష్ఠం చేయడం. జాతీయ విముక్తి వుద్యమాలను బలపరచడం, తరుణ వర్ధమానదేశాలతో సర్వతోముఖ సహకారం నెరపడం, విభిన్నసామాజిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవన సూత్రాన్ని ఏకరీతిగా బలపరచడం, సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులను గట్టిగా తిప్పికొట్టి, మరొక ప్రపంచయుద్ధం బారి నుండి మానవజాతిని కాపాడడం—' (పుట 75)

సోవియటు కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ నిర్ధేశించి, 24 వ మహాసభ దృఢపరచిన ఈ విదేశాంగ నీతిలక్ష్యాలను అర్థంచేసుకొనేందుకు తోడ్పడుతున్న ఈ పుస్తకం రాజకీయంగా పరిణత బుద్ధి అయిన తెలుగు ప్రజకు చాలా వుపయోగకరం కాగలదని చెప్పవచ్చు.

—'అవంతి'

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd. by
**S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street,**
**Madras 600001 Editor : S. Radhakrishna.**